

నిజామాబాదు జిల్లా ఆర్మూర్‌కు చెందిన సలీం అమోరి 'పాయింటిలిజం' అనే పోస్టు ఇంప్రెషనిస్టు ఐరోపా శైలిలో రూపొందించిన చిత్రాలు ఇవి. రేఖలతో కాకుండా రంగు రంగుల చుక్కలను పలుచగా, మందంగా పేర్చడం ద్వారా ఈ విధానంలో చిత్రాలను సృష్టిస్తారు. సాధారణంగా కేన్వాసుపైన, పేపర్ పైన వీటిని వేస్తుంటారు. కాని, గ్లాస్‌పై ఇంకులను వినియోగించడం సలీం ప్రత్యేకత, అదే అదనపు ఆకర్షణ. శైలి పాశ్చాత్యమైనా ఆయన చిత్రాలు పూర్తిగా దేశీయమని చూస్తుంటేనే అర్థమవుతుంది.

సాహిత్య ప్రస్థానం

సంపుటి : 6 మే, 2008 సంచిక : 31

# మళ్ళీ మే దినోత్సవ స్ఫూర్తి

టీవీ ఛానళ్ల విస్తరణ తర్వాత వేడుకలు బాగా పెరిగిపోయాయి. వలెంటైన్స్ డే, మదర్స్ డే, ఫాదర్స్ డే, డాక్టర్స్ డే ఇలా ఎన్నెన్నో! కాని అంతకు చాలా ముందు నుంచి ప్రపంచమంతా అమలు జరుగుతున్న మే దినోత్సవానికి ఈ జాబితాలో చోటు లేకపోవడం యాదృచ్ఛికం కాదు. మిగిలినవన్నీ వినోద ప్రధానమైనవైతే ఇది విప్లవాత్మకమైంది. తక్కినవన్నీ వ్యాపార సంస్కృతితో వస్తు విక్రయాలను పెంచుకోవడానికి ఉద్దేశించినవి. మేడే మాత్రం శ్రమ జీవుల పోరాటాలతో ముడిపడి వుంది.

1886లో మే నెలలో చికాగో నగరంలోని హే మార్క్ చౌక్‌లో తారాస్థాయికి చేరిన కార్మిక వర్గ సంఘర్షణ ఎనిమిది గంటల పని దినం కోసం మొదలైన పోరాటం. హక్కుల కోసం పోరాటంలో తర్వాత శ్రామికవర్గం అనేక విజయాలు సాధించింది. విప్లవాలూ సాధించింది. గత శతాబ్ది చివరలో అనేక విచ్ఛిన్నాలూ ఎదుర్కొంది. దానంతటి వల్లా వచ్చిపడిన ప్రపంచీకరణ అదివరకటి విజయాలను తలక్రిందులు చేసింది. ఎక్కడి దాకానో ఎందుకు, మొన్న బడ్జెట్ సర్వేలో ఆర్థిక మంత్రి చిదంబరం పది గంటల పని వుండాలని, అదనపు జీతంతో మరో మూడు గంటలు పనిచేయించుకునే వెసులుబాటు కల్పించాలని ప్రతిపాదించారు. వచ్చిన మార్పులకు ఇదో మచ్చుతునక. వేలాది రూపాయల జీతాలు వస్తున్నందుకు మురిసిపోయే సాఫ్ట్‌వేర్ పీపుల్ కూడా ఆన్‌లైన్‌లో అర్థరాత్రి సేవలు అందించక తప్పని స్థితి. వర్కింగ్ ఆఫ్‌ల వంటి కొత్త మాటల పుట్టుక. కార్మికులు, ఉద్యోగులు పోరాడి సాధించుకున్న ఉద్యోగ భద్రతకు, హక్కులకు తిలోదకాలు. చెప్పాలంటే ఇంకా చాలా వున్నాయి. అందుకు ఈ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ శ్రమజీవులకూ సామాన్య ప్రజలకూ రైతులు వ్యవసాయ కార్మికుల ప్రయోజనాలను నిర్దాక్షిణ్యంగా కాలరాచి వేస్తుంది.

దీనిపై అంతర్జాతీయ స్పృహతో పోరాడటం ఇప్పుడు మరింత అవసరమన్నది మేడే సందేశం. ఇందుకు సాహిత్య రంగంలోనూ కృషి పెరగాలి. శ్రామికవర్గ చైతన్యం శక్తివంతంగా ప్రసరించాలి.

కథల బొమ్మలు : వెంకటేశ్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
ఎ.సత్యభాస్కర్
వీరప్రసాద్
ఎం.నరహరి

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్లు : 27660013, 27635136

# కళ్ళెం



ఎప్పటిలా మళ్ళీ తెల్లవారింది. ఎప్పటిలా మళ్ళీ ఉరుకులు, పరుగులు... ఎక్కడ చూసినా జనం... ఏదో పోగొట్టుకున్నది వెతుక్కుంటున్నట్లు తెగ కంగారు... వెనుక ఎవరో పిస్టల్ పెట్టి బెదిరిస్తున్నట్లుగా కర్తవ్య నిర్వహణ... ఉసూరుమంటూ యింటికి రావటం.. మళ్ళీ తెల్లవారుతుంది గదా అని అర్థంలేని టెన్షను.

కోటమర్తి రాధా హిమబిందు

"నాన్నగారూ"

"ఊ"

"ఫీజు కట్టాలి"

'నాకేం గుర్తు చేయనవసరం లేదు. పది రోజుల క్రితమే ఖర్చుల లిస్ట్ తయారు చేశాను.. యిస్తాను" కసురుకున్నాను అలేఖ్యని .. కామ్‌గా లోపలికి వెళ్లిపోయింది అలేఖ్య.. మళ్లీ పేపర్‌లో తల దూర్చాను.. పేపర్‌లోకి కళ్ళు చూడటమే... మనసు కందిరీగల తుట్టెలాంటి ఆలోచనల్ని కదిలించింది.

"ఏమండీ"

"ఊ"

"కాఫీ"

నాకో కప్పు అందించి నా ఎదురుగా గూర్చుంది నా శ్రీమతి సరళ.

'సరళా.. యిలా అంటున్నాని మరోలా అనుకోక.. కప్పుల నిండా త్రాగాలా కాఫీ.. సగం కప్పు తాగితే ఏమవుతుంది చెప్పు".

ఎంతో యిష్టంగా కాఫీ సిప్ చేస్తున్న సరళ సిప్ చేయటం ఆపేసింది.. నాలో చిన్నపాటి జంకు కలిగింది. సరళ ఏం క్లాసు తీసుకుంటుందో అని.. అదే జరిగింది.

'మీరు ఎందుకండీ యిలా మారిపోతున్నారు... అరెరె.. ఓ సరదా లేదు సంతోషం లేదు. పిల్లల్ని విసుక్కుంటున్నారు.. నన్నేదో అంటున్నారు.. మీరు ఏదో వర్రీలో వుంటుంటారు. అసలు ఎందుకిలా? ఏది అడిగినా ఏం లేదు అంటారు. విషయం చెప్పరు. నాకూ విసుగొస్తుంది. మొన్ననేమో పిల్లలకు పాలు ఇవ్వకుంటే ఏం.. హార్లిక్స్.. బూస్ట్ ఖర్చు వుండదు అన్నారు. మూడు పూటల అన్నం తినటం చాలామంచిది అని లెక్చర్ యిచ్చారు. కొన్నింటికి అలవాటు పడిపోయాం అలా అయితేనే యిష్టంగా వుంటుంది.. కనీస అవసరాలు, కనీస ఖర్చుల గురించి యిలా మాట్లాడుకోవడం ఎబ్బెట్టుగా వుంది" విసురుగా అంది సరళ.

"ఎందుకు సరళా విసుగు.. నువ్వు హాయిగానే వుంటున్నావు గదా.. సీరియళ్లు చూస్తావు. యిరుగు పొరుగు వారితో గంటలకు గంటలు చాలా బాతాఖానీ వేస్తావు"

నా మాటలకు మధ్యలోనే అడ్డం వచ్చింది సరళ.

"పోనీ అలా వద్దంటారా? మరేం చేయమంటారు చెప్పండి.. మీరేం చెప్పకున్నా నాకు అర్థం అవుతూనే వుంది. మీకు డబ్బు పిచ్చి పట్టింది... పోనీ... నేనూ ఏదైనా ప్రైవేటు స్కూల్లో పని చేయనా? వెయ్యో... పదిహేను వందలో వస్తాయి."

"చెయ్యరాదూ.. నేను ప్రత్యేకంగా చెప్పాలా? యిద్దరూ ఉద్యోగాలు చేసేవాళ్లు లక్షల్లో వున్నారు. వాళ్లు ఎంత ఆనందంగా గడుపుతున్నారు. డబ్బు ఎంత అవసరం." సరళ కంటే గొంతు పెంచి అన్నాను నేను.

"మీరే అన్నారుగా ఏ ఉద్యోగం వద్దు.. పిల్లల్ని, నన్ను ప్రేమగా చూసుకో.. యింట్లో మెయింటెయిన్ చేయటం కూడా కష్టమే.. నువ్వు చదివిన యింటర్‌కి ఏం ఉద్యోగం వస్తుంది... వచ్చినా కష్టం ఎక్కువ... జీతం తక్కువ అని."

"నిజమే అన్నాను" అంటూ ఒప్పుకోలేక మౌనంగా వుండి పోయాను.

"టిఫిన్ ఏం చేయను"?

నన్నడుగుతావే?

"అడగక ఏం చేయను?

ఉప్మా అయితే ఖర్చు తక్కువ.. పిల్లలు పూరీ చేయమన్నారు దానికి నూనె బాగా పడుతుంది. ఉప్మాయే చేస్తాను" ఖాళీ కప్పులు తీసుకుని విసురుగా లోపలికి వెళ్లింది సరళ.

ఉప్మా అంటే యింట్లో నలుగురికీ అయిష్టమే. ఆదివారం నల్గురం ఒక దగ్గరగా వుండి కబుర్లు చెప్పకోటానికి కాస్త లీజరు.. అయినా ఎలాంటి కబుర్లు నేను చెప్పక చాలా కాలం అవుతుంది.

ఎంత లీజరుగా వుంటే అన్ని ఆలోచనలు..

"నాకు డబ్బు అంటే చాలా యిష్టం. కట్టలకు కట్టలు డబ్బు వుండాలని ఆశ. నాకు వచ్చే యిరవైవేలు కుటుంబాన్ని రోడ్డున పడకుండా వెళ్లదీస్తున్నాయి. అంటే ఏ నెలకి ఆ నెల యిలా అయిపోతే దాచేది ఎలా? పాప ఫోర్త్... బాబు సెకండ్ క్లాసు.. ముందు ముందు ఎంత ఖర్చు. ఈ మధ్య ఖర్చులను తగ్గించి జాగ్రత్త చేస్తున్నాను. అయినా పెద్దగా ఫలితం కన్పించలేదు.

ఛీ ఛీ.. యిదా జీవితం అంటే.. రోజూ యిలా అయితే బ్రతికే ఈ బ్రతుక్కి అర్థం ఏమిటి? నేనే యిలానా. అందరూ యింతేనా? నేను అనుకుంటా. ఎంతమంది ఎంత సంతోషంగా, ఆనందంగా గడపటం లేదు? పార్టీలు అంటూ హోటల్స్‌లో రష్.. సినిమాలు అంటూ థియేటర్స్‌లో రష్.. ఛాట్‌లు.. గార్డెన్స్ యివన్ని యింతింత జనాలతో ఎలా నిండి వుంటాయి. ఎంత సంపాదిస్తే యింతింత ఖర్చు పెట్టాలి.. సంపాదన తక్కువైనా నాలాంటి వాళ్లు కూడా యిలా ఖర్చు పెడుతూనే వున్నారు. నేను గమనించాను గూడా. వాళ్లకి ఆ ఖర్చు బాధగా అన్పించదా? ఎంత డబ్బును వృధా చేస్తున్నారు అని నాకే ఎలాగో వుంటుంది.

వాళ్లలా నేను ఎందుకు ఎంజాయ్ చేయలేకపోతున్నాను? యిది నా అసమర్థతా?

నా విషయాలని ఎవరికో చెప్పుకోవటం నాకస్సలు యిష్టం వుండదు. వాళ్లు ఏదో సలహా యివ్వటం.. దాంతో వాళ్ళ దృష్టిలో చీప్‌గా పడిపోతానని నాకో పెద్ద ఫీలింగ్. అయినా ఆరోజు ఎందుకో లంచ్ టైమ్‌లో వరప్రసాద్‌గారితో కొంచెం నా మనసు విప్పాను.

"సార్.. మీరు నెక్స్ట్ మంత్‌లో రిటైర్ అవ్వబోతున్నారు. మీరు ఆఫీసులో కనపడరనుకుంటే బాధగా వుంది"

"నేను దిగులు పడాల్సింది పోయి నువ్వు దిగులుపడతావేమోయ్? ఆఫీసుకు రాకపోతే ఏముంది? నువ్వే యింటికిరా.. మనం కల్సుకోవటం ముఖ్యంగానీ ప్లేస్ ఏదయితేనేం"?

"అహ.. అలా అని గాదు – సర్ నిజంగా చెప్పండి.. ప్రస్తుతం మీరు బాధగా ఫీలవుతున్నారా? హ్యాపీగా ఫీలవుతున్నారా"?

"నా మెంటాలిటీ ప్రకారం నేను హ్యాపీగా ఫీలవుతున్నాను. గవర్నమెంటు రెస్ట్ తీసుకోమంది. తీసుకుంటాను. అంతో యింతో డబ్బు వస్తుంది. జాగ్రత్తగా దాచుకుంటాను. నామిసెస్‌తో కొన్ని ప్రదేశాలు తిరిగి రావాలనుకున్నాను. యిదిగో యిప్పటికి తీరిక చిక్కింది. నిజంగా హ్యాపీగా వున్నానయ్యా. అయినా నేను నిన్నటి గురించి మర్చిపోతాను. రేపటి గురించి ఆలోచించను.. అందుకే ఈ మాత్రంగా వున్నాను."

"సార్ నేను యిలా అడుగుతున్నానని మరోలా అనుకోకండి. మీరు బాగా వున్న వాళ్లలా కన్పిస్తారు. కారు మెయింటెయిన్ చేస్తారు. ఎప్పుడూ హ్యాపీగా జోక్స్ కట్ చేస్తూ అందర్నీ నవ్విస్తుంటారు. యిది ఎలా? ఒక్క మాటలో చెప్పాలంటే మీలా నాకూ వుండాలని వుంది సార్".

అన్ని తెల్సిన జ్ఞానిలా నవ్వారు వరప్రసాద్‌గారు

"మరి వుండవోయ్.. ఏముంది యిందులో"

"సార్" యిబ్బందిగా చూశాను.

"మనకు బాగుంది అని అన్పిస్తే ఫాలో అయిపోవటమే.. పరమేశం.. నేను రిటైరవ్వబోతున్న సమయంలో ఈమాత్రంగా వున్నాను. నీ ఏజ్‌లో నేను యిలా లేను యిద్దరు చెల్లెళ్ల పెళ్లి బాధ్యత, తమ్ముడి చదువు బాధ్యత వుండేది. నాన్నగారు లేరు. నాన్నగారు చేసిన అప్పు మాత్రం కొంత వుంది. నేను ఆ రోజు ఒక్కటే అనుకున్నాను. యివన్నీ చేయాల్సింది నేనే అని. నా ఆలోచనలని ఎటో వైపు డైవర్ట్ చేయలేదు. నా మీద వున్న బాధ్యతలన్నీ సక్రమంగా నెరవేర్చాను. రిలాక్స్‌డ్‌గా ఫీలయ్యాను.

ఆ తర్వాత నా పిల్లలు, నా భార్య నా కుటుంబం అనుకున్నాను. నా పిల్లలు ప్రయోజకులయ్యారు. నాతో నిన్ను పోల్చుకుంటే నువ్వు చాలా అదృష్టవంతుడివి. నీకే బాధ్యతలు లేవు. ఓన్లీ నీ ఫ్యామిలీ మెయింటెయిన్ చేసుకోవటమే."

"అదికాదు సార్"

"నన్ను చెప్పనీయ్ పరమేశం.. నీ బాధ్యతని నువ్వు భారంగా అనుకోవద్దు. అది తప్పనిది, తప్పించుకోలేనిదని. పైగా నువ్వు మాత్రమే నెరవేర్చాల్సింది. వాళ్లేదో యిల్లు కొన్నారని, వీళ్లేదో కారు కొనుక్కున్నారని మనం ఆ లెవల్‌కి ఎప్పుడు వెళ్తాం అని అదే ధ్యాస పెట్టుకోవద్దు"

అతిగా ఆలోచించవద్దు.. తోటి వాళ్లతో సమానంగా లేదా ఎక్కువగా సంపాదించాలి అనే ధ్యేయం వున్నప్పుడు మనకున్న అవకాశాలు కూడా వాళ్లతో సమానంగా వున్నాయా లేదా అనేది కూడా ఆలోచించాలి. నీ జీతం యిరవై వేలు, నలభైవేల ఆలోచన చేస్తే ఎలా? అది ఖచ్చితం గాదు.. కాదుకదా అని నువ్వు వేదన పడితే ఎలా? అది హెల్త్ మీద ఎఫెక్ట్ పడుతుంది. యివన్నీ గాదు గానీ అన్నింటికన్నా ఆరోగ్యం ముఖ్యం అనుకో".

నా మనసులో విషయాలన్ని చదివినట్లు చాలా క్లుప్తంగా వరప్రసాద్‌గారు మాట్లాడుతుంటే నేను విస్తుపోయాను.

---

ఆ రోజు ఆఫీసుకు వెళుతున్న నేను ఉన్నట్టుండి కుప్పకూలిపోయాను. నా మిసెస్ ప్రక్కింటి వాళ్ల సహాయంతో నన్ను హస్పటల్‌కి తీసికెళ్లింది. డాక్టర్లు బి.పి. అని తేల్చారు. ఫలితం ఆ నెల ఖర్చులో టాబ్లెట్స్ యాడ్ అయ్యాయి.

'నాలో ఏదో తెలియని చిరాకు. అసహాయత. రాను రాను నా మనస్తత్వం తీరు నాకే విచిత్రంగా అన్పించింది. ఏదో తపన. సాధించలేకపోతున్నానన్న అసంతృప్తి... నన్ను చాలా నిర్వీర్యుణ్ణి చేస్తుంది. ఈ విశాల ప్రపంచంలో నాకో గుర్తింపులేకున్నా ఫర్వాలేదు. కానీ పదిమందిలో నేనో స్టేటస్ సింబల్‌గా కన్పించాలి అని నా ఆశ. కానీ కుదిరేనా? ఈ వందలు ఎప్పుడు వేలు గావాలి? ఈ వేలు ఎప్పుడు లక్షలు గావాలి.



ఎప్పుడో కొన్న సెల్ ఫోన్‌లో మాట్లాడుతుంటే ఏదో గిల్టీ ఫీలింగ్... అంతా కెమెరాలు.. వీడియోలు అంటూ సెల్‌ఫోన్లని తెగ వాడేస్తుంటారు. ఖరీదైన సోఫాసెట్ వుండాలి అని కోరిక.. నేను ఉద్యోగంలో జాయిన్ అయినప్పుడు కొన్న నాలుగు కుర్చీలే యిప్పటికీ వాడటం... ఖరీదైన షూ కొనుక్కోవాలంటే యింకేదో ఖర్చు గుర్తుకు వచ్చి మానివేయటం... ఖచ్చితంగా వద్దు అనుకోవటం... పైగా బాగా కూడబెట్టాలి... లక్షలకు లక్షలు పోగేసి ఓ యిల్లు, ఓ కారు కొనుక్కోవాలని పిచ్చి కోరిక... గూటిలో రాయి తీయలేనివాడు ఏటిలో రాయి ఏం తీయగలడు' అన్న సామెత గుర్తొచ్చి నిస్పృహగా ఫీల్‌గావటం.'

"ఏమండీ"

"ఊ"

"నేను మిషను నేర్చుకోవాలనుకుంటున్నాను. అలాగే చీరెల మీద డిజైన్లు... కుట్లు..."

"నీ యిష్టం"

"నా యిష్టం ఏంటండీ"

"ఓ.కే... ఓ.కే... వెళ్ళు... ఎన్నాళ్ళు పడుతుంది నేర్చుకోవటం..." అంటూ వివరాలన్నీ అడిగి తెల్సుకుని రాబోయే ఆదాయం లెక్కగట్టాను. "నీకు ఉద్యోగం కంటే యిదే బెస్ట్" అంటూ తేల్చేశాను... సరళ ఆ ప్రయత్నంలో పడిపోయింది.

ఆరు నెలలు గడిచాయి... ఆ రోజు యింటికి వచ్చేసరికి ముందు గదిలో చీరెలు పరిచి వున్నాయి. ఒక మూలకి సరళ మిషను కుడుతోంది. యిద్దరి చూపులు కల్సుకున్నాయి గాని ఏమీ పలుకరించుకోలేదు. స్నానం చేసి వచ్చి బెడ్ మీద వాలిపోయాను.

లీజరు... ఆలోచనలు...

లీజరు... లీజరు... నాలో తళుక్కుమని ఓ మెరుపు ఆలోచన... వెంటనే లేచి డ్రెస్ వేసుకుని బయటకు వెళ్ళిపోయాను. నాకో పార్ట్ టైం జాబ్ దొరికింది. సాయంత్రం ఆరు గంటల నుండి తొమ్మిది గంటల వరకు... శాలరీ రెండు వేలు... ఈ రెండువేలు కూడబెడితే ఏడాదికి ఇరవై నాలుగు వేలు... నాలో లెక్కలు మొదలయ్యాయి.

---

"బాగున్నారా?" నవ్వుతూ ప్రశ్నించాడు సోమయాజులు గారి కొడుకు భాస్కరశాస్త్రి.

"ఆ... మీ నాన్నగారు లేరా?"

"లోపల వున్నారు... ఏంటి గుడికి రాక చాలా కాలమైంది?"

"ఎక్కడా... తీరడం లేదు"

దేవుని దర్శనం చేసుకుని తీర్ధ ప్రసాదాలు ముగించుకొని కాస్త దూరంగా వచ్చి గోడకి ఆనుకుని కూర్చుండిపోయాను. గుడిలో నేను తప్ప యింకెవ్వరూ లేరు.

ప్రశాంత వాతావరణంలో కూడా ఆలోచనలు..

"ఏం బాబూ... బాగున్నారా?" అంటూ లోపలికి వచ్చారు సోమయాజులుగారు.

"నమస్కారమండీ.. బాగున్నారా... యిప్పుడే మీ గురించి మీ అబ్బాయిని అడిగాను."

''అవునా'' అంటూ నా ఎదురుగా కూర్చున్నారు సోమయాజులుగారు.

"ఏంటి పూర్తిగా తగ్గిపోయారు. వంట్లో బాగుండటం లేదా?"

"అవునండీ.. అంతకుముందు లో బి.పి. వుండేది. నిన్ననే షుగర్ అని తేలింది.

"అరెరె"

నామీద నాకే జాలి వేసింది.

"మీ విశేషాలు ఏంటి?"

ఏమున్నాయి బాబూ... ఈ మధ్యనే ప్రక్కన ఓ రెండు గదులు వేశారు దేవస్థానం వాళ్ళు. అందులోనే వుంటున్నాం... భాస్కర్ వెనుక వీధిలో వుంటున్నాడు... పెద్దబ్బాయి అమెరికా... రెండోవాడు బెంగుళూరు... మీకు తెల్సిందే గదా... వాళ్ళు హాయిగా ఆనందంగానే వున్నారు.. వీడితోనే బాధొచ్చింది. ఆ మధ్య ఆత్మహత్యా ప్రయత్నం చేశాడు.

"ఏంటీ" విస్తుపోయాను నేను.

"ఎలాగో బతికాడు లెండి... యిలా చేసి ఈ వయసులో మమ్మల్ని హింసించడం ఏమన్నా బాగుందా? వాడి వయసెంతని? ఓ... తెగ టెన్షను... వాళ్ళ అన్నలంత గొప్పగా బ్రతకాలని... తెగ సంపాదించేయాలని. అర్థం లేని పిచ్చితనం.. వాడి కొడుక్కి నాలుగేళ్ళు... అప్పుడే వాడు ఐ.ఎ.ఎస్. ఆఫీసరు అయిపోవాలని తెగ ఆరాటం...

వాడి ఎం.ఎ. చదువుకు లెక్చరర్‌గా జాబ్ చేస్తున్నాడు. ఓ పదివేలు సంపాదిస్తున్నాడు. అది చాలదా? ఆశకు అంతెక్కడ? ఆశకు ఓ హద్దు అంటూ వుండాలి... జీవించటానికి డబ్బు అవసరం అయినా ఆశలకు కూడా పరిమితి అంటూ వుండాలి... ఆశలు సముద్రం అంత అయితే, డబ్బు అనంతంగా గావాలి...

శరీరానికి వత్తిడి కల్గితే విశ్రాంతి తీసుకుంటే సరిపోతుంది. మానసిక వత్తిడి మన మనసుకు, మన ఆలోచనలకి కళ్ళెం వేయడం ద్వారానే తగ్గుతుంది... వీడికీ ఈ మధ్యనే మధుమేహం వచ్చింది బాబూ... అనుకోకుండా దానంతట అది ఏ వ్యాధి వచ్చినా అంతగా అన్పించదు.. యిలా చేజేతులా చేసుకుంటే ఏం చెప్పగలం? డబ్బు ముఖ్యం... ఆరోగ్యం కాదా? డబ్బు కోసం అదే కాలేజీలో ట్యూటర్‌గా చేస్తున్నాడు... రెండువేలు యిస్తున్నారు... ఆదివారాలు స్పోకెన్ ఇంగ్లీషు అంటూ మొదలుపెట్టాడు... వాడికి క్షణం తీరిక లేకుండా అయింది బాబూ... నువ్వు చాలా బుద్ధిమంతుడివి... వాడ్ని నీ తమ్ముడిగా భావించి కాస్త వాడికి చెప్పి చూడు నాయనా... "జీవితం విలువైంది, చిన్నది అని తెలియచెప్పు."

నాకేం చెప్పాలో తోచక దిక్కులు చూశాను...

"ఉద్యోగం వద్దు పాడూ వద్దు గుడి పనులే చూసుకోమన్నాను... మాకు ఆదాయం బాగానే వుంది... కానీ అస్సలు వినడు.. చేసే పనిలో అంతో యింతో విశ్రాంతి అవసరం కాదా! యిది చాలదు... యింకేదో గావాలి అని అనుకుంటే... అప్పుడే గదా అసంతృప్తి ప్రారంభం అయ్యేది. అదే అలా అలవాటుగా పడిపోతే మనిషినే అసంతృప్తి జయించదా! ఇక జీవితంలో సుఖ సంతోషాలు అంటూ ఏం వుంటాయి... డబ్బు... సంపాదన యివేనా ముఖ్యం.. కుటుంబం గాదా?

"అ..వు..నం..డీ.."

"ఏ విషయంలోనైనా మనకంటే తక్కువ వాళ్ళతో పోల్చుకోవాలి.. ఎక్కువ సంపాదించే వాళ్ళతో పోల్చుకుంటే పరిస్థితి యిలాగే వుంటుంది. జీవితాన్ని గాలికి వదిలేసి డబ్బు కట్టలు గావాలనుకుంటే ఎట్లా? ఆనందాలు, సంతోషాలు సమాధి చేసుకుని సారంలేని జీవితం గడపడంలో అర్థం వుందా?"

నేను ఒక్క వుదుటున లేచి నిలబడ్డాను.

– – –

"ఏమండీ"

"ఊ"

"కళ్ళు మసకగా అయిపోయాయి. రేపోసారి కళ్ళ డాక్టర్ దగ్గరికి వెళ్ళి వద్దాం"

"ఊ"

"మా అటెండర్ వీరాస్వామి... పోస్టుమెన్ గంగారామ్... భాస్కర శాస్త్రి... వీళ్ళ కంటే నేను గొప్పవాడ్నే... ఎస్... వాళ్ళ కంటే డబ్బున్నవాడినే... అప్పట్లో జీతం కంటే యిప్పుడు జీతం పెరిగింది. ముందు ముందు పెరుగుతుంది కూడా..." మూసుకున్న కళ్ళ నుండి కణతల మీదుగా కన్నీళ్ళు రాలి పడుతున్నాయి.

"ఏమండీ"

"ఊ"

"మా పెద్ద వదిన మేనమామ కొడుకు హార్ట్‌ఎటాక్‌తో చనిపోయాడట. ఇందాకే ఫోను వచ్చింది... చాలా చిన్నతను.. బిజినెస్ చేస్తాడు... ఎప్పుడూ తెగ టెన్షన్... రెస్ట్‌లెస్‌గా వుంటాడు... లక్షలకు లక్షలు సంపాదించాడు... తన వెంట ఏం తీసుకెళ్ళాడు? కుటుంబాన్ని శోక సముద్రంలో ముంచి వెళ్ళాడు... నాకు చాలా బాధగా అన్పిస్తుంది... వింటున్నారా..."

"ఊ"

"నాకు యిలాంటి విషయాలు విన్నప్పుడల్లా భయంతో చాలాసేపు మనిషిని కాలేకపోతున్నాను. ఏవేవో ఆలోచనలు నా గుండెను బలహీనం చేస్తున్నాయి. నేను మరికాస్త కష్టపడతాను. మీరు ఆ పార్ట్ టైం జాబ్ మానేయండి. ఈ మహానగరంలో అన్నింటికి డబ్బు చాలా ఎక్కువగానే కావాలి... యింటి అద్దె... పాలు... కిరాణా... ఫీజులు... డొనేషన్లు... అన్ని పెరిగిపోతున్నాయి... ఏం చేస్తాం... దుప్పటి వున్నంత వరకే కాళ్ళు జాపుకోవాలి అన్నట్లుగా ఎడ్జెస్ట్ చేసుకుంటూ బాగానే బ్రతుకుతున్నాంగా... యిప్పటికే మీరు ఎంతో నీరసించిపోతున్నారు... యింకా ఎంతకని నీరసించిపోతారు? యిప్పటికే మీ వయసుకు పది సంవత్సరాలు ఎక్కువగా కన్పిస్తున్నారు... ఈ జీతం మనకు చాలదా? వింటున్నారా..."

"ఊ"

"మనదీ మంచి జీతమే... మనకది చాలు... తృప్తికి మించిన ఆనందం మరింకేదో లేదు... పిల్లలు బిక్కు బిక్కుమంటూ వుంటున్నారు. వాళ్ళకు దూరంగా అవుతున్నారు. నాకు కూడా దూరంగా అవుతున్నారు... నవ్వులు.. సంతోషాలు అంటూ మన మధ్య వుండటం లేదు. ఎవరికి వాళ్ళంగా గడుపుతున్నాం. కుటుంబం అంటే యిదా? మన పనిమనిషి రాములమ్మని మరోసారి గమనించండి... వెయ్యి రూపాయలు నెలకు సంపాదిస్తుంది. భర్తకు రెండువేలు వస్తాయంట.... ఆ మూడువేలతో జీవనం వెళ్ళదీస్తున్నారు.. ఎప్పుడూ నవ్వుకుంటూ కళకళలాడుతూ కన్పిస్తుంది... యిద్దరు పిల్లల్ని సంతోషంగా చదివించుకుంటున్నారు... మనం అంత మాత్రంగా వుండటం లేదు... ఇది నిజం."

సరళ గమనించకుండా కళ్ళు తుడుచుకున్నాను నేను.

"ఏమండీ"

"ఊ"

"ఆలోచిస్తున్నారా?"

"నేను ఎప్పటిలా ఆలోచించడం లేదు సరళా... మారిపోవాలి... నా ఆలోచనల్లో మార్పు రావాలి... నేనో మంచి భర్తగా.. మంచి తండ్రిగా మీ దృష్టిలో నిలిచిపోవాలి...మిమ్మల్ని సంతోష పెట్టాలి... మీతో పాటు నేనూ ఆనందించాలి... అదే కరెక్ట్... యిప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది... ఆ ఆలస్యానికి ప్రతిఫలం ఏమిటో కూడా నాకు బాగానే దక్కింది."

"ఏమండీ"

"ఊ"

నా ఆలోచనలన్ని దూరంగా వెళ్ళిపోతున్నాయి... మనసంతా ఏదో హాయి... భుజం మీద సరళ చేతి స్పర్శ... మెదడులో ఓ చల్లదనం... ★

# జాషువా కవిత్వతత్వం 'పిరదౌసి' ఖండ కావ్యం




**జాషువా కవిత్వతత్వం, జాషువా సామాజిక తత్వం, జాషువా ప్రాపంచిక దృక్పథం, జాషువా హృదయతత్వం.. సమస్తం 'పిరదౌసి' కావ్యంలో ఆవిష్కరింపబడ్డాయి.**

**పారసీక సాహితీ ప్రపంచంలో 'పిరదౌసి' పిక మేరు నగధీరుడు. తెలుగు సాహితీ ప్రపంచంలో జాషువా మరో ధృవతార.**

**తుమ్మల రామకృష్ణ**

కవి కోకిలగా, కవితా విశారదగా, కవి దిగ్గజంగా మధురకవి శ్రీనాధగా, నవయుగ కవి చక్రవర్తి తెలుగు కవితా క్షేత్రంలో బావుటా ఎగురవేసిన సుప్రసిద్ధ కవి, బహుముఖ ప్రజ్ఞాశాలి గుర్రం జాషువా 1895 సెప్టెంబరు 28న గుంటూరు జిల్లా వినుకొండకు అల్లంత దూరంలో వున్న మిస్సమ్మ తోటలో జన్మించాడు.

1925 తర్వాత రచనా వ్యాసంగంలో అడుగుపెట్టారు. 1971 జూలై 24న తుది శ్వాస విడిచేవరకు కవిత్వ వ్యాసంగాన్ని అంటి పెట్టుకునే జీవించారు. కవిత్వమే ప్రాణంగా బతికారు.

జాషువా పుట్టుక నుంచి మరణం వరకు గల మధ్య కాలాన్ని గమనించినట్లయితే – ప్రధానంగా సంఘ సంస్కరణలు, జాతీయోద్యమాలు, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు, స్వాతంత్రోద్యమ పోరాటాలు మొదలైన సామాజిక ఉద్యమాలూ, నవ్యకవిత్వం, భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, దిగంబర కవిత్వం వంటి కవిత్యోద్యమాలు, గ్రాంధిక, వ్యవహారిక భాషోద్యమాలూ, మార్క్సిజం మావోయిజం ప్రభావాలూ, గాంధేయ దృక్పథాలు, ఆధునిక వచన సాహిత్య ప్రక్రియల ఆవిర్భావ వికాసాలూ, విభిన్న సాహిత్య సిద్ధాంతాల చర్చలు, వస్తు –రూప చర్చలు... ఇలా ఎన్నో అంశాలు మన కళ్ళముందు కొచ్చి నిలుస్తాయి. వీటన్నిటి ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలు తన మీద పడుతూవున్నా తనదైన విలక్షణ భాణిలో ఖండకావ్యాలు అందించి తెలుగులో 'ఖండకావ్యం' ఒక ప్రక్రియగా నిలదొక్కు కోవడానికి తనవంతు కృషి నందించిన అపార ప్రతిభా సంపన్నుడు జాషువా.

జాషువా అందించిన ఖండ కావ్యాలలో 'పిరదౌసి' ఒక ప్రత్యేకమైన రచన. 'పిరదౌసి' కవితత్వాన్ని, దృక్పథాన్ని పట్టి ఇచ్చే లఘు కావ్యం. కవి వస్తు స్వీకారంలో రచనా విధానంలో భావాలు వ్యక్తీకరణలలో కవి తత్వం, దృక్పథం దాగి ఉంటాయి.

'పిరదౌసి' పారసీక కవులలో అగ్రగణ్యుడు, గజనీ మహమ్మదు కోరికను గౌరవించి 'షానామా' గ్రంథాన్ని ముప్పై సంవత్సరాలు రాత్రి పగలు శ్రమించి అపూర్వ కళాఖండంగా తీర్చిదిద్దిన మహాకవి.

ఒప్పందం ప్రకారం గజనీ మహమ్మదు అందులోని ఒక్కో పద్యానికి ఒక్కో దీనారం ఇవ్వాలి. దీనారం అంటే బంగారు నాణెం. షానామా అరవై వేల పద్యాల గ్రంథ రాజం. ఆ ప్రకారం గజనీ మహమ్మద్ పిరదౌసికి అరవైవేల బంగారునాణెలు ఇచ్చు కోవాలి. 'పిరదౌసి' పారసీక భాషా భాండాగారాన్ని కొల్లగొట్టి, ప్రతి పద్యానికి ఒక రక్తపు బొట్టు చొప్పున శ్రమించి 'షానామా' గ్రంథం పూర్తి చేసి సభలో పఠించి కవి పండితుల్ని మెప్పించి, ఆ గ్రంధాన్ని రాజుకు అర్పించి వెళతారు. గజనీ మహమ్మదు ఎందువల్లనో బంగారు నాణాలుకు బదులు వెండి నాణాలు పంపుతారు. అరవైవేల బంగారు నాణాలు పొందుతాననుకున్న కవి ఆశల సౌధం కుప్పకూలి పోతుంది. బాధపడ్డ కవి హృదయంలోంచి రాజు మాట తప్పిదం గురించిన నిందా వాక్యాలతో కూడుకున్న పద్యాలు పెల్లుబికి వస్తాయి. ఆ పద్యాలను రాసి పిరదౌసి రాజుకు పంపుతాడు. అందుకు ఆగ్రహించిన గజనీ మహమ్మదు పిరదౌసిని 'పట్టి చంపండని భటుల్ని పంపిస్తాడు. పిరదౌసి భార్యా, బిడ్డలతో గజిని పట్టణం విడిచిపెట్టి 'తూసు' పట్టణంలో తలదాచు కోవడానికి బయలుదేరుతాడు. మార్గమధ్యంలో అనేక ఇబ్బందులు ఎదుర్కొంటారు.

సామంత రాజుల హితోపదేశాలతో శాంతించిన గజనీ మహమ్మదు కవి రుణం తీర్చు కోవడానికి తిరిగి అరవై వేల బంగారు నాణాలు పంపుతారు. భటులు బంగారు నాణాలతో 'తూసు' పట్టణంలో అడుగు పెట్టేసరికి, తనకు జరిగిన అవమానాలకు క్రుంగి కృశించిన 'పిరదౌసి' ప్రాణం గాలిలో కలసిపోతుంది. భటులు ఆ బంగారు నాణాలను పిరదౌసి కూతురికి ఇచ్చి స్వీకరించ కుంటారు. తన తండ్రి ప్రాణాలు హరించిన నీచమైన ధనాన్ని తాను ముట్ట నంటుంది. ఆ ధనంతో తూసు పట్టణంలో ఒక సత్రం కట్టి స్తారు. దాని చిహ్నాలు ఇప్పటికీ ఉన్నాయంట.

గజనీ మహమ్మదు, పిరదౌసీ ఇద్దరూ కాలగతిలో కలిసిపోయినారు. కానీ ఒక అపకీర్తి, మరో కీర్తి మాత్రం లోకంలో నిలిచి ఉన్నాయి. స్థూలంగా పిరదౌసి' ఖండ కావ్యంలోని కథ ఇది.

ఖండ కావ్యంలో ఇచ్చిన మాట నిలబెట్టుకోవడానికి అహర్నిశలూ – చివరకు భార్యాపిల్లల్ని సైతం పట్టించుకోకుండా తదేక దీక్షతో కావ్యరచనకు అంకితమయ్యే పిరదౌసీ వ్యక్తిత్వం ఒకవైపున కనిపిస్తే, మరో వైపున మాట తప్పే రాజులు, వాళ్ళు దురహంకార చేష్టలు, అధికార దర్పాలు, వాళ్ళ నీచ స్వభావాలు మరో వైపున కనిపిస్తాయి.

జాషువా పుట్టుక ఒక విషాదం. తల్లి ఒక కులం, తండ్రి మరో కులం. తల్లి ఆది ఆంధ్ర. తండ్రి గొల్ల. తల్లిది క్రైస్తవ మతం. తండ్రిది హిందూమతం. నిచ్చెన మెట్ల సమాజంలో జాషువా బాల్యం, విద్యాభ్యాసం, సామాజిక గౌరవం.. అన్నీ సమస్యలే. ఒకవైపు కులం, మరో వైపు మతం ఈ రెండింటి ఈసడింపు చీత్కారాలు. దానికి తోడు పుట్టు

దారిద్ర్యం, ప్రేమలేదు. ఆత్మీయ అనురాగాలు లేవు. కడుపునిండా తిండిలేదు. దుర్మార్గపు సమాజపు కట్టుబాట్లు. జాషువా హృదయం ఒక నిప్పుల కుంపటి. జాషువా ఆలోచన ఒక భూకంపం. జాషువా పలుకు ఒక పదునైన పలుగు.

తను ఏ విధంగా సమాజం చేత బాధింప బడ్డాడో ఆ బాధల రూపమే కవిత్వంగా జాషువా కలం నుంచి జాలు వారింది. మోసానికి, అన్యాయానికి, వంచనకి బలైపోయిన ఎందరి జీవితాల గురించో జాషువా ప్రశ్నించడం మొదలు పెట్టాడు. కులాన్ని, మతాన్ని, కట్టుబాట్లను, కూకటి వ్రేళ్ళతో పెకలించడానికి కవిత్వ గునపాన్ని ఉపయోగించాడు.

జాషువా చేతిలో తెలుగు పద్యం సానలు దీరింది. హేతువాదంతో ఈదేరింది. మానవత్వానికి గొడుగుపట్టింది.

బాధలు పడ్డవారికే ఎదుటివారి బాధలు అర్థమవుతాయంట. కష్టాలు పడ్డవారికే ఇతరుల కష్టాలు తెలుస్తాయంట. మోసానికీ, వంచనకీ గురైన వారికి మోసంవల్ల, వంచన వల్ల కలిగే మనోవేదన అర్థమవుతుంది. జాషువా జీవితమంతా బాధలు, కష్టాలు, మోసాలు, వంచనలు, వివక్షలు, కులమత సమస్యలు జాషువాని వెంటాడాయి, వేధించాయి కూడా. అందువల్లే జాషువాని పారసీక కవి 'పిరదౌసి' జీవితం ఆకర్షించింది. జాషువా చేతిలో 'పిరదౌసి' ఒక విషాద ఖండకావ్యంగా రూపుదిద్దుకొనింది. కవి హృదయం కవికే తెలుస్తుందంటారు పెద్దలు.

గజనీ మహమ్మదు అనేకసార్లు అఖండ భారతదేశం మీద దండయాత్రలు సాగించి భారతీయ సంపదలను కొల్లగొట్టారు.

ఆ విషయాన్ని జాషువా ఒకే ఒక సీస పద్యంలో –

"బంగారు నాణెముల్ బస్తాల కెత్తించి
మదపుటేన్గుల మీద బదిల పరచి
లేత పచ్చలనేరి గోతాల గుట్టించి
లొట్టి పిట్టలమీద దిట్టపరచి
కురు మీద మణులను కుంచాల గొలిపించి
పరువుదెద్దుల బండ్లపై నమర్చి
మొలక వజ్రములు జాలెల బోసి కూర్పించి
గుఱ్ఱాల మూపుల గుస్తరించి
పదియు నెనిమిది విజయరంభల వరించి
గంగా జలమున నెత్తుటి కత్తి కడిగి
సర్వము హరించి హిందుదేశంబు విడిచి
గజని మామూదు గజనీకి గదలిపోయె"

గజనీ మహమ్మదు ధన దాహానికీ, యుద్ధకాంక్షకీ, దోపిడీ తనానికీ ఈ పద్యం ఒక మచ్చుతునక.

శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' కవితలో చెంగిజ్‌ఖానో, నాదిర్షాలోడి, గజనీ, ఘోరి... వీళ్ళందర్నీ నరహంతకులు అన్నారు. వీళ్ళు నడిచిన దారంతా శవాల గుట్టలే. రక్తపుటేరులే. గజనీ మహమ్మదు నిండు కొలువులో–

"ఒక్కొక్క పద్దియంబున
కొక్కొక్క బంగారు రూక మొసగెదను కవీ!
మక్కా మసీదుతోడని
వక్కాణించెన్ మహా సభా మధ్యమునన్"

అని పిరదౌసీలో చెపుతాడు. పిరదౌసి 'షానామా' రాయడం కోసం పడ్డ శ్రమను జాషువా వర్ణిస్తూ –

"పారసీక గ్రంథ బాండారముల నెల్ల
గదిలించి తీయని పదము లేరి
వ్యంగ్య వాచ్యార్థ మహాంభో విధానంబు
దరచి ముత్యములు రత్నములు గూర్చి
లలితంబులైన యలంకారములనెల్ల
బొరలించి మేలైన సరకు లెత్తి
దిరిసెనపుంబూవు కరణి ముద్దులు గారు
శయ్యావిలాసంబు సంతరించి
శాసనములన్ని పరికించి సకల రాజ
చరితలందింత సత్యంబు జాఱనీక
ఆర్య సన్నుత షాహనామాబిధాన
భాసుర గ్రంథ రచన కుపక్రమించె" అనిచెప్పి,

ఆ తర్వాత –

"వాని డెందంబు సోకి పోవని తలపులు
వాని కనుసన్న దలలు వంపని యుపమలు
వాని కలమున కులుకు చూపని పదములు
మందునకు లేవు నాటి వాఙ్మయము నందు"

అంటాడు. జాషువా పిరదౌసి గొప్పదనాన్ని, పిరదౌసి రచనా నైపుణ్యానికి అతని కవితాశక్తిని ఈ పద్యంలో వ్యక్తం చేశాడు.

గజనీ మహమ్మదు పిరదౌసికి బంగారు నాణెలుకు బదులు వెండి నాణెలు పంపిస్తాడు. పిరదౌసి వాటిని తిరస్కరించి కోపించి రాజును నిందిస్తూ పద్యాలు రాస్తాడు. అందుకు కోపించి రాజు పిరదౌసి చంపేయ మని భటుల్ని పంపిస్తాడు. పిరదౌసి ఆ విపత్తు నుంచి తప్పించుకొంటాడు. ఆ తర్వాత –

"కృతి యొక్క బెబ్బులింబలె
శరీర పటుత్వము నాహరింప, శే
షితమగు నస్థి పంజరము
జీవల వంబున నూగులాడగా
బ్రతికియు జుచ్చియున్న ముది
వగ్గు మహమ్మదుగారి ఖడ్గదే
వతకు రుచించునా? పరిభ
పవ్యథ యింతట నంతరించునా?"

"ముత్యముల కిక్కయైన సముద్రమున
బెక్కుమారులు మున్కలు వేసినాడ
భాగ్యహీనుడ ముత్యమ్ము పడయనయితి
వనధి, నన్ను మ్రింగి నోరు వచ్చినది తుదకు"

అని ఉదయాన్నే మసీదుకొచ్చి నమాజుచేసే భక్తుల హృదయాలు జలదరించే టట్లు మసీదు గోడమీద రాసి వెళతాడు పిరదౌసి మహాకవి.

చివరకు సామంతులు పలికిన స్వాంత వచనలలో శాంతి నొందిన గజనీ మహమ్మదు తిరిగి అరవైవేలు దీనారాలు (బంగారు నాణేలు) పిరదౌసి ఇంటికి పంపిస్తాడు. ఆ సందర్భంలో పిరదౌసి మహాకవి కూతురు.

"ఇది నా తండ్రిని కష్టపెట్టినంశరం
భీ స్వాపతేయంబు
ముట్టుదునా, నా జనకుందుయ
కంట తడి బెట్టున్
స్వర్గమందుండి, నా
ముది తండ్రినో దయతోడ నేలిన
నవాబుండైన మీ స్వామికనో
బదివేలంజలు 'లంచు ఓల్కుదని'
బాష్పస్విన్న దుఃఖాస్యమై.
కుల గిరులు కరిగిపోయెమే
పలుకులు దైనంబు చిందిపడ బలికె నొగినో
చెలువమున వెలయు కవిసుత
యెల బ్రామపు విడని మృదు కంఠార్తిన్"

అని పలికిందంటాడు జాషువా. నిజంగా ఆమె అలా అనిందో లేదో స్పష్టంగా తెలియదు కానీ, జాషువా మాత్రం, ఆమె చేత అలా అనిపించాడనిపిస్తుంది. ఆ మాటలు కవి దృక్పథానికి సంబంధించినవి. కవి ఆత్మ గౌరవానికి సంబంధించినవి.

జాషువా కవిత్వతత్వం, జాషువా సామాజిక తత్వం, జాషువా ప్రాపంచిక దృక్పథం, జాషువా హృదయతత్వం.. సమస్తం 'పిరదౌసి' కావ్యంలో ఆవిష్కరింపబడ్డాయి.

పారసీక సాహితీ ప్రపంచంలో 'పిరదౌసి' పిక మేరు నగధీరుడు. తెలుగు సాహితీ ప్రపంచంలో జాషువా మరో ధృవతార.

జాషువా జీవితమే జాషువాను గొప్పకవిగా తీర్చిదిద్దింది. జాషువా కులమతాల కతీతుడు. విశ్వమానవుడు. జాషువాకవిత్వం అజరామరం. తెలుగు భాష బతికున్నంత కాలం జాషువా, జాషువా కవిత్వం బతికి ఉంటాయి.

పిరదౌసి ఖండకావ్యం బతికుంటుంది.



# మహాత్మత్వం



వివినమూర్తి

గాడ్సే చేతిలోని రివాల్వర్ లాక్కుని అతనికి గురిపెట్టాడు గాంధీ.
"దగ్గరకు రాకు - నిన్ను కాల్చేస్తాను"

నవ్వాడు గాడ్సే. నవ్వుతూనే ఒక అడుగు ముందుకు వేశాడు.

"నువ్వు చంపలేవు!"

"నిన్ను చంపగలను. నన్ను చంపడానికి వచ్చావు నువ్వు. క్షమించి వదిలేస్తే - నా ప్రాణాలు నువ్వు తీస్తావు. తప్పకపోతే నిన్ను చంపేస్తాను. ఎందుకంటే నేనూ మనిషినే - '

'నువ్వు మనిషివి కాదు'

'....??'

'నువ్వు మహాత్ముడివి. మామూలు మనుషులు మహాత్ములు కావాలనుకునేటంత మహాత్ముడివి.'

'ఇతరుల గురించి నేను ఎన్నయినా కలలు కనవచ్చు'

'నువ్వొక ప్రయోగశాలవి. ఇతరుల గురించి కలలను ఏర్పరచుకునే ముందు నీమీద నువ్వు ప్రయోగాలు జరుపుకుంటావు.'

'నా ప్రాణాన్ని నేను ప్రయోగానికి వినియోగించలేను.'

'నువ్వా పని అనేకమార్లు చేశావు - '

'చెయ్యలేదు'

'ప్రాణమంటే ఏమిటి - శరీరం, దేహం, కాయం. దాన్ని నువ్వు అనేక విధాల హింసించావు. సహజ అవసరాలైన ఆహారం, కామం అందకుండా నీ దేహాన్ని నువ్వు హింసించావు. నీమీద నువ్వు చేసుకున్న హింసతో నెహ్రూని, పటేల్‌ని - అంతెందుకు మొత్తం దేశాన్నే కట్టడి చేశావు. హింసించావు. నీ దేహమూ - నీ దేశమూ ఒకటేనన్నంత మమైక్యతతో... నీకు నువ్వు యిచ్చుకున్న అధికారంతో... నీవి కాని దేహాన్నీ, దేశాన్నీ ఒకేలా హింసించావు.'

'.....'

'అంటే - నీ ప్రాణాన్ని నువ్వు అనేకమార్లు ప్రయోగానికి గురిచేశావు. నీ తీర్పు - నీ అంతట నువ్వు కల్పించుకున్న అధికారంతో నీ అంతట నువ్వు విచారణ జరిపి ఒక ప్రత్యేక పరిస్థితి మీద నువ్వు యిచ్చిన తీర్పు - అమలుకావటం కోసం -

నీ దేహానికి ఆహారం అందకుండా చేశావు. నీ తీర్పు అమలవకపోతే.. అమలు జరగటంలో ఆలస్యం జరిగి వుంటే – నీ దేహం తట్టుకోలేకపోతే... నీ ప్రాణాలు... నీ ప్రయోగంలో ... పోయే ఉండేవి. మహాత్ముడు సాలోచనగా చూశాడు.

"ఎదురుగా ఉన్న ఆహారాన్ని విసర్జించి.... దూరంగా ఉన్న మృత్యువుని ఆహ్వానించి... దాని కోసం నిరీక్షించావు. అంటే మృత్యువు కోసం నిరీక్షించావు. అలాంటి భయావహ మరణాన్నే చూసిన మహాత్ముడివి. ఈ సునాయాస మరణం నిన్ను భయపెట్టలేదు. ఒకే ఒక్క సెకను చాలు. కళ్ళు మూసుకో! నీ ప్రయోగం సఫలమయినదీ, విఫలమయినదీ తేలిపోతుంది. ఆ చెంపని కొడితే ఈ చెంపని చూపించే స్థైర్యం నీకు ఉంది. ఎందుకంటే నువ్వు మహాత్ముడివి. మామూలు మనుషులు మహాత్ములు కావాలనుకునేటంత మహాత్ముడివి."

' కొడితే చూపించడం వేరు. నువ్వు కాల్చవని నమ్మకం ఉన్నపుడు గుండె ఎదురొడ్డడం వేరు. నువ్వు మరొక్క అడుగు ముందుకు వేశావా – నా చేతిలో ఆయుధం ఉంది.'

'నీ చేతిలో నా ఆయుధం ఉంది. నిజమే – దానికి ట్రిగ్గర్ కూడా వుంది. దాని మీద ఉన్నది నీ వేలే. కాని ఆ వేలు కదిపే శక్తి నీకు లేదు.'

'ఆ సంకల్ప శక్తి నాకు లేకపోవచ్చు. అయినా జంతు సహజమైన ప్రతి క్రియ శరీర ధర్మం. దానికి నేనయినా బందీనే...'

' నిజం మహాత్మా – నువ్వు బందీవే' ఆ విషయం నాకన్నా బాగా తెలిసినవాడు ఎవడూ ఉండడు. ఎందుకంటే నేనూ బందీనే. ఇద్దరమూ ఒకే రకమైన బందీలం. మనకి ఇద్దరికీ జంతు సహజమైన ప్రతి క్రియలు ఉండవు. సహజమైన శరీర ధర్మాలు ఉండవు. నీ కలలకు, నీ ప్రయోగాలకు నువ్వు బందీవి. నీ కలలంత లోక ప్రసిద్ధమయినవి కాకపోవచ్చు. నీ ప్రయోగాలంత కాలావధి గలవి కాకపోవచ్చు.

నీ కలల కోసం నీ ప్రయోగంలో నువ్వు నీ దేహాన్ని కోల్పోతే... నీ మరణం ప్రపంచాన్ని కన్నీరు పెట్టించవచ్చు. నీ త్యాగం ఎందరికో ఒరవడి కావచ్చు. చరిత్ర నీకు పాదాభివందనం చేయవచ్చు కానీ...'

మహాత్ముడు ఆలోచిస్తున్నాడు.

గాడ్సే మరో అడుగు ముందుకు వేశాడు.

'నాకూ కొన్ని కలలు ఉన్నాయి. నేనూ ఒక ప్రయోగం చేస్తున్నాను. మనిషి దేహాన్ని భగ్నం చేయడం ద్వారా... అతను ప్రతిపాదించిన కలలను భగ్నం చేయవచ్చన్నది నా కల. ప్రకృతి ధర్మం దృష్ట్యా – అసహజమైన శరీర స్వహింస – నీ పరికరం – నా పరికరం కూడా అదే. శరీర స్వహింసే నా పరికరం కూడా. నిన్ను చంపడం ద్వారా నేను నా శరీరానికి మరణ శాసనం రాసుకున్నట్లే ప్రకృతి ధర్మం... ప్రకారం... శరీర స్వహింస అసహజం. కనక మహాత్మా – "

"కనక..."

"మన యిద్దరిలో ఒకరు మరణించక తప్పదు. ఆయుధమున్నవాని చేతిలో లేనినాడు మరణించక తప్పదు. అది సహజధర్మం."

"మరో అడుగు ముందుకు వేశాడు – గాడ్సే"

"నా చేతిలోనే ఆయుధముంది –"

"నా చేతిలోనూ ఒక ఆయుధముంది. నువ్వు నన్ను చంపినా... గెలుపు నాదే! నేను నిన్ను చంపినా... గెలుపు నాదే..! అదే నా ఆయుధం."

మరొక్క అడుగు ముందుకు పడింది.

ఆయుధం తన ధర్మాన్ని నిర్వర్తించింది.

మనిషి మహాత్ముడయాడు.

మనిషి మహాత్ముడయే కల కొనసాగుతూనే వుంది.

మానవ రక్తం అఖండంగా ప్రవిస్తూనే వుంది. ✦

---

# శ్రామిక సమరస్ఫూర్తి 'మేడే'



1870 నాటికే పారిశ్రామిక, వాణిజ్య, బ్యాంకింగ్ రంగాల్లో గుత్తాధిపత్యం రూపుదాల్చి బలపడింది. పెట్టుబడిదారీ వర్గం కొన్ని ఒడుదుడుకులకు గురయినప్పటికీ అధిక లాభాలు పోగు చేసుకోవడానికి ఆ వర్గానికి మంచి అవకాశాలు ఏర్పడ్డాయి. కాని కార్మికవర్గం జీవితాల్లో అభివృద్ధి మాత్రం మృగ్యం. దానితో కార్మిక వర్గం పని గంటల తగ్గింపుకోసం ఉద్యమించింది.

అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ యొక్క వలుకుబడి కార్మిక వర్గంలో విపరీతంగా పెరిగిపోయింది. ఎక్కడ చూసినా కార్మికులు అతిపట్టుదలతో సమ్మె పోరాటానికి సిద్ధమయ్యారు.

మేడే సమ్మె సన్నద్ధంగా 1885-86లో జరిగిన సమ్మె పోరాటాల్లో లక్షలాది కార్మికులు పాల్గొనటమే ఇందుకు ప్రత్యక్ష తార్కాణం.

**చారిత్రాత్మకమైన మేడే**

చికాగో కార్మికవర్గం అమెరికన్ కార్మిక వర్గంలో ఒక భాగమే అయినా అక్కడి కార్మిక వర్గానికి ఒక ప్రత్యేకత వుంది. సమస్యల పరిష్కారానికి వారు పటిష్టమైన విప్లవ దృక్పథం అవలంబించే వారు. ఆ నగరంలోని కార్మిక నాయకులు కూడా ఎప్పుడూ కార్మికవర్గాన్ని విప్లవ మార్గాన నడిపిస్తూ వుండేవారు. అందుచేతనే చికాగోలో మే ఒకటో తేదీన సమ్మె తీవ్రరూపం దాల్చింది.

సమ్మెకు అనేక రోజుల పూర్వమే "8 గంటల పని దినం సంఘం" ఒకటి అనేక రాజకీయ దృక్పథాలు గల వారితో ఏర్పడి పని చేయసాగింది. ఆ సంఘం నాయకత్వంలో మే 1వ తేదీకి ఒక రోజు ముందు ఆదివారంనాడు 25 వేల మంది కార్మికులతో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది. మే ఒకటిన చికాగో నగరంలో వెల్లివిరిసిన కార్మిక చైతన్యానికి అంతులేదు. నగర వీధులన్నీ ఉత్సాహవంతులైన కార్మికులతో నిండిపోయాయి. నగరంలో బ్రహ్మాండమైన సార్వత్రిక సమ్మె జరిగింది. కర్మాగారాలన్నీ మూతబడ్డాయి. అదివరకెన్నడూ కనీవినీ ఎరుగనంతటి ఐక్యమత్యంతో మూడున్నర లక్షల మంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు. నగర వీధులన్నీ కార్మిక సందోహంతో నిండిపోయాయి. 8 గంటల పని దినాన్ని సాధించి తీరుతాం, అనే దృఢ విశ్వాసం వారందరిలోనూ కొట్టవచ్చినట్లు కనిపించింది. సమ్మెను విజయవంతం చేయటానికి వారు తమ సర్వశక్తులను ఒడ్డడానికి సిద్ధపడ్డారు. కార్మికవర్గ శత్రువులు కూడా విజృంభిస్తున్న ఈ కార్మికోద్యమాన్ని ఏ విధంగానైనా నాశనం చేయాలని నిర్ణయించుకున్నారు. పెట్టుబడిదారీ వర్గానికి అండగా ప్రభుత్వం కూడా రంగప్రవేశం చేసింది.

మే 3వ తేదీన కార్మికులు రక్తాన్ని కండ్ల చూడటానికి అమెరికన్ పోలీసులు నిర్ణయించు కున్నారు. ఆ రోజున శాంతియుతంగా సమ్మె సాగిస్తూ వున్న కార్మిక జనసమూహంపై పోలీసులు కాల్పులు జరిపి ఆరుగురు ప్రాణాలను బలిగొన్నారు. ఈ దారుణ హత్యాకాండవల్ల అసమ్మతి తెలిపేందుకు 4వ తేదీన నగరం మధ్యలో వున్న హే మార్కెట్‌లో కార్మికులు పెద్ద నిరసన సభ జరిపారు. ప్రశాంతంగా జరుగుతూ ఉన్న ఆ సభ మీద పోలీసులు విరుచుకుపడ్డారు. మధ్యలో ఒక బాంబు ప్రయోగం జరిగింది. ఒక పోలీసు సార్జెంట్ చనిపోయాడు. అది సాకుగా తీసుకొని పోలీసులు నిరాయుధులైన ప్రజలపై తుపాకులతో, సన్నీలతోస్వైర విహారం చేశారు. అయినప్పటికీ నిరాయుధులైన కార్మికులు సంఘటితంగా చైతన్యదీప్తితో పోలీసులతో బాహాబాహిగా తలపడ్డారు. ఆ సంఘర్షణలో ఏడుగురు పోలీసులూ, నలుగురు కార్మికులూ నేల కొరిగారు. పాలకవర్గం అదనపు బలగాలను రంగంలోకి దించింది. హే మార్కెట్ ప్రాంతం కార్మికుల రక్తంతో తడిసిపోయింది. అక్కడే ఆవిర్భవించింది. ప్రపంచ వ్యాపితంగా వున్న కోట్లాది శ్రమజీవుల స్వేచ్ఛా సంకేతం అయిన "అరుణ పతాకం."

ఈ మార్కెట్ ఉదంతాన్ని పురస్కరించుకొని బూర్జువా ప్రభుత్వం కార్మికోద్యమ నాయకులను చుట్టివేసే కార్యక్రమం ప్రారంభించింది.

న్యాయస్థానం ముందు విచారణ తరంగం జరిపి పార్సన్, స్పిన్, ఫిషర్, ఏంగెల్స్ అనే కార్మిక నాయకుల్ని ఉరి తీయించింది. మరికొందరిని దీర్ఘకారాగారవాస శిక్షలకు గురి చేసింది.

ఆ సమ్మెకు నాయకత్వం వహించిన ఐదుగురు విప్లవ మూర్తులతో ఒకరైన "స్పిన్" తనను ఉరితీసే ముందు ఉరికంబం నుండి యిలా గర్జించాడు.

"మమ్ముల్ని ఉరితీస్తే మంటలు ఆరిగి పోతాయనుకుంటున్నారా? అదిగో అక్కడ, యిక్కడ, ఆ మూల, ఈ మూల, మీ వెనుక, మీ ముందు అన్ని చోట్లా జ్వాలలు చెలరేగుతాయి. అది అంతర్వాహిని. దాన్ని ఆర్పడం మీ తరం కాదు."

దేశమంతటా ఇతర కేంద్రాలలో కూడా ఈ దమనకాండ కొనసాగింది. అయినప్పటికీ అమెరికన్ కార్మికులలో మాత్రం మే ఒకటిన విప్లవ చైతన్యం వెల్లివిరిసింది. ప్రతి కార్మికుడూ తన వర్గ చైతన్యాన్ని ప్రదర్శించటానికి వీధుల్లోకి వచ్చారు. ఆ విధంగా 1886 మే మొదటి తేదీ ప్రపంచ కార్మికవర్గ విప్లవ చరిత్రలో రక్తాక్షరాలతో లిఖించదగిన తేదీగా మారిపోయింది. ఆనాటి పోరాటోద్యమానికి చికాగో నగరమే కేంద్రం అయినప్పటికీ దేశంలోని అనేక ముఖ్య నగరాలకు ఆ ఉద్యమం వ్యాపించింది. •



# ఆకలి యుగం

బి. ఇందిర

ఆది నారాయణా! ఆర్తరక్షకా!
సిరికిన్ చెప్పకుండా
దుష్ట శిక్షణకై రావాల్సి ఉంది!

అర్ధనారీశ్వరా!
మూడు కళ్లున్నా
ఘోరకలి చూడలేకున్నావా!
శివశివా!

తరతరాల దారుణాల్నితుంచే
కరాళనృత్యం మొదలెయ్!
నేలనేలంతా నీ స్థలమే!

బెజవాడ కనకదుర్గమ్మ తల్లీ!
నీ సింహాసనం వదిలేసిరా!
నగర వీధుల్లో పహారా కాయి!

ధర్మదేవతా!
కళ్లూ - చెవులూ మూసుకొని
ఎన్నాళ్లీ తమాషా చూస్తావు!
ఆ గంతలు విప్పుకో!
గొంతు సవరించుకో!
నూతన శిక్షాస్మృతి వచించు!

రాజ్యాంగ నిర్మాతా!
నూతన భారతాన్ని రచించు!
సవరింపుల్లేని విధింపులుండాలి!

చాచాజీ!
ఆరామ్ కాదు హరామైంది
ఆడపిల్ల బతుకు!
క్రాంతి పావురాల్ని ఎగరెయ్!

వివేకానందా!
నరమేధం మాధవసేవైంది!
మనిషి రక్తం విషమెక్కింది
విషాన్ని విరగ్గొట్టే
ఉపన్యాసం కావాలిప్పుడు!

ఇందిరాజీ!
గరీబీని కాదు
ముందే హరామ్ జాదోంక్రో హటావో!
అందుకు అత్యవసరంగా
ఓ పది సూత్రాల్నైనా ప్రవేశపెట్టు!

శాస్త్రీజీ!
జవాన్లనూ - కిసాన్లనూ
వెంట బెట్టుకుని వచ్చెయ్యి
సరిహద్దుల్లో కంటే యుద్ధ వాతావరణం
మనమధ్యే ఉంది!
కలుపు మొక్కల్ని ఏరేసే
సేద్యమిప్పుడవసరం!

జాతిపితా! బాపూజీ!
అహింసా సిద్ధాంతంపై
రాద్ధాంతమొద్దు
నీ చేతికఱ్ఱ
అర్ధరాత్రి ఆడ పిల్లకు
ఆత్మ రక్షణకై అందించాలి నువ్వే!

అమ్మా! థెరీసా!
దైవత్వాన్ని పొందావు!
మానవత్వాన్ని మాకొదిలిపెట్టక పోయావా!

ద్రోణాచార్యా!
ఇప్పుడైనా పక్షపాతం వీడి
దుష్ట శిక్షణకై రచించు పద్మవ్యూహాన్ని!
కర్మభూమి సొంతం కురుక్షేత్రమైంది!
మృతులూ - క్షతగాత్రులూ
ఆడతల్లులూ - పసిపిల్లలే!

వేదాంతం వినే శాంతం
మాకిక లేదు! గోవిందా!
ఈ అత్యాచార ఆకలి యుగాన్ని
కాపాడే నాధుడేడీ?

ఎవరో ఎందుకు? ఇంకెందుకు?
మనమే ఒకరం పదులై...
వందలు వేలై...
కోటానుకోట్లై
ప్రతిచోటా పోరాటమై
వేధించే అగచాట్లను
ఛేదిస్తూ .... సాధిస్తూ....

---



# ప్రకృతికి దూరంగా...

నూతలపాటి వెంకటరత్నశర్మ

ప్రకృతి కందనంత దూరం
పట్నాలు పారిపోయాక
మిగిలేది కాగితపు పూల
సువాసనలు
ప్లాస్టిక్ తోరణాల సొగసులు!
నిలువెత్తు ఆశోకవృక్షాలో
బారులు తీరిన క్రోటన్ మొక్కలో
కనువిందు చేస్తాయి కాని
కుదురైన వేప మొక్కొక్కటీ
పల్లవించను.
ప్రకృతి ధర్మాల కతీతంగా
సగం రాత్రి ఆవులించాక గాని
కనురెప్పలు కావులించుకోవు

బారెడు పొద్దెక్కాక కాని
కళ్ళు పద్మాలు కావు
వాళ్ళ ఆలోచనలు
బహుళ అంతస్తులకు
బేతాళుడిలా వేలాడతయ్యే కాని
చెట్టు కొమ్మలకు
ఉయ్యాలలూగవు
నేలమీద కూసింత సేపు
నిలబడవు

రోడ్‌సైడ్ పబ్‌లు
అత్యాధునిక విలాసాల కూడళ్ళు!
స్టార్ హోటళ్ళు విశ్వామిత్ర సృష్టి!
ఆత్మీయ పలకరింపుల
కరస్పర్శలుండవు
అవసరమే స్నేహానికి మూల
పదార్థం!
కృత్రిమ చిరునవ్వు పూలు
పెదాలకతికించుకోటం నిష్ఠుర
సత్యం!
ఇప్పుడు వాళ్ళ ముందున్న
లక్ష్యమొక్కటే
కాలంతో పాటు పరుగు
ఆ పరుగుకి కావాల్సిన సంపాదన !

# కథ అయిపోలేదు

మూసిన కిటికీ తలుపుల సందుల్లోంచి, దొంగల్లా దూరిన సూర్య కిరణాలు, పంతుల్లేని బడిలో... శాసనసభను మరిపిస్తున్న పిల్లలవలె వేడి హోరును సృష్టిస్తున్నాయి. ఢిల్లీ చుట్టూ తిరిగి తిరిగి అలసి అరునన్తన్న అధికార పార్టీ వృద్ధ నాయకులవలె, గడియారంలో ముల్లు తిరుగుతూ.. తిరుగుతూ... గంటల అరుపుల మోతలు మ్రోగిస్తున్నాయి.

**జనజ్వాల**



ఎప్పుడో లేవవలసిన ఇంటి సూర్యుడు, ఎప్పుటి వలె లేవలేదు. మల్లెచెట్టు తీగలపై పాము పిల్లలు పాకినట్లు..., అమినాబేగం గుండెల్లో అలజడి.., అలజడికి అతుక్కున్న పెదవులతో..., పెదవుల కింద వేళ్లాడుతున్న చేతులతో..., "ఉటోజీ... ఉటోజీ... బోద్దేరువా... ఉటో..." అంటూ భర్త యాకూబ్ ముఖం మీద నుంచి దుప్పటి తొలగించింది.

కలియని పక్షమ్ముల నడమ దుఃఖ నదిలో తేలియాడుతున్న భర్త చూపుల చేపపిల్లల్ని చూసి, అమినా అలజడి.., అలల సముద్రంలా మారింది. గదంతా రెండు చూపుల, నాలుగు చేపల, రెండు సముద్రాల, ఒక ఆకాశానికి ఎగిసిన ఒక కెరటం.

పాతిక సంవత్సరాల క్రితం షాదీతో ఒకటి ప్లస్ ఒకటి, ఒకటిగా అయినా అమినాబేగం, యాకూబ్, వారి సంసారమంతా లెక్కలమయం. యాకూబ్ ఒక మధ్యతరగతి సగటు మనిషి. నేను రానుబిడ్డో... పాటలోని సర్కార్ దవఖానాలో ఓ చిరుద్యోగి. ఖురాన్ నిబంధనో.., అల్లాదయనో..., యాకూబ్‌కు అయిదుగురు ఆడపిల్లలు. పోలియో సోకి కాలుచచ్చిపడిపోయిన ఒక అవిటి తమ్ముడూ, తాను అమినాతో ఎనిమిది జీవులు. ఒక సగటూ ప్రాణి మీద ఆధారపడిన అనగనగా ఒక రాజు ఏడు చేపలకథ యాకూబ్ కథ.

---

వేడినీళ్ళకు చన్నీళ్ళు తోడో.., చన్నీళ్ళకు వేడి నీళ్ళు తోడో.., ఏదో ఒకటి సంసారం సాగటానికి, అమినాబేగం పిల్లలు నల్లని సంసార బురక లోపల లోలోపల్నే బీడీలు చుడుతూ, చీరలకు ఫాల్, డిజైన్లు, రవికలు, గౌన్లు కుట్టుతూ శ్రమకు గౌరవ ప్రదమైన పనులతో, గౌరానికి గౌరంగా సంసార ఆర్థిక దోమల్ని తరుముకుంటూ కుటుంబ చుక్.. చుక్... బండిని లాగిస్తున్నారు. ఛాలెంజ్ మేఘాలతో.., చదువుల వర్షంలో తడుస్తూ ముద్దవుతూ, ముద్దబంతులై వికసిస్తున్న పరిమళ కాంతి సోగసులయ్యారు. రేపోమాపో అవిటి తమ్మునికి ప్రభుత్వ నౌకరీ రాబోతుంది. మొదటి అమ్మాయి, రెండవ అమ్మాయిలను షాదీతో సాగనంపాడు. మూడో అమ్మాయికి ఎంగేజ్‌మెంట్ 'రసం' కూడా చేశారు. మరి ఆనంద రెక్కలు తొడుక్కొని ఆకాశంలో పక్షివలె హాయిగా ఎగరవలసిన

యాకూబ్, అమినాబేగం ఏమిటి? దుఃఖ సముద్రంలో అగ్నిలావాలు అవడం..? ఎన్ని యుగాలైనా ప్రశ్నలు, బేతాళుడు, శవాలు, మనుషులను వదలకపోవడం ఏమిటి?

---

యాకూబ్ మూడో కూతురు షాజహానా బి.ఏ పాసై, ఒక ప్రైవేట్ స్కూల్లో టీచరుగా పనిచేస్తుంది. ఇక నాలుగు నెలలలో షాదితో అత్తగారి దేశానికి పోవలసింది. ఇంటి ప్రక్కలవాళ్ళు, బంధువులు, స్నేహితులూ, సర్కార్ దవఖానాలోని డాక్టర్లు, ఉద్యోగులు, అందరిముందు, ఉన్నదాంట్లో ఉన్నంతగా తన మత సాంప్రదాయ ప్రకారం షాజహానాకు 'రసం' చేయడం జరిగింది. కానీ ఎక్కడో రైళ్ళు, రైళ్ళు ఢీ కొన్నాయి. యాకూబ్ కలలమీద విమానం కూలి పడింది. తాజ్‌మహల్ ముందర తెల్లని పావురానికి రక్తస్రావం అయింది.



అందమైన అయిదుగురి కూతుళ్ళలో అతిగా ప్రేమించినా అతిగా చదివించిన షాజహాన్ ఎందుకిలా చేసింది. మళ్ళీ బేతాళుడు, ప్రశ్నలు, శవం ఎక్కడ లోపం జరిగింది. ఎక్కడ, ఎక్కడ.., నా ప్రేమలోనా...? పెంపకంలోనా?, తన కూతురేనా అలా వంచనకు గురై, నా ఎదకు క్షోభనిచ్చింది. ప్రైవేట్ స్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్న షాజహాన్, 'రసం' అయి అత్తగారి దేశానికి పోవలసినా షాజహాన్, అదే స్కూల్లో పని చేస్తున్న క్రిష్టియన్ మతస్తుడు డేవిడ్‌తో ప్రేమలో పడటమేమిటి? సరే మతం ఏదైనా షాదీ చేద్దామంటే వారు లేచిపోవడం, "అయ్యో లేచిపోవడం అంటే చలం మహాశయుడు ఒప్పుకోడు"

పోనీలే కనిపించకుండా పోవడం, మనసు శిఖరం యుద్ధభూమిలో కర్ణుని రథచక్రం కుంగిపోయినట్లు క్రుంగిపోయినా, నాలుగు నెలల్లో షాదీ కావలసిన షాజాహానా మూడునెల్ల కడుపుతో కనిపించడం, ప్రేమ పేరిట ఎందరినో మోసగించి పారిపోయిన డేవిడ్ కోసం, పోలీసులు వెతకడం అంతా తెలుగు సినిమా కథలా జరిగిపోయింది.

---

సగటు మనుషుల సగటు సంసారం, పాతిక సంవత్సరాల జీవన ప్రయాణంలో నడకలు సాగిస్తున్న యాకూబ్, అమినాబేగం గుండెల గూటిలో సముద్ర అగ్నిలావా బ్రద్దలైంది. గదంతా అగ్నికెరటాల మౌన తుఫాన్‌హోరు కమ్ముకుంది. వంద సంవత్సరాల తెలుగు నవల పుటల్లో చెదలు చేరినట్లు, మూడో ప్రపంచ యుద్ధ సంచార రేఖ ఇంద్ర ధనస్సులా రంగులు పులుముకొని ఆకాశం తెప్పమీద పొర్లుతూ తేలియాడుతుంది.

---

దేవదాసు చచ్చిపోయాడు
శ్రీలక్ష్మి చంపబడింది
షాజాహానా కడుపుతో వుంది

జైల్లో మనోహర్ డేవిడ్‌లాంటి తమ్ముళ్ళకోసం ఎదురు చూస్తున్నాడు. లోపం యాకూబ్ తండ్రుల పెంపకంలోనా? ప్రేమలోనా? లోపభూయిష్టమైన లోకంలోనా? ప్రశ్నలు, బేతాళుడి నలభై ఏడవ చెట్టు కొమ్మల మీద శవాలై తిరుగుతున్నాయి. చరిత్ర చెక్కిళ్ళ దుఃఖధారలమీద చిరుతలు తిరుగుతున్నాయి... కాదు, కామ చిరుతలు వెంటాడుతున్నాయి... తస్మాత్ జాగ్రత్తా!

---

**రహస్యం :** కథ కంచికి పోలేదు, కాలనాగై అందరి ఇళ్ళల్లోకి జొరబడబోతుంది. తేనెతుట్టెకు మంట పెట్టారు. ఎందరి తల్లి దండ్రుల గుండెలు వధ్యశిలమీద నిలవాలో..., ఎందరు అమ్మాయిల బ్రతుకులు శ్మశాన నడకలు కావాలో... ష్... ష్... గప్...చుప్... మారీచుడు మారువేషంలో తిరుగుతున్నాడు.

అదిగో... గోబుల్స్‌రెడ్డి వచ్చిండు
అమ్మో... కథై పోలేదు.

✡

# హత్తుకుపోయే కథా సంపుటి అంపశయ్య నవీన్ 'నిష్కృతి'



**అబ్బూరి ఛాయాదేవి**

'అంపశయ్య' నవలతో యువ రచయితగా తెలుగు సాహిత్యంలో తనదైన ముద్ర వేసిన నవీన్ శ్రీశ్రీ, బుచ్చిబాబుల తరువాత 'చైతన్య స్రవంతి' కథనాన్ని మరింత సమర్థవంతంగా ముందుకి తీసుకు వెళ్ళారు. తన నవలల్లోనే కాకుండా, కొన్ని కథల్లో కూడా చైతన్య స్రవంతి కథన శిల్పాన్ని ప్రయోగించారు. తన మొదటి కథా సంపుటిలో 'అధోలోకం', 'తీరని కోరిక', 'టెక్నికల్' వంటి కథల్లో చైతన్య స్రవంతిని బాగా ప్రదర్శించారు. యువకుల అంతశ్చేతనలోని భావాల్ని అత్యంత సమర్థవంతంగా ఆవిష్కరించగల కథకుడు అంపశయ్య నవీన్.

ఈ రచయిత నాల్గవ సంపుటి 'నిష్కృతి'లో పది కథలున్నాయి. ఇవన్నీ 2005 – 2007 మధ్య కాలంలో ప్రచురితమైనవే. వాటిల్లో ఒకటైన 'నిష్కృతి' అనే కథ శీర్షికనే ఈ సంపుటికి శీర్షికగా రచయిత ఎంచు కున్నారంటే, అన్ని కథల్లోలా రచయిత దృష్టిలో దానికి మరింత ప్రాముఖ్యం ఉందని అర్థమవుతుంది.

అనాదిగా వస్తున్న ఒక మూఢవిశ్వాసాన్నీ, దానికి సంబంధించిన కుటుంబ హింసనీ చిత్రించి, దానికి వ్యక్తిగత స్థాయిలోనూ, సామాజికంగానూ 'నిష్కృతి'ని చూపించిన కథ ఇది. ఈ కథ చదువుతుంటే కొంతమంది పురుషులు ఎంత మూర్ఖంగా, ఎంత క్రూరంగా, ఎంత దుర్మార్గంగా ఉంటారో అని ఆశ్చర్యపోతాం. అటువంటి వాళ్ళు ఎటువంటి చెడు అలవాట్లకి లోనైనా, ఎటువంటి చెడ్డ పనులు చేసినా వేలెత్తి చూపే వాళ్ళుండరు. సాధారణంగా ఇది పురుషాధిక్య సమాజం కాబట్టి. కానీ పురుషాధిపత్యం నశించాలంటే పురుషుల్లోనే కాకుండా, సంప్రదాయాల్ని జీర్ణించుకున్న స్త్రీలలో కూడా మార్పు రావాలి. ఈ కథలో కథా నాయకుడు చెడ్డవాడని తెలిసినా, అతన్ని తప్పు పట్టకుండా, అతని తల్లీ, సోదరీ అతన్ని ప్రోత్సహిస్తూ, అతని భార్యను చులకన చేసి హింసించడం, ఇతర స్త్రీలకు కూడా అన్యాయం చేయడంతో ఎన్ని అనర్థాలు జరుగుతాయో చూపిస్తుందీ కథ. భార్యగా అతనికి దాసోహం అనడం కూడా న్యాయం కాదని తెలియచెబుతుందీ కథ. భార్యని గొడ్రాలుగా ముద్ర వేసే ముందు, భర్త కూడా డాక్టరు చేత పరీక్ష చేయించుకోవడం అత్యవసరమనీ, ఒకవేళ పిల్లలు పుట్టకపోతే, ఎవరినైనా పెంచుకోవాలి గాని, భార్యని హింసించడం తగదనీ, బహు భార్యాత్వం నేరమనీ, ఒక డాక్టరు చేత ఘాటుగా చెప్పిం చడం బావుంది ఈ 'నిష్కృతి' కథలో.

మూఢ విశ్వాసాలూ, వాటి దుష్ఫలితాల గురించి రాసిన మరో రెండు రకాల కథలున్నాయి ఈ సంపుటిలో. ఒకటి – 'బతుకు తెరువు' – మంత్రాలూ, మహిమలూ ఉన్నాయంటూ అమాయకపు జనాన్ని మోసగించి, దాన్ని బతుకు తెరువు మార్గంగా చేసుకోవడం జరుగుతూంటుంది. అటువంటి వాళ్ళకి బాగా బుద్ధి వచ్చేటట్లు చెయ్యాలే గాని, వాళ్ళని దుర్మరణం పాలు చేయడం మంచిదేనా అని ఆలోచింపచేస్తుంది ఈ కథ. హింసకి ప్రతిహింస పరిష్కారం కాదు గదా. కానీ రాజకీయాలు ప్రోత్సహించే మార్గం అదే.

రెండవది – 'మరణకాంక్ష – జీవితేచ్ఛ' అనే కథ. జ్యోతిష్యం మీద మూఢవిశ్వాసం మనిషిని మృత్యువు ఒడిలోకి ఎలా తోసుకు వెడుతుందో చెప్పిన కథ. ఇటువంటి కథలు చదివి కొందరైనా హేతువాదులుగా మారగలిగితే మంచిది.

సంసారంలో పురుషాధిక్యానికి ఒక ఉదాహరణ – 'అన్న మాట కాదు... ఉన్న మాటే' అనే కథ.... నాకు ఎంతమందైనా గర్ల్‌ఫ్రెండ్స్ ఉండొచ్చు... కానీ నా భార్యకి మాత్రం ఒక్క బోయ్‌ఫ్రెండ్ కూడా ఉండకూడదు అనుకునే మీ పురుష మనస్తత్వం మారాలి..." అని కథానాయిక భర్తతో అంటుంది. ఒక్క చురకతో అటువంటి భర్త మనస్తత్వాలు మారిపోతే ఎంత బావుంటుంది! మారాలన్నదే రచయిత ఉద్దేశం.

బాహ్య సౌందర్యం కాదు, హృదయ సౌందర్యం ముఖ్యం అని సాధారణంగా అందరూ అంగీకరిస్తారు. కానీ శారీరక అందమే ముఖ్యం అనుకుని స్త్రీ పురుషులు తీవ్రంగా నమ్మితే, ఒక సంసారం ఎలా విచ్ఛిన్నమైందో, వివేకవంతంగా ఆలోచించడం వల్ల మరొకరి సంసారం ఎలా నిలదొక్కుకుందో స్పష్టంగా చూపించిన కథ 'ప్రతిస్పందన'.

టీనేజ్ ప్రేమ మీదా, ప్రేమ కథలతోనూ ఎన్నో సినిమాలు తీస్తూ యువతలో ప్రేమ పిచ్చిని పెంచుతున్న ఈ రోజుల్లో యువతీ యువకులు అందరూ చదవాల్సిన కథ 'స్వానురాగమా? అనురాగమా?' అన్నది. ప్రేమకీ, పెళ్ళికీ సంబంధించిన మౌలిక ప్రశ్నల్ని చర్చించిన కథ ఇది. ప్రేమ గురించిన అపోహల్నీ, భ్రమల్నీ తొలగించే కథ. ఆధునికత పెరిగిన ఈ కాలంలో అన్ని తరాల వాళ్ళూ సామాజిక దృష్టితోనూ, తాత్విక దృష్టితోనూ ఆలోచించవలసిన మౌలిక విషయం ఇది.

ఇందులోని మేధోపరమైన చర్చ లాబొరేటరీలో డిసెక్షన్ చేసినట్లుగా వుంది. వాస్తవ జీవితంలో కూడా అంత సహనంతో చర్చించుకుని, తమ భావాలను స్పష్టంగా వ్యక్తం చేసుకుని, పరస్పరం అవగాహన చేసుకోగలిగితే ఇప్పుడున్నన్ని సమస్యలుండవు.

ప్రేమ, పెళ్ళి, స్వేచ్ఛల గురించిన చర్చలతో కూడిన మరో కథ – అన్నిటికన్నా పెద్ద కథ 'సుజిత'. ఇతివృత్తం చాలా చిన్నదే. కానీ, సుదీర్ఘ సంభాషణలతో కూడిన చర్చల వల్లా, చైతన్య స్రవంతి ధోరణిలో ఆలోచనల్ని జతచేయడం వల్లా కథ నిడివి పెరిగింది. అయితే హేతుబద్ధంగా, విశ్లేషణాత్మకంగా ప్రేమికుల మధ్య జరిపిన చర్చల ద్వారా స్త్రీ పురుష సంబంధాల్లో ప్రేమ, పెళ్ళి, బానిసత్వం, స్వేచ్ఛ అంటే ఏమిటో స్పష్టంగా వివరించడం సాధ్యమైంది. స్త్రీ స్వేచ్ఛ విషయంలో ఈ రచయితపై చలం ప్రభావం వున్నట్లు అనిపించినా చలం కన్నా హేతుబద్ధంగా, వాస్తవికంగా ఆలోచించడం కనిపిస్తుంది. స్త్రీని ఒక మేధావిగా, ఆత్మవిశ్వాసం ఉన్నదానిగా, మనస్సులో స్పష్టత ఉన్నదానిగా చిత్రించారు నవీన్. తన ఆకాంక్షలకీ, తన ప్రవర్తనకీ బాధ్యత వహించే నిజమైన స్వేచ్ఛాజీవిగా కథానాయికని చిత్రీకరించారు. తనలోని అహంకారం, అధికారవాంఛ అనే బలహీనతల్ని అర్థం చేసుకుని, తను గాఢంగా కోరుతున్న యువతి కోసం, తనలోని శంకల్నీ, సంప్రదాయాల్నీ చివరికి వదులుకున్న కథానాయకుడు, తను ప్రేమించిన యువతిని జయించడమే కాకుండా, ఆమెచేత జయింపబడ్డానని అంగీకరిస్తాడు. కొడవటిగంటి కుటుంబ రావుగారి లాగ ఈ విషయంలో ఇంత స్పష్టంగా, హేతుబద్ధమైన అభిప్రాయాల్ని పాత్రల ద్వారా వ్యక్తం చేసిన రచయితల్లో ప్రముఖుడు నవీన్.

ఈ సంపుటంలో గ్రామీణ వాతావరణంలోని రాజకీయాల గురించి రాసిన ఒక కథ మంత్ర తంత్రాలపై మూఢవిశ్వాసం గురించి అయితే, రెండవది 'సమీకరణాలు' – ఒక రైతుని ఆత్మహత్యకి ప్రేరేపించే దారుణమైన సంఘటనల గురించీ, కుట్రల గురించీ చెప్పిన కథ ఇది.

వేరే రకాల కథలు రెండున్నాయి. ఆడపడుచుగా ఉన్నప్పుడు ఒక రకంగానూ, వదిన అయినప్పుడు మరో రకంగానూ ప్రవర్తించిన ఒక స్వార్థపరురాలైన యువతి కథ 'గో టు హెల్'.

క్రికెట్ మ్యాచ్ అంటే పిల్లలకి ఎంత పిచ్చో అందరికీ తెలుసు. చదువు పట్ల శ్రద్ధ లేకుండా, క్రికెట్ స్టార్ అవుదామని కలలు కంటూ, తప్పుదారి పట్టే యువకులకు కనువిప్పు కలిగించే కథ 'గాజు తెర'. తల్లిదండ్రులు తమని ఎంత కష్టపడి చదివిస్తున్నారో గ్రహించరు. తమ కలలు నెరవేర వని గ్రహించగానే సమాజం మీద కక్ష పెంచుకుంటారు. అవకాశం చూసుకుని విధ్వంసక చర్యలకీ, దోపిడీలకీ తయారవుతారు. ఫలితం ఏమిటో ఈ కథ తెలియ జేస్తుంది. ఇటువంటి కథల్ని టి.వి.లో చూపించాలి. అప్పుడే నలుగురికీ తెలిసొస్తుంది.

అంపశయ్య నవీన్ ఏ సమస్యని తీసుకున్నా, దాని పూర్వాపరాల్ని క్షుణ్ణంగా పరిశీలించడం, వివరంగా చర్చించడం కనిపిస్తుంది ఈ కథల్లో. ఈ రచయిత కథన శైలి ఎందుకంత బాగా చదివించేదిగా ఉంటుందంటే మాండలికాన్నీ, బడుగు వర్గాల యాసనీ సంభాషణలకే పరిమితం చేసి, కథనాన్ని సామాన్య వ్యావహారిక భాషలో రాస్తారు కనుకనే.

మనస్సునీ, హృదయాన్నీ స్పందింప చేసే కథలు రాసిన అంపశయ్య నవీన్‌కి హృదయపూర్వక అభినందనలు. ★

## గోబెల్ వారసులు



**డా॥ దిలావర్**

అంతరంగం పుచ్చిపోయిన వాళ్ళు
అలవోకగా ఆత్మకు పాడెకట్టుకోవడం
వింతేమీ కాదు.
దీనంగా చేతులు చాచిన గుండె గూటిలో
నిండుగా వెలిగించాల్సిన దీపానికి బదులు
కొరివి మంటల్ని రగిలించగలరు.
ఒంటరి తీగెను అల్లల్లాడించడానికి
మంటల తుఫాన్లు సృష్టించగలరు.
గురి చూసి నాటే బాణానికి
గుండెను చూపడం తప్ప
మౌనంగా ఎలా ఆలపిస్తారు?
నెనరు కురవాల్సిన కుక్కపిల్ల మీద
తలా ఒక రాయి వెయ్యడానికి
'పిచ్చికుక్క' అనివాళ్ళు చేసే
ప్రచారం ముందు
గోబెల్స్ బతికి వుంటే –
'తాను దిగదుడుపే' అనుకొని
గుండె పగిలి చచ్చి వూర్కునేవాడు.
తేనె పూతలో దాక్కున్న కత్తిని
గుర్తు పట్టక పోవడం తప్పే.
వంచన వాళ్ళ ఆయుధం అయినప్పుడు
మగతగా నిద్రలో జోగేవాడు
ఎంతటి మూల్యం చెల్లించాల్సి వస్తుందో
అనుభవంలో కొస్తేగాని తెలియదు.
స్నేహం కోసం మృత్యువు పొలిమేరలోకి
అమరత్వాన్ని ఆహ్వానించిన
థామస్ పిథియస్‌ల కథ మనకి తెలుసు
స్నేహంలో దైవాన్ని చూసిన
'దీవానే –షమ్స్ తబ్రీజ్' రూమీ
అలౌకిక ఉన్మాద ప్రేమ కథా తెలుసు.
ఇప్పుడు తెలుసుకోవలసిందల్లా
మనుషుల రూపంలో
మృగాలు పొంచి వుంటాయని

## ఆకాంక్ష



**పోతగాని**

అమావాస్య శిశిరంలో
చీకటి కమ్మిన చూపుల నిరీక్షణ
అదృశ్యించిన వెన్నెల పూలు
పున్నమై పూయాలనే కాబోలు!
అలసిన కనుల కొలనులో
ఏ అశాంతి కెరటం విరుచుకు పడినా
ఏ దుఃఖపు ఉప్పెన అల ఎగిసిపడినా
తీరని భారంతో
తీరాన్ని వెదకాలనే వుంటుంది
ఆశల దిక్సూచిని ఆసరా చేసుకొని
మొలిచిన ఊహల ఆకుల లయలో
వాస్తవాల వసంతాన్ని
ఆహ్వానించాలనే వుంటుంది
కాలాన్ని దున్ని
చరిత్ర విత్తనాల నాటేందుకు
జీవితమై సాగాలనే వుంటుంది
బ్రతుకు సితారపై
అమర గీతం పాడాలనే వుంటుంది

# రైతన్న జీవనవేదం రాచపాళెం 'పాలి'




**తెలుగులో భావ కవిత్వోద్య మానంతరం అభ్యుదయ కవిత్వోద్యమం పుట్టింది. వీరు ప్రధానంగా కార్మిక, కర్షక జీవన సంబంధమైన రచనలు చేస్తామని ప్రతిజ్ఞ పూనారు. "పొలాలనన్నీ - హలాల దున్నీ - ఇలా తలంలో - హేమం పిండగ - బలం ధరిత్రికి బలి కావించే" కర్షక వీరుల గురించి రాస్తానన్న శ్రీశ్రీ ప్రతిజ్ఞ సూత్రప్రాయంగానే మిగిలింది. అభ్యుదయాన్ని సాహిత్యోద్యమ కాలంలో నికరంగా చెప్పుకోదగిన కృషీవల జీవన సంబంధమైన కావ్యం ఒకటి కూడా రాలేదు. అభ్యుదయ సాహిత్యంలో అది ఒక లోటు.**

## డా॥ యు.ఎ. నరసింహమూర్తి

ప్రాచీన సాహిత్యంలో వ్యవసాయం ఇతివృత్తంగా ఎవరూ ఒక కావ్యాన్ని రాయలేదు. ఇతిహాసాలలోను, ప్రబంధాలలోను ప్రసక్తాను ప్రసక్తంగా నకృత్తుగా వ్యవసాయ సంబంధమైన విషయాలు కనిపించవచ్చును. కథా కావ్యాలలో వ్యవసాయం వృత్తిగా గల వ్యక్తుల వ్యవసాయేతర జీవన సంబంధమైన విషయాలు నిబంధింపబడవచ్చును. కానీ రైతు జీవితం ఎప్పుడూ ప్రధానేతివృత్తం కాలేదు. రైతు వృత్తి కూడా సమాజ జీవనంలో ఒక ప్రధానమైన అంశంగా ఎన్నడూ పరగణింప బడలేదు. ఆ కారణంగా వేయి సంవత్సరాల సాహిత్యంలో రైతాంగ సంస్కృతికి సజీవ సాక్ష్యాలుగా నిలువదగిన జీవన సమరాలు ఎన్నెన్నో మనకందకుండా పోయాయి. అంటే సంఘ జీవనంలోని సింహభాగమంతా తెరమరుగై పోయిందన్న మాట. ఒక జాతి సంస్కృతికి జీవనాడిగా చరిత్ర నిలిచినంత కాలం స్పందించదగిన అపూర్వ జ్ఞాన భండార మంతా అదృశ్యమైపోయిందన్న మాట. ఆ నష్టం పూడ్చరానిది.

సాహిత్యంలో ఆధునికయుగం ఆరంభమైన తరువాత తెలుగులో భావకవిత్వోద్యమంలో కృషీవల కవిత్వమనే ఒక శాఖ తెలుగు సాహిత్య చరిత్రలో అంతకు ముందు జరిగిన తప్పిదాన్ని సవరించే ప్రయత్నం చేసింది. ఆ దశలో ఇంకా సాహిత్యం పూర్తిగా ప్రజాపరం కాకపోయినా దువ్వూరి రామిరెడ్డి, తుమ్మల సీతారామమూర్తి, ఏటుకూరి వెంకట నరసయ్య వంటి ప్రముఖ కవులు కృషీవల కవిత్వం రాసారు. తుమ్మల ఏటుకూరి అసలైన తెలుగు జాతీయాన్ని, నుడికారాన్ని అందిపుచ్చుకొని తెలుగు సొగసులు తొణికిసలాడే పద్యాలు రాసారు. వారి రచనలలో వర్ణితమైన కృషీవల జీవనం దయనీయమైనదైనా వారి కవిత్వం మాత్రం రసరమ్యమై ప్రశంసార్హమైంది.

తెలుగులో భావ కవిత్వోద్య మానంతరం అభ్యుదయ కవిత్వోద్యమం పుట్టింది. వీరు ప్రధానంగా కార్మిక, కర్షక జీవన సంబంధమైన రచనలు చేస్తామని ప్రతిజ్ఞ పూనారు. "పొలాలనన్నీ - హలాల దున్నీ - ఇలా తలంలో - హేమం పిండగ - బలం ధరిత్రికి బలి కావించే" కర్షక వీరుల గురించి రాస్తానన్న శ్రీశ్రీ ప్రతిజ్ఞ సూత్రప్రాయంగానే మిగిలింది. అభ్యుదయాన్ని సాహిత్యోద్యమ కాలంలో నికరంగా చెప్పుకోదగిన కృషీవల జీవన సంబంధమైన కావ్యం ఒకటి కూడా రాలేదు. అభ్యుదయ సాహిత్యంలో అది ఒక లోటు. అభ్యుదయ సాహిత్యోద్యమంలో కొన్ని దశలు దాటిన తరువాత ఎన్నో పరిణామాలు సంభవించాయి. ఆ పరిణామాలు కారణంగా ఇటీవలి కాలంలో ఉత్తరాంధ్ర లోను, తెలంగాణంలోను, రాయలసీమ లోను కొన్ని కృషీవల జీవన సంబంధ మైన కావ్యాలు వచ్చాయి. ఆ రచనలలో 'పాలి' అనే లఘు కావ్యం విశిష్టమైనది, విలక్షణమైనవి అని చెప్పాలి.

రాచపాళెం చంద్రశేఖరరెడ్డి వ్యవసాయ కుటుంబం నుంచి వచ్చిన విద్యాధికుడు. ఒక విశ్వ విద్యాలయంలో పరిణత బుద్ధియైన ఆచార్యుడు. ప్రాచీనాంధ్ర సాహిత్యం ప్రధానాంశంగా పరిశోధక పట్టభద్రుడయాడు, ఆ సంస్కారమంతా అతడి బుద్ధిలో ఇవతళించి ఉంది. బాల్యం నాటి వ్యావసాయక జీవితం ఆయనకొక సంస్కృతి. మిగిలిన జీవితమంతా పట్టణ జీవితమే. ఆయన తండ్రి వ్యవసాయదారుడు, ఆయన మాత్రం విద్యాకృషీవలుడు మాత్రమే. ఇది రాచపాళెం జీవన పార్శ్వం. సృజనాత్మక సాహిత్య సంబంధమైన ఇంకొక జీవనపార్శ్వం తెలుగు నాట ఆయన పట్ల ఒక ఆకర్షణను కలిగించింది. ఆయనను విమర్శకుడని అంటారు. మౌలిక రచనలు, అనువాదాలు, సంపాదకత్వం వహించిన రచనలు ఆయన పేర వెలువడ్డాయి. రెండు పదులు దాటిన ఈ రచనలలో ఎక్కువ విమర్శ ప్రక్రియకు చెందినవైన కారణంగా అందరూ ప్రధానంగా ఆయనను విమర్శకుడని భావిస్తారు. సాహిత్య విమర్శ నా ప్రధాన కార్యక్షేత్రమని, విమర్శకుడననిపించుకోవడం తన కిష్టమని ఆయన చెప్తూ ఉంటారు. విమర్శకులుగా రాణించిన కవులున్నారు. కవులుగా రాణించిన విమర్శకులు అరుదు. రాచపాళెం ప్రధానంగా విమర్శకుడైనా కవిత్వ ఫలాన్ని చిలక్కొట్టుడు కొట్టడం మాత్రం మానలేదు. ఇందుకు ఆయన ఇది వరలో ప్రకటించిన "స్వర్ణభారతి సాక్షిగా", "సీమ నానీలు" అనే కవితా సంపుటులు సాక్ష్యమిస్తాయి. ఈ చిలక్కొట్టుడు వ్యవహారాన్ని అధిగమించి పూర్తి స్థాయి కవిగా తనను తాను నిలువరించుకోడానికి ఆయన చేసిన ప్రయత్నం సఫలమై 'పాలి' అనే ఆధునిక వ్యావసాయక కావ్యం వెలువడింది.

'పాలి' అలవోకగా చెప్పిన గాలి కబురు కాదు. కల్పన కాదు. కాకమ్మ కథ అసలే కాదు. జీవన సమరంలో కాకలు దీరిన అవిశ్రాంత యోధుల విస్మృత దయనీయ గాథ. కడగండ్ల సెలయేరు. అభిశప్త జీవనానికి సంకేతప్రాయమైన అనంతపురం రైతు జీవన సమవకారం. ఆత్మహత్యలు, వలసలు అనుదిన

కృత్యాలుగా ఎడతెగకుండా నడుస్తున్న బీభత్స కాండతో అతలాకుతలమవుతున్న అనంతపురం రైతు జీవితంలోని ఒక పంట కాలం ఈ కావ్య వస్తువు. ఈ జీవితంలోని లోతులన్నీ కవి కొన్ని దశాబ్దాల కాలం తలచి తలచి, తవ్వి తవ్వి తలకెత్తుకొన్నాడు.

ఇది కేవలం కవి వ్యక్తి చైతన్యంలోంచి ఉద్భవించిన కావ్యం కాదు. ఒక సామూహిక చైతన్యంలో భాగస్వామిగా ఉంటూ ఆ చైతన్యం అన్నార్తులై అన్ని విధాలా అణగారి పోతున్న తన గ్రామీణ సోదరుల అసహాయతను, విహ్వలత్వాన్ని తన రక్త స్పందనలో ఇముడ్చుకోలేక కొన్ని సంవత్సరాల సవికల్ప సమాధి నుండి ఆవాపోద్ధారాలతో క్రమబద్ధంగా వెలువడినప్పుడు సిద్ధించిన సరస్వతి. 'వారు వెలువరించిన కవితా సంపుటాల తర్వాత ఈ కావ్యం పుట్టింది. రాచపాళెం ఆ కవితా సంపుటాలలో కూడా భాగస్వామిగా ఉన్నారు. ఈ కావ్య రచనలో కేతు విశ్వనాథరెడ్డి గారి "నమ్ముకున్న నేల', సింగమనేని నారాయణగారి 'అడుసు', శాంతి నారాయణ గారి 'దళారి', లంకిపల్లెగారి 'పంట కళ్ళెం – పసిడి పువ్వు' వంటి కథలలోని ఆలోచనలు సంస్కారం తోడ్పడింది." అని కవి స్వయంగా చెప్పారు. అందుకే సామూహిక చైతన్యం నుండి ఉబికి వచ్చిన వ్యక్తిగత సంవేదన ఈ కావ్యమని నేనంటున్నాను.

ఉబికి వచ్చింది అన్నంత మాత్రాన ఇది ధారగా క్షణాల మీద తన్నుకొని పైకి వచ్చిందని అనుకోవలసిన పనిలేదు. కవి కొన్నేళ్లు ఈ వస్తువును పుటం పెట్టి మరీ పైకి తీసుకువచ్చారు. సంప్రదాయ మార్గంలో చెప్పాలంటే ఇది "పుటపాక ప్రతీకాశము" దీనిని ప్రచురించి పాఠకుల కందించే ముందు కవి కవిత్వ నిర్మాణ కుశలత గల తన తోటి కవుల ఆమోదముద్ర వేయించుకున్నారు. ఈ విషయంలో రాచపాళెం పూర్వ కవుల సంప్రదాయాన్ననుసరించడం యువ కవులకు ఒక ఆదర్శంగా నిలుస్తుందనాలి.

కథ చెప్పేస్తే కావ్యం కాదు. దానికొక అదనపు విలువ జత కూడాలి. సంప్రదాయ గ్రామీణ సంస్కృతిలో రైతులు తమ వరి పొలాల మీద నెత్తురు కూడు చల్లడాన్ని 'పొలి' అంటారు. ఆ కథనం కొనసాగిస్తూ ఇప్పటి ప్రభుత్వ విధానాలు రైతుల రక్తమాంసాలను పంట పొలాల మీద పొలిగా చల్లటాన్ని స్ఫురింపజేయడానికి కవి ఎత్తిన నిరసన గళం ఈ కావ్యానికి అదనపు విలువగా

— — — — — * * * — — — — —

**నిజానికి వ్యవసాయం కంటే గొప్ప వృత్తి, రైతు జీవితం కంటే గొప్ప జీవితమూ ఉండవు. అయినా మన సాహిత్యంలో 'పొలి' అనే చిన్న కావ్యం పుట్టిన దాకా ఈ క్రమాన్ని ఇంత సహజంగా క్లుప్తంగా అందంగా కవితాత్మకంగా చెప్పిన కావ్యం ఇంకొకటి లేదు.**

— — — — — * * * — — — — —

జతపడింది. ఈ కావ్యంలో ఒక పంట కాలమంతా కనిపిస్తుంది. రైతు ఉగాది దాటిన తరువాత తాడు పేనడం ప్రారంభించిన దగ్గరి నుండి చినిగిన గోతాలకు కుట్లుపడేదాకా ఒక పంట కాలం నడుస్తుంది. ఇంకో రకంగా చెప్పాలంటే ఆ పంటకాలం

రంపం / బాడిస
గూటం / సుత్తి
ఆకురాయి ఆయుధాలుగా
నాగలి బిగించడంతో మొదలై
కొడవలికి కక్కు పెట్టడంతో ముగుస్తుంది.

"పొలి"లో ఈ పంటకాలం ఎందుకు, తూర్పు పటం, నారు, చాడ, నీరు, ముడుపులు, ఆకు, నాట్లు, పొంచిలు, కొంగలు, కలుపు, గంట, మూటు, పొలి, గెనాలు, చివరిదాడి, కక్కు, కోత, మేర, పరిగ, కల్లం, చివరకు అని 22 ఖండాలుగా విభక్తమయింది. ఒక పంట కాలాన్ని విశ్లేషిస్తే రైతు జీవితమంతటినీ విశ్లేషించినట్లే. ఎందుచేతనంటే కాలానికీ, కాలానికీ పంట మారుతుంది. కానీ ఎంత కాలం గడిచినా సామాన్యుడైన రైతు కడుపు మంట ఆరదు. ఆ పంటను, మంటను రాచపాళెం ఈ కృతిలో పల్లె సొగసు, బ్రతుకు బరువు తూకం వేసి మరీ చూపించారు.

కలబంద నారతో తాడుపేని తన బతుకు రథం లాగడానికి రైతు అటకమీది నుంచి కదిలిపోయిన మేడి సడలిపోయిన సొగ వంగిపోయిన కర్రు విరిగిపోయిన కాడి అరిగిపోయిన పంత కిందికి దింపడంతో కొత్త పంటకాలం మొదలౌతుంది. ఆ తరువాత నారు పోస్తారు, నారు పోసిన నెల రోజులలో ఎండిన నేలను పండే పంటకు రంగ భూమిని చేయడానికి చాడవేస్తాడు. చాడ వరి సేద్యానికి తొలి జాడ. ఆ తరువాత గూడ అయితే గూడ, మోట అయితే మోట, మోటరు అయితే మోటరు, బోరు ఏదో ఒక దానితో పొలానికి నీరు పెడతాడు. ఆ తరువాత నాట్లు వేయడానికి మూడు ముడుపులు – పొలాన్ని సారం చేయడానికి రేగ్లాకు బిల్లాకు వెంపల్లాకు వంటి అడివాకు, వేపాకు గంగరేణాకు వంటి ఇంటి ఆకు మెత్తగా దున్నిన నేల మీద పరచి తొక్కడం – తెల్లని కయ్యలలో నాట్లు పడతాయి – పొంచిలు వంచడం – పైరు నాటిన కయ్యల్లో కొంగల దాడిని డబ్బాల మోతతో తరిమికొట్టడం – కలుపు తీయడం – వరి గంటల పరిపుష్టికి ఎరువు వేయడం – సుబ్బయ్య ఊదరబెట్టి ఈ సుళ్ళ పుట్టను కుండలోకి రప్పించడం ఎల్లయ్య, తరిమి తరిమి పాముల్ని పట్టడం గెనానికి గాట్లు పెట్టి ఎలుకలను పట్టడం – బలివేసి పొలి చల్లడం – గెనాలు తొక్కడం దళలు సర్దడం పొంచిలు సరిదిద్దడం మడమలు మార్చడం – పోటాకును చీల్చుకొని పాలెన్ను పైకొచ్చాక డబ్బా కొట్టి పిట్టల్ని తోలడం – కొడవలికి కక్కు పెట్టడం – వరిపైరుకోత – చాకలి మంగలి తోటి తవారి కంసాలి కుమ్మరి పూజారి – ఇలా సేద్యమనే మహా శిల్పాన్ని చెక్కడానికి రెక్కలు ముక్కలు చేసుకున్న వారందరికీ మేర కొలవడం – పరిగె ఏరుకోవడం – మోపుల్ని కయ్యల్లోంచి కల్లాలకు మోయడం – వామి వెయ్యడం – వామలోంచి పాదుల్ని తీసి పన గొట్టడం – రాలిన గింజలను తూర్పారబట్టి పొలి తిరగడం – గోతాలు శేర్లు దారాలు దబ్బనాలు తీసుకుని వడ్లను గోతాలకెక్కించి వ్యాపారులకు అమ్మడం – ఇదంతా ఒక పంట కాలంలో చోటు చేసుకొనే దశల క్రమం, అనంతపురం జిల్లాలోనే కాదు, రాయలసీమలో తెలంగాణంలో ఉత్తరాంధ్రంలో దేశం మొత్తం మీద ఎక్కడ చూసినా ఈ క్రమం ఇలాగే ఉంటుంది. వ్యవసాయం నిన్నా మొన్నటిది కాదు. మన సాహిత్యం పుట్టక ముందే పుట్టింది. నిజానికి వ్యవసాయం కంటే గొప్ప వృత్తి, రైతు జీవితం కంటే గొప్ప జీవితమూ ఉండవు. అయినా మన సాహిత్యంలో 'పొలి' అనే చిన్న కావ్యం పుట్టిన దాకా ఈ క్రమాన్ని ఇంత సహజంగా క్లుప్తంగా అందంగా కవితాత్మకంగా చెప్పిన కావ్యం ఇంకొకటి లేదు. అదపా తదపా అక్కడా – అక్కడా కొందరు కవులు కథకులు నవలాకారులు ఇందులోని దశలను ఒకటి రెండింటినో, మరి కొన్నింటినో ఎన్నుకొని ఎత్తుకొని ఉండవచ్చును. కానీ ఈ సమగ్రత ఇంకొక చోటలేదు. ఒక పంట కాలాన్ని ప్రమాణంగా ఎంచుకోవడంలోనే రాచపాళెం విశిష్టత కనిపిస్తుంది.

ఉప్పెనకు వెనుకాడక ఎప్పటి కప్పుడు కడలి మీద వేటకు కదలిపోయే

జాలరిలా కనిపిస్తాడు రైతు, ఆశ, అడియాసల మధ్య ఆనులో కండెలా తిరిగే రైతు బ్రతుకుబాటలోని మొక్కలోని మగటిమిని చూపడానికి తన తండ్రిని సూత్రప్రాయంగా గ్రహించాడు కవి. కవి తల్లి లేని బిడ్డ. బాల్యం నుండి తండ్రి వెన్నంటి తిరిగి ఆ మగటిమిని అంకించు కున్నవాడు. అందుకే ఈ పంటకాలంలో కవికి తన తండ్రి ధీరుడు గాను, ధీరోదాత్తుడుగాను కనిపించాడు.

కదిలిపోయిన మేడి
సదలిపోయిన నొగ
వంగిపోయిన కర్రు
విరిగిపోయిన కాడి
అరిగిపోయిన పణత
అటక మీది నుంచి కిందికి దిగాయంటే
మా నాయన
కొత్త సేద్య సంరంభానికి
సైన్యాన్ని సమాయత్తం చేస్తున్నట్లే
అది సేద్య సూర్యోదయానికి
తూర్పు పటం.

నిర్వాసితుడైన చక్రవర్తి తన శిధిల సామ్రాజ్యాన్ని పునర్నిర్మించుకోడానికి చతురంగ బలాలను సమీకరించడంలోని అకుంఠిత దీక్ష ఈ చరణాలలో మనకు కనిపిస్తుంది. ఇద్దరూ ఒకరి కొకరు తీసిపోరు, అయితే పోరు తీరు, పోటు బలగంతో మాత్రం తేడా కనిపిస్తుంది. సమర సంరంభంలోని ఆ గాంభీర్యాన్ని ప్రదర్శించ డంలో కవి చూపిన మెలకువ రైతు లోని ధీర ప్రవృత్తిని మనకు తెలియజేస్తుంది.

చాడ వరి సేద్యానికి తొలి జాడ
యుద్ధ ప్రాతిపదికన
మట్టిని మీగడగా మార్చే క్రీడ
అందుకే అప్పుడు మా నాయిన
మండే సూర్యుడులా ఉంటాడు

వ్యవసాయం ఒక జానపద శాస్త్రం, మట్టిని మీగడగా మార్చడమంటే వ్యవసాయ విజ్ఞానాన్ని కావ్య కళగా మార్చడమే. యుద్ధ ప్రాతిపదిక మీద చాడ వేయడానికి పూనుకొన్న తండ్రి మండే సూర్యుడిలా కనిపిస్తే సహృదయుల హృదయాలలోకి ఆ జాడలు దింపడానికి వెన్నెల సోన కురిసే చంద్రు డౌతాడు. శాస్త్ర మర్యాదను కావ్య మర్యాదగా మార్చడంలోని మర్మమిది. ఈ స్ఫూర్తి ప్రాధినే పింగళి సూరన్న "కౌముదీ మార్తండద్యుతి వైభవం" అన్నాడు.

చదువనైన నేలను
తొలి చాలు దున్నతుంటే
మా నాయిన

— — — — — * * * — — — — —

**వ్యవసాయం ఒక జానపద శాస్త్రం, మట్టిని మీగడగా మార్చడమంటే వ్యవసాయ విజ్ఞానాన్ని కావ్య కళగా మార్చడమే. యుద్ధ ప్రాతిపదిక మీద చాడ వేయడానికి పూనుకొన్న తండ్రి మండే సూర్యుడిలా కనిపిస్తే సహృదయుల హృదయాలలోకి ఆ జాడలు దింపడానికి వెన్నెల సోన కురిసే చంద్రు డౌతాడు.**

— — — — — * * * — — — — —

సృష్టి రహస్యం అన్వేషించే తత్త్వవేత్తలా ఉండేవాడు.

అన్నం పరబ్రహ్మ స్వరూపమని పెద్దలంటారు. తత్త్వవేత్త చరాచర జగత్తును సృష్టించే పరబ్రహ్మాన్ని తెలుసు కోగోరితే ఆ పరబ్రహ్మానికి ప్రతీకగా కనిపించే అన్నాన్ని సృష్టించడానికి ఉద్యమించిన రైతు కూడా సృష్టి రహస్య శోధకుడుగా కనిపించ డంలో వింత లేదు. ఇది కవికి తండ్రి పట్ల, రైతుపట్ల కలిగిన ఆరాధనా భావాన్ని తెలియజేస్తుంది.

మూడో మడుపులో
కలుపును దున్నుతుంటే
మా నాయిన
దుష్ట సంహారం కోసం
నాగలి పట్టిన వీరుడిగా కనిపిస్తాడు.

కవి దృష్టిలో వరి సేద్యమైనా, వెలి సేద్యమైనా పైరు ఎదగాలంటే కలుపు తియ్యక తప్పదు. కవి అంతశ్చేతనలో ఇంకొక అంశం ఇమిడి ఉంది. సమాజంలో బలంగా పెరిగి వ్యాపించిన కలుపు మొక్కలు సమాజ శ్రేయో ఫలాన్ని ప్రజలకు అందకుండా చేయడం పట్ల కవిలో ఒక ధర్మాగ్రహం నిండి వుంది. ఆ కలుపును తొలగిస్తే గానీ సమాజం బాగుపడదని కవి భావన, నిలవనీడ నిస్తే నీడనే తినేసే ఆ కలుపు మొక్కల పీడను తొలగించడానికి ఉద్యమించాలని ఆయన ఆశయం. అందుకే పొలంలో కలుపు తీసే తండ్రి ఆయనకు దుష్ట సంహారం చేసే వీరుడిగా కనిపించాడు. ఇంతవరకు ధీరుడిగా కనిపించిన రైతు కల్లంలో రాశిగా పోసిన వడ్లను చూసి నవ్వులు కురిపించినప్పుడు ధీరోదాత్తుడిగా కనిపిస్తాడు. ఇలా వివిధ దశలలో అవకాశం వచ్చినప్పుడల్లా కవి తన తండ్రి పట్ల, రైతు పట్ల తనకుండే ఆరాధ్య భావాన్ని వెల్లడించడంతో ఈ చిన్ని కావ్యంతో తెలుగు కవిత్వంలో అంతకు ముందులేనంతగా రైతు కష్ట నష్టాలతో పాటు సామర్థ్యాన్ని కూడా చాటి చెప్పినట్లయింది.

ప్రాచీన కవులు, భావకవులు ఎవరైతేనేం వ్యవసాయమంటే మగవాళ్ల పని అని మాత్రమే భావించారు. స్త్రీ ప్రస్తావన కొంచెం కనిపించినా వారి భాగస్వామ్యం మాత్రం స్పష్టంగా కనిపించదు. రాచపాళెం రైతు కుటుంబంలో పుట్టిన కారణంగానే కాక అభ్యుదయ దృక్పథం గల కవి కావడం చేత వ్యవసాయంలో స్త్రీలు నిర్వహించే పాత్ర ఎంత బలమైనదో తెలియజెప్పాడు. "ఆడవాళ్ల కష్టం లేనిదే ఆ కళ్లు తీరవు" అంటాడు చానో. ఆ కష్టమెంతటిదో 'పొలి' తెలియజేస్తుంది. ఆడవాళ్లు అంతే. పంట కాల శ్రమను యథాశక్తిగా పంచుకుంటారు. తల్లి సద్దికడవలు సిద్ధం చేస్తే మేనత్తలు వాటిని పొలానికి మోసుకొస్తారని కవి చెప్తాడు.

దురదృష్టవంతులు మా మేనత్తలు
ఇంటా బయటా
వాళ్లు కర్పూరంలా కరిగిపోందే
నేల పలకదు
మట్టి కరగదు
పైరు పెరగదు
పొలి రాలదు

అని మేనత్తల శ్రమను వర్ణిస్తాడు. తోడబుట్టిన వాడి పంటను కాపాడడం కోసం ఒక మేనత్త కొంగలతో సమవకారం చేస్తుంది. మంగమ్మత్త తాను కొట్టే డబ్బా మోత కంటే పెద్ద గొంతుతో తిట్లకు లంకించుకొని పాలవెన్నుపై దాడిచేసే గువ్వల దండు దాడి మీద రోజంతా ఎదురు దాడి చేస్తూనే ఉంటుంది. ఇదంతా ఇంటి ఆడవాళ్ల కష్టం. వరి మొలకలతో పొలాలను నేసే నేత గిరిపల్లి ఆడోళ్ళ కష్టం కూడా వరిమళ్ళను రంగులద్దిన చీరలుగా ఎలా చేస్తుందో కవి చూపించాడు.

కలుపు తీసే పనికి
మా మంగమ్మత్త నాయకత్వం
మా నాశమ్మత్త ఉపనాయకత్వం
మాల రామక్క బొర్రక్క కర్రెక్క
ఊళ్లో చెంగమ్మ, ఇల్ల రాజమ్మ
చేతుల్ని దువ్వెనల్ని చేసి
నేలకు చిక్కు తీసినట్లు
కలుపు తియ్యడం
యూనివర్శిటీలు నేర్పని విద్య

అంటూ ఇంటివాళ్లు, ఊరివాళ్లు చేయి చేయీ కలిపి మట్టిలోంచి బంగారం పుట్టించే సందడి ఎలా ఉంటుందో రుచి చూపించేదు. ఆడవాళ్ల సాయంతో మాత్రమే రైతుకు పంట దక్కదు, పంట పండించడం ఒక మహా శిల్పమని ఆ శిల్పాన్ని చెక్కడానికి ఎందరో శిల్పులు రెక్కలు ముక్కలు చేసుకోవాలని చెప్తాడు.

చాకలి రోశయ్య మంగలి సుబ్బరాయుడు
తోటి చెంగల్రాయుడు తవారి నారయ్య
కంసాలి దొరసామి, కుమ్మరి రామక్క
పూజారి మునెయ్య, ఇల్ల సుబ్బయ్య
సహస్ర వృత్తుల సమస్త చిహ్నాల
ఆశల వల్లరి మేర

సేద్యం సామూహిక శ్రమ అని గుర్తించి తన తండ్రి వీరందరకూ మేరలు కొలిచి జీతం చెల్లిస్తే కవి ఏకంగా తన కావ్యాన్నే వారికి అంకితం చేసి ఒక విలక్షణ మార్గంలో కూలీ - నాలీ జనానికి వినమ్రంగా తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

కవిత్వం గురించి చెప్పుకోడానికి కావలసినన్ని కబుర్లున్నాయి. కానీ అవన్నీ ఇక్కడ అక్కరకు రావు. కవి సూరన్న బడిలో చదివిన వాడైనా చలువ - చెలువము - సౌరభము - కోమలత్వము - మాధుర్యము అన్నీ ఒక చోట చేరితేనే కానీ కవిత్వం కాదన్న పాత పాఠాన్ని వదలుకున్నాడు. ఇక్కడ కొత్తపాఠం ఆరంభించాడు. ఈ కవిత్వంలో జ్ఞానేంద్రియ చైతన్య పరితర్పణం కనబడదు. సుఖమో - దుఃఖమో తెలియని ఒక అద్వైతం కారణంగా ఇంద్రియ గణం పరిమూఢమవుతుంది. వస్తువు, అనుభవం -రెండూ లోకంలోనే ఉంటాయి. కవి అభివ్యక్తీ లౌకికమే, సహృదయుడి అనుభూతీ లౌకికమే. ఇంత మంచి ఆవిష్కారంలో కావ్యానికి మేలు చేయని ఒకటి, రెండు వికృతులు కూడా ఉన్నాయి. కవి విద్యాధికుడైన కారణంగా "మా నాయన కళ్ళల్లో - ఒక విశ్వాస హేల - ఆయన గుండెల్లో - ఒక రసరమ్య లీల" వంటి రొడ్డగొట్టుడు ప్రయోగాలు, ఆడపా తడపా కొరమాలిన మాటల బరువులు ఈ కావ్యంలో అతకనివిగా కనిపిస్తాయి. మహా ప్రస్థానం తరువాత 'సమవకారం' అనే ప్రయోగం ఈ కావ్యంలోనే కనిపిస్తుంది. 3 కపటములు, 3 విద్రవములు అనే లక్షణం తప్ప సమవకార లక్షణాలు ఇందులో కనబడవు. శ్రీశ్రీ లాగే రాచపాళెం కూడా సమవకారానికి ఒక కొత్త అర్థ స్ఫూర్తిని కల్పించారు. ఈ కావ్య రచనా సమయంలోనైనా కవి విద్యాధికుడు కాకుండా తన తండ్రిలా జానపదుడై ఉండి ఉంటే బాగుండుననిపించింది. ఫలశృతిలో ఇంకొక వికృతి ఏర్పడింది. కవి ఎర్రబావుటా నిగ నిగలను సూచ్యం చేయకుండా వాచ్యం చేయడం వల్ల కావ్యరథం కవితా మార్గాన్ని వదిలి రాజకీయ పథానికి మళ్లింది. ఈ మలుపు లేకపోయినా కవి ఆశయ సిద్ధికి భంగం కలిగి ఉండేది కాదు. పొలి స్వచ్ఛ ప్రకృతికి ఈ వికృతులు అవరోధాలుగా నిలిచేవి కావు. పొలి ఒక అపరిచిత దుఃఖ సమాశ్వాసం, ఒక అనధిగమ స్వేచ్ఛా సమాశ్లేషం.

*

## చివరి సూర్యోదయం

**జి. పేరిందేవి**

నీ ముఖంపై వాడని చిరునవ్వు
అప్పుడే విరిసిన జాజిమల్లి!
మన స్నేహం
రూపం లేని కల వైనం,
పుండు మానినా మచ్చ మిగిల్చిన జ్ఞాపకం!
స్నేహాన్ని జెండాలా ఎగరేద్దామనుకున్నా,
దారం తెగిన గాలిపటంలా
ఎగరేస్తాననుకోలేదు.

నీ శరీరం నుండి చిందిన
ప్రతి రక్తపు బొట్టూ
ఒక్కో మేఘమై ఆ సాయంత్రం
సూర్యున్ని కమ్మేశాయి
నీ మరణానికి ఆకాశం
చుక్కలు చుక్కలుగా కన్నీళ్ళను
నక్షత్రాలై రాల్చుకుంది.
నేను కోల్పోయిన
ఇరవై సంవత్సరాల స్నేహాన్ని అనుభవించాక
మంచితనం కూడా
ఇంతలా బాధ పెడుతుందని తెలుస్తోంది.

**(చిన్ననాటి స్నేహం 'మల్లిక')**

## ఇక్కడే వెతుకు

**మూలం : పాబ్లో నెరూద**

**తెలుగు సేత : ఎల్. ఆర్. స్వామి**

ఓ యాత్రికుడా
నీవు పురుషుడవైతేనేమి
స్త్రీ వైతేనేమి
ఇక్కడ వెతుకు
నన్ను ఇక్కడే వెతుకు
ఇసుకకి, కడలికి మధ్య
అలల నురుగులలో చిక్కి
చెదిరే వెలుగులో
నన్ను వెతుకు, ఇక్కడే వెతుకు,
నేను వచ్చేది ఇక్కడికే,
మాటలు పలుకక, మౌనిగా
నోరులేని పరిశుద్ధుడువై
జలచలనమై
జల హృదయ చలనమై
నేను నిలిచేది, ఇక్కడే.
ఇక్కడ, నన్ను పోగొట్టుకుంటున్నాను
ఇక్కడే, తిరిగి సంపాదించుకుంటున్నాను
బహుశ ఇక్కడ నేను రాయకావచ్చు
నిశబ్దం కావచ్చు
కాని నిలిచేది, ఇక్కడే,
అందుకే, నన్ను ఇక్కడ వెతుకు,
ఇక్కడే వెతుకు

## బొబ్బిలి నానీలు

**బి. జోసెఫ్**

పచ్చని చెట్టు నీడ
కన్నతల్లి ఒడి
ఎప్పుడూ
చల్లదనమే!

కుంభ వృష్టికి
ఆకాశం శుభ్రపడింది
నీలం రంగులో
నిగనిగలాడుతూ!

ఆకాశంలో
ఇంద్రధనుస్సును
ఆర్చి కట్టిన శిల్పులు
ఎండ - వాన!

రాత్రంతా
జగతికి పురిటి నొప్పులు
ప్రసవించింది
అరుణోదయం!

# బతుకు



రాత్రి ఊర్లో దండోరా వేశారు. మైనందాసు తన పాత దప్పు తీసుకుని ఏనుకున్న నాటుసారా కిక్కుల్లో చిందేస్తూ బజారు, బజారు తిరిగి దప్పు వోగించి మరీ చెప్పాడు. చిందేయటంలో దాసుది వెరైటీ. మందేసి చిందేస్తే చూడాలి మరి పెండ్లికైనా చావుకైనా దాసు దప్పు వోగాల్సిందే, ముందు నడవాల్సిందే. తండ్రి తాతల నుండి వస్తున్న దప్పు వాయిద్యంలో దాను దిట్ట అనిపించుకున్నాడు.

మేరెడ్డి యాదగిరిరెడ్డి

“రేపు పొద్దుగాల ముత్యాలమ్మ చెట్టు దగ్గర అదే పంచాయితీ ఆఫీసుముందరకి  తహశీల్‌దారు వస్తుండు. భూమిలేనోల్లకు భూములిస్తరట. అందరూ రావాలహో” ఊరంతా తిరిగి మరీ మరీ చెప్పాడు. పంచాయితీ సెక్రటరీ యిచ్చిన ఇరవయి రూపాయల నాటుసారా వేసుకుని మరీ చెప్పాడు. అలాగని దాసు రోజు తాగడు. ఎవరైనా పదీ పరకా యిచ్చినప్పుడే కాసింత నాటు వేస్తదు. సరదా మనిషి.

జనం గుంపులుగా చెట్టు కిందికి వచ్చారు. పెద్దా చిన్నా ఆడా మగా అంతా ముత్యాలమ్మ చెట్టు నీడన చేరారు. ఊరి మధ్య పెద్ద మర్రిచెట్టు. దానికింద ముత్యాలమ్మ గుడి. అదే ముత్యాలమ్మ చెట్టు. ఊరిలోని పెద్ద చెట్లన్నీ బొగ్గు బట్టీల పాలయ్యాయి. ఈ చెట్టు జోలికి మాత్రం ఎవరు రాలేదు. ముత్యాలమ్మ దేవతకు కోపమొస్తుందని ఆకు కూడా ఎవ్వరూ ముట్టుకోరు. శ్రావణ మాసంలో బోనాలు, బతుకమ్మ పండగపుడు బతుకమ్మల సందడి అన్నీ ఆ చెట్టుకిందే. పిల్లల ఆటాపాటా ఆడవాల్ల చప్పట్లు, మగవాల్ల కోలాటాలు, భజనలు, బాగోతులు, తోలు బొమ్మలాటలు, పిచ్చకుంట్ల కథల చిరుతల రామాయణాలు, ఊరు మంచి చెడు, ఆలుమగల పంచాయతీలు, గట్ల పంచాయతీలు, అన్నదమ్ముల ఆస్తి తగాదాలు, భూ తగాదాలు, రాజకీయాలు ఇరుగు పొరుగు ముచ్చట్లు అన్ని ఆ చెట్ల నీడనే.

ఆ పక్కనే అంగన్‌వాడీ బల్లో చిన్నపిల్లల ఏడ్పులు, సర్కారు బల్లో పంతుల్ల పాఠాలు, పిల్లల చప్పుల్లు తెల్లారితే వెరసి ఊరు ఊరంతా అక్కడవున్నట్లే ఉంటుంది. పేపరు చదివేవాల్లు, ముచ్చట్లు వేసేవాల్లు ఎవరిపనిలో వారు వున్నారు.

ఉదయం పదిగంటలయింది. పది కుర్చీలు తెప్పించి చెట్టు కింద వేయించాడు పంచాయితీ సెక్రటరీ. పంచాయితీ ఆఫీసు పక్కనే వుంది. బయ్యిన దుమ్ము లేపుకుంట వచ్చిన జీపు చెట్లు కింద ఆగింది. తహశీల్‌దారు, ఆర్.ఐ, సర్వేయర్ ఫైల్లు పట్టుకుని కిందికి దిగారు. డ్రైవరు జీబును దూరంగా స్కూల్ దగ్గర చెట్టు కింద పెట్టాడు.

భూమి లేని పేదలకు ఎసైన్‌మెంట్ భూమి పంచుదామని తహశీల్‌దారు సిబ్బంది వచ్చారు. వాల్లకంటే ముందుగానే పంచాయితీ సెక్రెటరీ, రెవిన్యూ సెక్రటరీ, పంచాయితీ ప్రెసిడెంట్‌తో కలసి భూమిలేని పేదలను పిలిపించారు. అందరు ఆత్రంగా ఎదురుచూస్తూ నిలబడ్డారు. ఎవరెవరికి భూమి వస్తుందో అని ఈ దఫా పట్టాలు ఆడవారి పేరు మీదే ఇవ్వాలని ప్రభుత్వం ఆదేశం మేరకు పాసు బుక్‌లు ఆడవారి పేరుమీదే తయారు చేశారు.

లిస్టులోని పేర్లన్నీ రెవిన్యూ సెక్రటరీ చదివి వినిపించాడు. ఒక్కొక్కరిని రమ్మని చెప్పాడు. భూమి కోసం వచ్చిన వారంతా ఒకరి వెంట ఒకరు తహశీలుదారు దగ్గరకు వచ్చారు. ఒక్కోక్కరికి పాస్‌బుక్ పట్టా సర్టిఫికెట్ అందించాడు. భూమి పట్టాలు పాస్‌బుక్‌లు

అందుకున్న ఆడవారి ముఖాలు సంతోషంతో వెలిగిపోతున్నాయి. దాసు భార్య మల్లీశ్వరికి కూడా పాస్‌బుక్ పట్టా సర్టిఫికెట్ ఇచ్చారు.

"ఇదిగో చూడండి ఇది ప్రభుత్వ భూమి. భూమిలేని పేదలు బాగుపడాలని ప్రభుత్వం మీకు ఈ భూమి యిచ్చింది. భూమిని బాగు చేసుకుని పంటలు పండించుకోవాలి. అందరికి బోర్లు వేసి యిస్తాం. మీరిప్పుడు కూలీలుగారు, రైతులు. బాగా కష్టపడి పంటలు పండించి సుఖంగా బతుకండి. మీరు ఈ భూమి అమ్మచూపినా, పడావు పెట్టినా ఈ భూమి వేరే వారికి ఇవ్వబడుతుంది. "సర్వేయర్ వచ్చి ఇప్పుడే మీకు భూమి కొలిచి రాళ్ళువేసి మీకు స్వాధీనం చేస్తాడు". లేచి నిల్చున్న తహశీల్దారు తన ఉపన్యాసం పూర్తి చేసి కుర్చీల కూర్చొని ముఖం తూడ్చుకున్నాడు.

పాస్‌బుక్‌లు ఇచ్చిన వారినంతా గ్రామ కార్యదర్శి పక్కకు పిలిచాడు. తలా ఐదొందలు మొత్తం పదిమంది దగ్గర ఓ ఐదువేలు వసూలు చేశాడు. దీనికి పాతపట్వారి రాఘవరావు తనవంతు సహాయ సహకారాలు అందించాడు.

రాఘవరావు ఆ ఊరికి పాత పట్వారి. ఆ ఊరి వాడే. తండ్రి తాతలు పట్వారిగా పని చేశారు. తనకూడ కొంతకాలం పట్వారిగా పనిచేశాడు. రామారావుగారు ముఖ్యమంత్రిగా పట్వారి వ్యవస్థ రద్దు చేయడంతో ఈయన పట్వారిగిరి ఊడిపోయింది. కొంతకాలం వి.ఏ.ఓ.గా కూడా పనిచేశాడు.



ఎర్రగా బక్క పల్చగా ఉంటాడు. రింగులనెత్తి, కళ్లద్దాలు, నెరిసిన జుట్టుకు ఎప్పుడు రంగువేస్తుంటాడు, తెల్లటి ధోవతి, సిల్కు లాల్చీ మడతలు నలగనీయడు. రిటైరయినా ఇప్పటికి ఆ చుట్టుపక్కల భూముల లావాదేవీలన్నీ ఈయనే చుట్టే తిరుగుతాయి. భూముల కొలతలు వేస్తాడు. భూ తగాదాలకోసం జనాన్ని తన చుట్టూ తిప్పుకుంటాడు. అందుకు పాత రికార్డు కూడా కొంత తన దగ్గర పెట్టుకున్నాడు. ఊరిలోకి ఏ అధికారి వచ్చినా భోజన పానాదులు అన్నీ రాఘవరావు ఇంట్లోనే. ఊరివారంతా కరణం పంతులని పిలుస్తారు. తన తండ్రి తాతలు సంపాదించిన రెండొందల ఎకరాల భూమి సీలింగు కంటే ముందే తెలివిగా అమ్మి హైదరాబాదులో ప్లాట్లుకొన్నాడు. కొడుకు పేరు మీద తన పేరు మీద పెట్టుకున్నాడు. ఎటువంటి ఆఫీసరునైనా మాటలతో ఇట్టే బుట్టలో వేసుకుంటాడు. ఊరు ఊరంతా తన చుట్టు తిప్పుకుంటున్నాడు.

ఊరిపక్కనే పెద్దవాగు. ఆ పక్కనే పందెకరాల ప్రభుత్వ బంచరాయి భూమి. అందులో చాలా వరకు గతంలోనే చాలామందికి ఎసైన్‌మెంట్ ల్యాండ్ పంపిణీ చేశారు. మిగిలిన భూమి ఇప్పుడు మల్లీశ్వరితో కలిపి పది మందికి పంచారు. తలా రెండెకరాలు, ఇరవయ్యేకరాలు పంపిణీ చేశారు.

ఒకప్పుడు ఆ వాగు మూడువందల అరవయిరోజులు జలకల వుట్టిపడేది. ఇసుక తోలుడు విపరీతమైన బోర్లు వేయడంతో వట్టిపోయింది.

రెండు బైకులమీద సర్వేయర్, ఆర్.ఐ., కార్యదర్శి, మస్కూరు వచ్చారు. గొలుసు తీసి చకచకా కొలచిరాళ్ళు వేశారు. ఎవరి భూమి వారికి చూపించారు. హద్దులల్లో రాల్లు పాతుకొమ్మని చెప్పారు. అంతా కొలిచి రాళ్లు పాతే వరకు మధ్యాహ్నమయింది. ఎవరిభూమికి వారు హద్దుల రాళ్లు వేసుకున్నారు.

అంతా ఓ చెట్టు కిందకు చేరారు. సీసాలల్ల తెచ్చుకున్న నీళ్లు తాగారు. సెక్రటరీ అందరిని పిలిచాడు. "చూడండి సర్వేయర్ గారు పొద్దుట నుండి ఎండలో మీ భూములన్నీ కొలిచాడు. ఎంత కష్టపడ్డాడో మీరే చూశారు. ఏదో మీకు తోసినంత తలా ఓ రెండొందలియ్యండి" హుకుం జారీ చేశాడు.

"సార్ పొద్దున్నే తలా ఐదొందలిచ్చినం గదా" తువ్వాలుతో ముఖం తూడ్చుకుంటూ దాసు అన్నాడు. మల్లీశ్వరి పక్కనే నిలబడింది. "చూడండి పొద్దుట మీరిచ్చిన పైసలు అన్నీ ఆఫీసోల్లకు పై వాల్లకు పోతాయి. మాకు చిల్లి గవ్వ కూడా రాదు. మాకే మొస్తది. మేం పడ్డకష్టం చూసిండ్రు కదా. రేపేదయినా చిక్కొచ్చినా మల్లీ మేమే వచ్చి సరిజెయ్యాలి". సెక్రటరీ నిష్టూరంగా మాట్లాడారు. ఇంతలో కరణం పంతులు రాఘవరావు రానే వచ్చాడు. అందరికి సర్దిచెప్పి తలా వందరూపాయిలు యిప్పించాడు. ఓ వెయ్యి రూపాయిలు సర్వేయర్ చేతులో పడ్డాయి.

మధ్యాహ్నం అంతా రాఘవరావు ఇంట్లో భోం చేసి వెళ్ళారు.

దాసుది పూరిల్లు. చుట్టు కంప పాతి తడికె పెట్టుకున్నాడు. ఎప్పుడో కట్టుకున్న ఇల్లు అది. కప్పు పోయినప్పుడల్లా కమ్మలు తెచ్చి కప్పుకుంటున్నాడు. భార్య మల్లీశ్వరి, కొడుకు చంద్రం ఆరవ తరగతి బిడ్డ నీరజ నాల్గవ తరగతి. ఆ ఊరి బడిలోనే చదువు. తల్లి చంద్రమ్మ ఫ్లోరిన్ నీళ్ళు తాగి నడుం వంగిపోయింది. కర్ర లేందే నడువలేదు. చాలాకాలం రాఘవరావుగారింట్లో వూడ్చి చల్లి వచ్చేది. ఈ మధ్యనే మానేసింది. దాసు, మల్లీశ్వరి కూలివనితోనే కడుపు నింపుకుంటున్నారు.

తాము రైతులమయ్యాం. కూలి బతుకు పోయి హాయిగా వ్యవసాయం చేసుకుని బతుకవచ్చు. నలుగురికి పెట్టవచ్చు, నలుగురిలో తలెత్తుకొని తిరగవచ్చు. తన పిల్లలు ప్రైవేటు బడిలో చదివించుకోవచ్చు, తన స్లాబ్‌వేసుకుని పక్కా ఇల్లు కట్టుకోవచ్చు. ఓ బైక్ కొనుక్కొని తను మల్లీశ్వరి టింగురంగా అంటూ తిరిగి రావచ్చు. తన ఇంటినిండా వడ్లు, కూలీలు పని మనుషులు మంచి బట్టలు, భార్యాబిడ్డలకు వంటి నిండా బంగారు నగలు ఆ రాత్రి భార్యభర్తలు కలల్లో తేలిపోయారు. ఇంట్లో పండగ చేసుకున్నారు.

తనకు యిచ్చిన భూమినిండా రాళ్ళు రప్పలు, సర్కారు తుమ్మచెట్లు, ఎగుడు దిగుడు. కాలు తీసి కాలుపెట్టలేనంత కంపచెట్లు. మల్లీశ్వరి, దాసు, ఇద్దరు పిల్లలు ఓ వారం పది రోజులు కష్టపడి చెట్లన్ని కొట్టి మొదలు తీసివేశారు. రాళ్ళన్నీ ఏరి కుప్పలు పోశారు. పిల్లలు ఓ పది రోజులు బడికి ఎగనామం పెట్టారు. నడుము వంగిన ముసలమ్మ చంద్రమ్మగూడా కట్టె పొడుసుకుంటూ రాళ్ళు ఏరిపోసింది. భూమిని చదును చేసుకున్నారు. ఎంత కష్టపడ్డా వాల్ల ముఖాలు సంతోషంతో వెలిగిపోతున్నాయి. భూమి తమ స్వంతమయిందని.

సర్కారు వారి బోరింగు బండి వచ్చింది. భూమి పంచిన పది మంది రైతులు భూములలో బోర్లు వేశారు. ఒక్క మల్లీశ్వరి భూమిలోనే బోరు బాగా పడింది. ఫుల్‌గా నీళ్లు వచ్చాయి. అన్ని నీళ్ళు ఆ ఊరిలో ఎవరి బోర్లలో రాలేదంటారు జనం. ఓ నలుగురికి మామూలు నీళ్లు వచ్చాయి. ఇంకో నలుగురికి అసలు నీళ్లు రాలేదు. బండవచ్చింది.

దాసు, మల్లీశ్వరి ఆనందానికి హద్దుల్లేవు. చుట్టపక్కల వాళ్లు దాసు అదృష్టవంతుడని తెగపొగిడారు. బోరు వేసినంత సేపు రాఘవరావు పంతులు అక్కడే వున్నాడు. ఈ నీళ్ళను చూసేసరికి రాఘవరావు కండ్లు తిరిగిపోయాయి. రాఘవరావు నాలుగు బోర్లు కలిపినా ఇన్ని నీళ్ళు లేవు.

పాస్‌బుక్ బ్యాంకులో పెట్టి ఓ ఇరవయివేల రూపాయిలు అప్పుగా తెచ్చాడు దాసు. బోరుకు మోటారు కొనుక్కొచ్చాడు. ఐదువేలు కరెంటు డి.డి. కట్టాడు. కొత్తగా బోర్లు వేసిన వాల్లంతా డి.డి.లు కట్టారు. ఓ అయిదు వేలు కరెంటు వాల్లకు మామూల్లకింద ముట్ట చెప్పారు. ఓ వారం రోజుల్లో కొత్త ట్రాన్స్‌ఫారం వచ్చింది. దాసు మోటారు బిగించాడు. కొబ్బరికాయ కొట్టి ఆన్ చేశాడు. ఫుల్ నీళ్లు వచ్చాయి. ఆ నీళ్ళతో ఇంటిల్లిపాది స్నానాలు చేశారు. పిల్లల కేరింతలే కేరింతలు.

ట్రాక్టరు కిరాయికి పెట్టి దున్నించిండు. పొలమంతా నీళ్ళు పెట్టాడు. చదును చేయించాడు. వరాలన్నీ భార్యాభర్తలు సరిచేసుకున్నారు. మల్ల నిండా నీళ్ళు పెట్టారు. పొలమంతా నున్నగా తయారు చేశాడు. ఎటుచూసినా నీళ్ళే నీళ్ళు.

విత్తనాలు కొనుక్కొచ్చి నారుపోశారు. భార్యాభర్తలు చీకటితో లేచింది మొదలు సాయంత్రం వరకు వద్దూవరం పెట్టుకుని పొలమంతా నున్నగా చేసి పెట్టుకున్నారు. చేతిలో వున్న కొద్దో గొప్పో కూలి డబ్బులు అయిపోయాయి. ట్రాక్టరు కిరాయి ఇవ్వాలి. పెట్టుబడికి చేతిలో చిల్లగవ్వలేదు. పైసల కోసం కాలు కాలిన పిల్లిలా తిరుగుతున్నారు దాసు, మల్లీశ్వరి.



వీరి అవసరం రాఘవరావు పంతులు కనిపెట్టాడు. దాసు పొలం పక్కనే రావు గారి తోట పొలం. తన పొలానికి పోయే దారి కూడా అదే. దాసు పొలం గట్టు రావు పొలం గట్టు కలిసే వున్నాయి. ఉదయం సాయంత్రం కాసేపాగి దాసు బోరు పోసే నీళ్ళు చూస్తూనే వున్నాడు. వాల్లతో ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూనే వున్నాడు.

రాఘవరావుకు ఎప్పుడు నీళ్ళ కరువే. ఓ పది బోర్లంటే వేశాడు. అందులో ఓ నాలుగు బోర్లు ఓ మోస్తరు నీళ్ళు వస్తున్నాయి. ఓ రెండు బోర్లు తోటకు రెండు బోర్లు నీళ్ళు పారుతున్నాయి. ఎండాకాలం వచ్చిందంటే తోటకు ఓ రెండు కిలోమీటర్ల దూరంలో నీళ్ళు కొన్ని పారిస్తూ వుంటారు. ఇప్పుడు ఆయన కళ్ళన్నీ దాసు బోరు నీళ్ళమీదే.

దాసు బోరు పక్కన రాయి మీద కూర్చుని మల్లీశ్వరి తెచ్చిన అన్నంతిని చెయ్యి కడుక్కుంటున్నాడు.ఇంతలో రయిన రాఘవరావు మోటారు సైకిలు వచ్చి ఆగింది. బైక్ ఆపి దిగాడు.

"ఏమోయి దాసూ నీపనే బాగుంది. పది రోజుల్లో పొలమంతా దున్ని పెట్టావు. నీ నారు ఏతకు వచ్చింది. ఏమమ్మా మల్లమ్మా నారు ఎప్పుడు పీకుతున్నారు. ఈ యేడు ఊరికంటే ముందు నీదే నాటు పడేట్టుంది. అదృష్టవంతులు. "నా పొలమయితే ఇంత వరకు సగం కూడ తడువలేదు. నారు ముదిరిపోతుంది. బోర్లు ఆగి ఆగి పోస్తున్నాయి. ఏం జెయ్యాలో తోస్తలేదు" లాల్చి జేబులో నుండి సిగిరెట్ తీసి వెలిగించాడు రాఘవరావు.

ఇది వరకయితే మొగోల్లను ఒరేయి అని, ఆడవారిని ఒసేయి అని పిలిచేవాడు. ఏందిరా, రావె, పోవె అనేవాడు. ఈ మధ్య నాలుగయిదుసార్లు యువకులు ఎదురు తిరిగారు. వార్నింగు కూడా యిచ్చారు. అప్పటి నుండి తన ధోరణి మార్చుకున్నాడు. లోపల ఎంత కుళ్ళువున్న బయటకు మాత్రం మర్యాదగా మాట్లాడుతున్నాడు.

"ఏముంది పంతులు గారూ! పొలమయితే తడిసింది. నారయితే పెరిగింది. వద్దూవరం తీసి పెట్టుకున్నాం. చేతిల చిల్లిగవ్వ లేదు. ట్రాక్టరు కిరాయి పదివేలయింది. ఇప్పుడు అడుగుపిండిగావాలె. కలుపు గూళ్ళుగావాలె" టిఫిన్ గిన్నె మల్లీశ్వరికిస్తూ అన్నాడు తువ్వాలుతో మూతి తుడ్చుకున్నాడు.

"ఏం జెయ్యాలో తెలుస్తలేదయ్యా. చేతులున్న కూలి పైసలు అయిపోయినవి. పిల్లకు కాల్ల పట్టీలు చేయిద్దామని దాసుకున్న పైసలు కూడా విత్తనాల వద్లకిచ్చిన. అక్కడ ఇక్కడ ఓ అయిదారు వెయిలు బదులు తెచ్చినం. ఇంక యాడ అప్పు పుట్టెటట్టు లేదు. మీరయినా ఈ భూమిని గిర్విల పెట్టుకొని పెట్టుబడికి పైసలప్పిచ్చురి" మల్లీశ్వరి అన్నది. దేనికోసమయితే ఎదురు చూశాడో రావు అదే జరిగింది. తనకు కావలసింది కూడా అదే. "దానికింత పరేషానెందుకు మల్లమ్మ పక్క పక్క పొలాల వాల్లం. ఆ మాత్రం సాయం చేయకుంటె ఎట్ల. ఎంతగావాల్నో అంత తీసుకోండ్రి. పంట పండినంక ఇచ్చేయండ్రి". రాఘవరావు చేతిలోని సిగిరెట్ పడేసి కాలి చెప్పుతో నలిపివేశాడు.

భార్యాభర్తలిద్దరు ఆశ్చర్యంగా రాఘవరావు వైపు చూశారు. అనుకోని వరమిచ్చిన దేవుడనుకున్నారు. ఇద్దరు చేతులెత్తి దండం పెట్టారు. తమ సమస్య ఇంత త్వరగా తీరినందుకు సంతోషపడ్డారు. ఇక అప్పుకు డోకా లేదనుకున్నారు. మీకు ఎప్పుడు అవసరం పడ్డా ఎన్ని డబ్బులు అవసరం పడ్డా ఇంటికి రాండ్రి. మొఖ మాఖ పడొద్దు. సైకిలు స్టార్ట్ చేసి తనతోట వైపు వెళ్ళాడు.

తమ సమస్య ఇంత త్వరగా పరిష్కారమయినందుకు, ఊపిరి పీల్చుకున్నారు దాసు దంపతులు. రాఘవరావు తమ పాలిట దేవుడేనని అతని మంచి తనాన్ని పొగుడుతూ ఇల్లు చేరారు దాసు, మల్లీశ్వరి.

రాఘవరావు దగ్గర భూమి తాకట్టు పెట్టి ఓ ఇరవయివేల అప్పు తెచ్చాడు దాసు. ట్రాక్టరు కిరాయిలు పదివేలు యిచ్చాడు. పొలం చదును చేసి అడుగు పిండి వేసి నాటు వేయించాడు. రోజు చీకటిలో దాసు పొలానికి వస్తే, ఇంట్లో పని చేసుకుని పిల్లలను బడికి పంపి, అత్తకింత అన్నం పెట్టి దాసుకింత టిఫిన్ బాక్సులో పెట్టుకొని పొలానికి వస్తుంది మల్లీశ్వరి. సాయంత్రం వరకు పొలం పనులు చేసుకొని చీకటిపడ్డాక ఇల్లు చేరుతున్నారు.

పై పాటుగా యూరియా రెండుసార్లు చల్లాడు. గుళికలు చల్లాడు. పురుగుమందు స్ప్రేచేశాడు. వరిబాగా పట్టింది. పొలంలో కలుపు ఇద్దరే తీసుకున్నారు. మల్లీశ్వరి బయట కూలీ పనులు పూర్తిగా బంద చేసింది. అరుగు వేసినట్లు పచ్చగా చూడ ముచ్చటగా వుంది. పొలంలో దిష్టి బొమ్మలు పాతాడు దాసు. అందరి దాసు పొలం పైనే. పొలం చూసుకొని ఆలుమగల ఆనందమే ఆనందము. కలల్లో మునిగి తేలుతున్నారు.

వర్షాలు బాగుపడి నీళ్ళుండటం వల్ల ఎండిపోయిన బోర్లన్ని జలకలనందుకున్నాయి. అందరు మోటార్లు బిగించి పొలాలు సాగు చేశారు. పడావుపడ్డ పాత బావులన్ని మోటార్లన్నీ నడిపించి నాట్లు వేశారు. ఊరి చుట్టూ ఎటు చూసినా పచ్చటి పంట పొలాలే.

ట్రాన్స్‌ఫారం మీద ఓవర్‌లోడ్ అయింది. అరగంట అరగంటకు ఫీజు పోవుడు, ట్రాన్స్‌ఫారం ట్రిప్పుకావడం మొదలయింది. ఎండలు ముదిరాయి. పొలాలు పొట్టకొచ్చాయి. నీళ్ళు బాగా తాగుతున్నాయి. సర్కారిచ్చే రెండు సార్ల కరెంటు అప్పుడప్పుడు ట్రాన్స్‌ఫారం ఫీజు కొట్టేయడంతో రైతుల కరెంటు కష్టాలు మొదలయ్యాయి.

రైతులంతా కలసి కరెంటోల్లను నిలదీశారు

"ఎక్కడ పడితె అక్కడ బోర్లేసి ఎవరు పడితే వాల్లు కరెంటు తీగలకు వైర్లు తగిలించి మోటార్లు నడుపుకుంటుంటే మేమేం చేయం. కరెంటు సాంక్షన్ వున్న వాల్లు పదిమందయితే లేనివాల్లు పదిహేనుమంది. ఇష్టమొచ్చినట్లు కరెంటు వాడుకుంటున్నారు. లేని బరువెత్తితే అది మాత్రం ఏం మోస్తుంది. ట్రాన్స్‌ఫారం ఓవర్‌లోడయింది. ట్రిప్ అవుతుంది. మీరు మీరు చూసుకోండ్రి" తమ తప్పేంలేదన్నట్లు కరెంటువాళ్లు మాట్లాడి తప్పుకున్నారు.

నాల్రోజులకు ఓ శుభ ముహూర్తాన పెద్ద శబ్దం చేస్తూ మంటలతో ట్రాన్స్‌ఫారం పేలిపోయింది. పొలాలల్లో తిరుగుతున్న రైతులంతా ఉరుకులు పరుగుల మీద ట్రాన్స్‌ఫారం దగ్గరకు వచ్చారు. ఇంకా పొగలు వదులుతూనే వుంది. ట్రాన్స్‌ఫారం బందుచేసి ఫ్యూజులు వేసి మళ్ళీ ఆన్ చేశారు. ట్రాన్స్‌ఫారం చడీ చప్పుడు లేదు.

నాలుగయిదు సార్లు ఫోన్ చేస్తే సాయంత్రానికి లైన్‌మెన్ వచ్చి చెక్‌చేసి ట్రాన్స్‌ఫారం కాలిపోయిందని చావు కబురు చల్లగా చెప్పాడు. ట్రాన్స్‌ఫారం విప్పుకొని నల్లగొండ డివిజన్ ఆఫీసుకు తీసుకపోవాలని చెప్పాడు.



రైతుల గుండెల్లో రాయిపడ్డట్టయింది. ఇప్పటికి వచ్చి పోయే కరెంటుతో సగం పొలాలు ఆరిపోయాయి. పొలాలల్లో చుక్కనీరు లేదు. బిర్రుపొట్ట మీద పొలాలు, రైతులలో కలకలం. ఆందోళన అప్పటికి చీకటిపడింది. దిగాలుగా ఎవరింటికి వారు వెళ్లిపోయారు.

తెల్లవారి పదిగంటలకు లైన్‌మెన్, హెల్పర్ వచ్చారు. రైతులంతా ఓ ట్రాక్టరు కిరాయికి మాట్లాడి తెచ్చి కూర్చున్నారు. తలా ఓ చెయ్యి ట్రాన్స్‌ఫారం విప్పి ట్రాక్టరు మీద వేసుకుని నల్లగొండ డివిజను ఆఫీసుకు తీసుకెళ్ళారు. వీళ్ళు పోయే సరికి అక్కడ ఓ ఇరవయి ట్రాన్స్‌ఫారాలు సీరియల్‌గా పడి వున్నాయి. రైతులంతా శవ జాగరణ చేస్తున్నట్లు చెట్ల కింద గుంపులు, గుంపులుగా కూర్చున్నారు. ఏ ఊరి వారిని మందలించినా కరెంటు కష్టాలే, కన్నీల్ల కథలే.

రోజులు గడిస్తే పొలాలెండిపోతాయి. పొట్ట గవుసు పోయి తాలు పోతుంది. అప్పుల వడ్డీలకు కూడా సరిపోవు. రైతులంతా తలా ఐదొందలు వేసుకొని ఓ ఐదువేలు వసూలు చేసి కరెంటు వాల్లకు మామూల్లు ముట్ట చెప్పారు. వాల్ల తొందర వాల్లది.

మరో రెండు రోజులకు గాని ట్రాన్స్‌ఫారం వూరిలోకి రాలేదు. చీకటి పడ్డా రైతులంతా ట్రాన్స్‌ఫారం బిగించారు. ఈ రాత్రన్నా మోటార్లు నడిస్తే కొంతలో కొంతయినా తడుస్తుందని వాళ్ళ ఆశ.

దాసు ఉరుకుల పరుగుల మీద వెళ్ళి తన మోటారు స్విచ్ ఆన్ చేశాడు. చప్పుడు లేదు. పక్కవాళ్ళ మోటార్లు నీళ్ళు పోస్తున్న చప్పుడు. స్టాటర్ ఎర్ర బటన్ పచ్చ బటన్ మార్చి మార్చి ఓ పదిసార్లు వత్తాడు. అయినా చప్పుడు లేదు. ఫ్యూజ్ పీకి సరిచూసి ఫీజు బిగించి ఆన్ చేశాడు. అయినా లాభం లేదు. దాసు మోటారు నడువలేదు. ఐదు రోజులయింది. పొలమంతా నెర్రె బాసింది. భయం భయంగా సైకిలందుకొని మెకానిక్ దస్తగిరింటికి వెళ్ళాడు. ఆయన పొద్దుననగా నల్లగొండకు పోయి ఇంకా రాలేదని ఆయన భార్య చెప్పింది. "గురుడు మందేసుకుని ఏ రాత్రికి వస్తాడో" దాసు ఆలోచనలో పడ్డాడు. దిగులుగా ఇల్లు చేరి విషయం భార్యకు చెప్పాడు. ఆ రాత్రి ఆ ఇంట్లో ఎవరు సరిగా నిద్రపోలేదు.

చీకటితోనే లేచి దస్తగిరి ఇంటికి చేరాడు దాసు. తెల్లవారితే ఆయన ఎటుపోతాడో ఎవ్వరికి తెలవదు. ఆ ఊళ్ళో వున్నది మెకానిక్ ఆయనొక్కడే. అప్పటికే ఇద్దరు ముగ్గరు రైతులు ఆ ఇంటి ముందు కూర్చున్నారు. దస్తగిరి లేచి ముఖం కడుక్కుని పానాల సంచి తీసుకుని బయటకొచ్చాడు. దాసు రాత్రి వచ్చిన విషయం దస్తగిరికి భార్య చెప్పింది. దస్తగిరి, దాసు చెరో సైకిలందుకుని బోరు దగ్గరికి చేరారు. మిగతా రైతులకు వస్తానని చెప్పి పంపించాడు దస్తగిరి.

దస్తగిరి స్టాటర్, మోటార్ చెక్ చేశాడు. మార్చి మార్చి చూశాడు. వైర్లు కట్ అయినవేమో అని కేబుల్ వైరు చూశాడు. స్టాటర్, మోటార్ కాలిపోయిందని చెప్పాడు. ఇంకో ఇద్దరి ముగ్గరి మోటార్లు కాలిపోయినట్లు చెప్పాడు. ట్రాన్స్‌ఫారంతో పాటే మోటార్లు కాలాయని దస్తగిరి వారికి చెప్పాడు.

అసలు సంగతేమిటంటే హెచ్.టి.లైను తెగి ఎల్.టి. లైను మీదపడి ట్రాన్స్‌ఫారం, మోటార్లు కాలిపోయాయని లైన్‌మెన్ సెలవిచ్చాడు.

కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరాడు దాసు. పండ్ల పుల్ల నములుతూ నులకమంచం మీద కూర్చున్నాడు. ముసలమ్మ చంద్రమ్మ చాటలో బియ్యంలో రాళ్ళు ఏరుతూ కూర్చుంది. మల్లీశ్వరి చాయ్ చేసుకుంటూ పొయ్యి ముందు కూర్చుంది. పొగతో కండ్లు ఎర్రబడ్డాయి. వెంట్రుకలు ముఖం మీదికి వచ్చాయి.

"ఏమయ్యా మోటారు నడిసిందా."

"ఇంకెక్కడి మోటారే. మోటార్లు, స్టాటర్లు కాలిపోయాయని దస్తగిరి చెప్పిండు."

"అయ్యో రామా, పొలమెండిపోదా, ఇప్పుడెట్లా, ఆదుర్దాగా అడిగింది" మల్లీశ్వరి.

"ఏం జెయ్యాలో దోస్తలేదు. చేతిల పైస లేదు. బయట యాడ పుట్టేటట్టు లేదు. పంతులు రాఘవరావు కొడుకు దగ్గరికి పట్నం పోయిండు. పదిరోజులదాకా రాడట. ఏం జెయ్యాలనో దోస్తలేదు" భార్యతో అన్నాడు.

"చేసేటందుకేముంది. ఆడ ఈడ చేసిన అప్పులు మస్తుగయినవి. ఇప్పుడెవ్వరు ఇయ్యరు. ఈ దిద్దులు తీసుకుని అమ్మి మోటరు బాగు చేయించుకురా గబ గబ తన చెవుల దిద్దులు తీసి దాసు చేతిలో ఎట్టింది మల్లీశ్వరి.

ఓ నిమిషం మల్లీశ్వరి వైపు అలానే చూస్తూ ఇష్టం లేకున్నా దిద్దులు తీసుకోక తప్పలేదు దాసుకు.

ఒకరికొకరు తోడుగా రైతులంతా కాలిపోయిన మోటర్లు బోర్ల నుండి బయటకు తీశాడు. ఓ ఆటో మాట్లాడుకుని మెకానిక్ దస్తగిరిని తీసుకుని నల్లగొండ చేరారు. దాసు దిద్దులు అమ్మి మోటారు, స్టాటరు బాగు చేయించుకుని సాయంత్రం వరకు ఇల్లు చేరాడు.

పొద్దున్నే ఒక్కొక్కళ్ళు మోటర్లను బోర్లల్ల దించారు. దాసు మోటరు ఐదు పైపులు దిగి మొరాయించింది. ఇంకో ఐదు పైపులు మోటరు కిందికి దిగాలి. దస్తగిరి మోటరును కిందికి మీదికి నాలుగయిందు సార్లు గుద్దినా కిందికి దిగలేదు. దిగాలుగా చూస్తూ కూర్చున్నడు దాసు.

"ఇదిగో దాసు బోర్లో రాయి ఇరికింది. మోటరు కిందికి పోదు. నల్లగొండకు పోయ బోరు సాపు చేసేటోల్ల తీసుకురా లేకుంటే ఇక నీ బోరు ఇంతే." సైకిలెక్కి రయిన వెళ్ళిపోయాడు దాసు. మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టయింది దాసు పరిస్థితి.

దాసు వెంటనే నల్లగొండకు పోయి బోర్లు సాపు చేసే వాళ్ళను తీసుకొచ్చి బోర్లో ఇరికిన రాయిని తొలిగింపు చేశాడు. సాయంత్రం వరకు మోటరు దింపి నీరు బయట పోయించాడు దాసు.

ఆ రోజు రెండు గంటలు మోటరు నడిచిందో లేదో మళ్ళీ లైను బ్రేక్‌డౌన్. ఆ రోజంతా కరెంట్ రాలేదు. దాసు పొలమంతా నెర్రెబట్టింది. ఎన్ని నీళ్ళు పోసినా మొదటి మడి దాటడం లేదు. పొలమంతా

ఎండిపోయి ఆ కారు సగం పంట కూడా రాలేదు. పండిన పంట ఖర్చులకే సరిపోలేదు.

నాలుగేండ్లు గడిచే సరికి అప్పులు ఇబ్బడి ముబ్బడి అయ్యాయి. కరణం పంతులు రాఘవరావు అప్పు వడ్డీతో డెబ్బయి వేలయింది. భూ తనఖా బ్యాంకులో మోటరు కోసం తెచ్చిన అప్పు వడ్డీ ముప్పయి వేలయింది. చిల్లరగా ఇంకో పదివేల అప్పులయ్యాయి. భార్య మీద నగలు, దిద్దులు, కాళ్ళ పట్టీలు, తల్లి గంటీలు అన్నీ అమ్మి పెట్టాడు. మొత్తం మీద అప్పు లక్ష దాటింది.

ఈ నాలుగేండ్లలో ఎప్పుడూ సరిగా పంట చేతికి రాలేదు. ఓసారి దోమపోటు, ఇంకోసారి అగ్గి తెగులు, ఓసారి కరెంట్ లేక పోండిపోవుడు. కష్టపడి పండించినా గిట్టుబాటు ధర రాక అయిన కాడికి దళారికి అమ్ముకోవడం. అతివృష్టి, అనావృష్టి, రాళ్ళ వానలు నిలువునా దాసును ముంచేశాయి.

ఈ నాలుగేండ్లలో ఒక్క పదివేల రూపాయలు రాఘవరావుకు వడ్డీ బాపతు యిచ్చాడు. అప్పుల వాళ్ళు తిరిగి పోతూనే వున్నారు. ఇదిగో అదిగో అని వాళ్ళకు ఏదో చెప్పి పంపిస్తూనే ఉన్నాడు. ఈ అప్పుల ఊబి నుండి ఎలా బయట పడాలో వాళ్ళ కర్థం కావడం లేదు.



రాను రాను రాఘవరావు బోర్లలో నీళ్ళు పూర్తిగా తగ్గిపోయాయి. తోటవాడుకొచ్చింది. పొలానికి తోటకు నీళ్ళు ఏమాత్రం సరిపోవడం లేదు. దాసు బోరు మాత్రం వేసిన్నాడు ఎన్ని నీళ్ళు పోసిండో అన్ని నీళ్ళు ఏమాత్రం తగ్గలేదు. "దాసు అప్పులలో నిలువునా మునిగి వున్నాడు. తన తోటకు నీళ్ళు అవసరం. ఇదే అదును" అనుకున్నాడు రావు.

అనుకున్నదే తడవుగా ఓ రోజు పొద్దునే తన అనుచరులు ఊరి పెద్దలనబడే నలుగురిని తీసుకుని దాసు ఇంటికి చేరాడు రాఘవరావు.

దాసు ముఖం కడుక్కుంటున్నాడు. మల్లీశ్వరి పొయ్యి మీద ఎసరు పెట్టింది. పిల్లలు బడికి తయారవుతున్నారు. ముసలమ్మ ఇల్లు వూడ్చుతుంది. కట్టెలు మండక ఇల్లంతా పొగ కమ్ముకుంది.

"ఏమోయి దాసు ఏం చేస్తున్నావు" బయటి నుండి రావు పిలుపు.

లేకుంటే వీళ్ళు మంచాల మీద నుండి లేవరు. అందుకే రాఘవరావు ఎవరింటికి పోయినా బయట నుండే పిలుస్తాడు.

"పంతులుగారా రాండ్రి రాండ్రి" లోపల నుండి రెండు ప్లాస్టిక్ కుర్చీలు తెచ్చి వేశాడు. పొయ్యి ముందు నుండి మల్లీశ్వరి లేచి వచ్చింది. కుర్చీలో రాఘవరావు పెద్ద మనుషులు మంచం మీద కూర్చున్నారు.

"దాసూ ఈయ్యేడు నీ పొలం బాగుందోయ్" పలకరించాడు రావు. ఏముంది పంతులుగారు. ఎంత చేసినా ఓ కారు కాకుంటే ఓ కారు దెబ్బగొడతనే వుంది. ఏటేటా అప్పులెక్కువయితున్నయ్. బ్యాంకు అప్పు, మీ దగ్గర అప్పు అట్టనే వుంది" చేతులు నలుపుతూ అన్నాడు దాసు.

"ఏముందయ్యా కూలి చేసుకున్నాడే బాగున్నం. ఈ మాయదారి యవసాయం బెట్టుకున్నం అప్పులతో వురిబెట్టుకునే రోజొచ్చింది. కూలి చేసుకున్ననాడు కలో గంజో దాగినం. వున్ననాడు దిన్నం. లేనినాడు వుపాసం పన్నెం. ఏం దోస్తలేదు. ఏంజేయల్నో దోస్తలేదు." మల్లీశ్వరి కండ్లు ఎర్రబడ్డాయి. కండ్లల్లో నీళ్ళు ఏ క్షణాయినా బయటకొచ్చేటట్టున్నాయి. కొంగుతో కండ్లు తుడుచుకుంది.

"ఏం జేస్తం మల్లమ్మా, యవసమే గిట్టున్నది. పదరకల యవసం జేసిన నా పరిస్థితి గట్టనే వున్నది. ఏం జేద్దాం. కాలమే గట్టొచ్చింది" రావు అన్నాడు.

"ఇదిగో చూడు దాసూ, మల్లమ్మా నా కొడుకు బిడ్డ పెండ్లి కుదిరిందనే నిన్ననే ఫోను జేసిండు. వరపూజ వుంది పైసలు పంపమన్నడు. మీరెట్టనన్న జేసి ఓ వారం రోజులల్ల నా పైసలు నాకియ్యాలె" రాఘవరావు మాటలు వినేసరికి దాసుకు, మల్లీశ్వరికి నోట మాట రాలేదు. కండ్లు గిర్రున తిరిగినట్లయింది. తమాయించుకుని కింద కూర్చున్నాడు దాసు.

"ఇప్పటికిప్పుడు అంటె ఎట్ల అయ్యగారూ" అన్నాడు దాసు.

"నువ్వు ఏం జేస్తవో నాకు తెల్వదు. నాలుగేండ్లు ఆగిన. నాకవతల పిల్ల పెండ్లి నాకు మాత్రం పైసలు గావాలా" ఎన్నడు లేనిది రాఘవరావు నోటి వెంట కాస్త కోపంగానే వచ్చాయి మాటలు.

"చూడు దాసు నీ అక్కరకు పంతులుగారు అడిగినప్పుడల్లా పైసలు యిచ్చిండు. నాలుగేండ్లాగిండు. ఇప్పుడు మనుమరాలు పెండ్లి. ఎట్లన్నచేసి మాట నిలబెట్టుకోవాలి" వచ్చిన పెద్ద మనుషులు రావుకు వత్తాసు పలికారు.

దాసు, మల్లీశ్వరి గుడిసెలోకి వెళ్ళి మాట్లాడుకొని బయటకు వచ్చారు.

"పంతులుగారు ఇప్పుడు మా దగ్గర చిల్లి గవ్వలేదు. నగా నట్రా అమ్మి ఈ యవసాయానికే పెట్టినం. అప్పులల్ల మునిగినం. మీరే ఆ రెండెకరాల పొలం దీసుకొని ఏదో ఓ ధర చేసుకోండ్రి. బ్యాంకు అప్పుంది. బయట అప్పులున్నయి" దాసు, మల్లీశ్వరి ఒకేసారి అన్నారు.

తన కల నెరవేరింది. తనకు కావలసింది గూడా అదే. అదే మాట వారి నోట వచ్చింది. మనస్సులో తెగ సంతోషపడిపోయాడు రావు. దాసు బోరు తనదవుతుంది. తన నీటి కరువు తీరబోతుంది.

"నాకెందుకమ్మా భూమి, నా భూమి చేసే దిక్కేలేదు. అయినా మీది అసైన్‌మెంట్ భూమి. సర్కారు భూమి. వేరే వాళ్ళకు పట్టాగాదు. నేనేం జేసుకోను" బెట్టుగా మాట్లాడాడు రాఘవరావు.

ఆ భూమిని ఎలా పట్టా చేయించుకోవాలో రావుకు బాగా తెలుసు. ఈ మాటలు విన్న దాసు మల్లీశ్వరి గుండెల్లో రాయిపడ్డట్లయింది. వారి నోట మాట రాక అలా చూస్తూ వుండిపోయారు. పది నిమిషాలు అలానే ఎవరు మాట్లాడకుండా వుండిపోయారు. దిక్కులు చూస్తూ నిలబడ్డారు దాసు, మల్లీశ్వరి.

"పంతులుగారూ ఏదో విధంగా మీరే ఆ భూమిని తీసుకుని వాళ్ళను ఒడ్డున పడెయ్యండి. వాళ్ళ దగ్గర మనకు తెల్వకుండా ఏముంది. ఆ రెండెకరాల భూమి తప్ప" వచ్చిన పెద్ద మనుషులు నచ్చ చెబుతున్నట్లు మాట్లాడారు.

కాసేపు బెట్టు చేసి చివరకు లక్ష రూపాయలకు రెండెకరాల భూమి యిచ్చేటట్లు మాట్లాడుకున్నాడు. తన డెబ్బయి వేలు పోను, బ్యాంకు ముప్పయి వేలు తనే చెల్లిస్తానన్నాడు. స్టాంపు పేపరు మీద రాయించుకొని భార్యా భర్తల సంతకాలు తీసుకున్నాడు. వచ్చిన పెద్ద మనుష్యుల ముందు ఒప్పందం చేసుకొని వారితో సాక్షి సంతకాలు చేయించుకున్నాడు రావు.

భూమి అమ్ముడయిందని తెలిసి చిల్లర అప్పుల వాళ్ళు దాసు ఇంటి ముందు బైఠాయించారు. అందరితో మాట్లాడి తనుంటున్న ఇంటి జాగా పదివేలకు అమ్మి అందరి బాకీలు తీర్చాడు దాసు.

మూటా ముల్లె సర్దుకుని పిల్లలు, తన తల్లిని వెంటబెట్టుకుని ఉన్న ఊరు విడిచిపెట్టి బతుకు దెరువుకు పట్నం బాట పట్టారు దాసు, మల్లీశ్వరి.

✿



# మాదిగి గ్యాణం

## సిద్దెంకి యాదగిరి

మాదిగి గ్యాణం
దొప్పల పెట్టే
అగ్గిల కాల్చినసియ్య
పచ్చి మాంసం తున్కల్
ఎండల దండెమ్మీద ఆర్చేస్తే...
అట్టి తున్కల్ గట్టిగయితయ్

లందగోలెంల మురిగిన తోలు
సింతగింజల అంబలి పూసిన కుదురు
కదెంకు నుల్కతాళ్లు
మూడురాళ్ళ మీద దప్పును
యిసుర్రాయి గుంజితే
దప్పు సప్పుడు దాటిచ్చి కొడతది
ఊరు ఊరంతా ఏకమూతది

దుంకిపోయే దున్నపోతూ
ఎగిరిదుంకే కోడే
వాటమ్మీద గుద్దే గూటంతో
బుద్ధి తెచ్చుకొని యిద్దె నేరుస్తది
సెప్పిన పని జేస్తది

కరకర నూరిన ఆరే
తిత్తి దీసిన కత్తి
యిడిపిచ్చిన తోలుకు
సెప్పులు ముడిసే యిద్దే యిగురం అద్దితే
సెప్పు సప్పుడు కిర్రుమంటది
తొడుకున్న కాళ్ళ కాందాన పెరుగుతది

తోలు తొండం చేసిన పనితనం
నీట మునిగిన మోటబొక్కెన
పాటతో పైకెత్తిపోసిన నీళ్ళతో
పండించిన పంట
కడుపు నింపిన మాయితనం
కన్నీళ్ళు నింపుకుంటది

చీరిన నార
కరిపేనిన తాడు
దందెడ తాడు
అరచేయిల తాల్చిన నుల్క
ఒకటి సుఖానికైతే
ఇంకోటి పంట పండించే సాధనం
మాయదారి ప్రపంచ మార్కెట్ల
మాదిగి గ్యాణం
సాయి దప్పి సొట్టపోయినది
పని తట్ట సోచాయించి తెలివికొస్తే
ప్రపంచీకరణ తెలివిని
అంచులు తెగ్గొడ్తది
మాదిగి గ్యాణం
సమాజం తొడిగే చెప్పులకు
అందేం అద్దితే ముద్దుగైతది

---



# నా... మాతృభాష

## తాతోలు దుర్గాచారి

అమ్మ ఒడిలోని కమ్మదనం
తెలుగు భాషలోని తియ్యదనం
ఆర్ధత నిండిన హృదయాన్ని
అక్కున చేర్చేది తెలుగుదనం
చిరునవ్వుల తొలకరి జల్లు నా తెలుగు భాష
చిలిపి తనపు పల్లె పదుచు నా వెలుగు భాష
అమ్మ తనపు ఆత్మీయ చందనం నా తెలుగు
ఆహ్లాదాల అభిమాన ధనం నా తెలుగు
చిరకాలపు చిరంజీవి నా మాతృభాష
భావికాలపు రాణివాసం నా మధురభాష
పల్లెతనపు పట్టుగొమ్మ నా తెలుగుభాష
పట్టణాల ప్రగతి బాట నా వెలుగు బాష
పలవరించే పసి హృదయాన్ని...
పరవశింపజేసేది నా తెలుగుదనం
నిత్య వసంతపు అభ్యుదయం నా వెలుగు భాష
నిర్మల శోభిత అద్వితీయం నా తెలుగు భాష
వేష భాషలను అలరించు సొగసరి నా మధురభాష
దేశ భాషలందు అద్భుత భావలహరి నా మాతృభాష

---

# నానీలు



## డా॥ పి. శేషాద్రి

చిన్న విషయాలే
రేపటి విశేషాల
కాల గర్భం
చారిత్రక దర్పం

ప్రేమను నేర్పావా
పెన్నిధి వారికి
ద్వేషం ఎప్పటికైనా
మార్గం కాటికి

అవును అతి వినయం
ధూర్త లక్షణమే
అహంకారం?
వివేక భక్షణం

మానవత్వ బింబాలు
ఉండాలి గాని
మానవ బాంబులేమిటి
నాయనా!

# విద్య - లక్ష్యాలూ విలువలు



**విద్య అనేది పాఠశాలకు సంబంధించిన విషయం మాత్రం కాదు. కానీ ఇది కీలకాలను మాత్రమే ఇస్తుంది. జీవిత మంతా పాఠశాలేతర విద్యే. విద్యా లక్ష్యం అక్షరాస్యతలోనే లేదు, ఏదో ఒక వృత్తిని నేర్పడం లోనే లేదు. మనిషి మానవత్వం కోసం పోరాడే వాడుగా తీర్చి దిద్దడమే విద్యాలక్ష్యంగా వుండాలి. తమ తల్లిదండ్రులు భుజాలపై నుండి పెంచబడిన పిల్లలు, తమ తండ్రుల కన్నా ఉన్నతమైన సాంస్కృతిక స్థాయిలో ఉండటమే ఆ లక్ష్యం.**

## కె. ఆనందాచారి

"ఎక్కడ మనసు నిర్భయంగా వుంటుందో, ఎక్కడ మనుషులు తలెత్తి తిరుగుతారో,ఎక్కడ జ్ఞానం విరివిరిగా వెలుస్తుందో, సంసారపు గోడల మధ్య ఎక్కడ భాగాల కింద ప్రపంచం విడిపోలేదో, ఎక్కడ నత్యాంతరాళంలోంచి పలుకులు బైలు వెడలతాయో, ఎక్కడ అలసట నెరగని శ్రమ తన బాహువుల్ని పరిపూర్ణత వైపు జాస్తుందో, ఎక్కడ నిర్జీవమైన ఆచారపు టెడారిలో స్వచ్ఛమైన బుద్ధి ప్రవాహం ఇంకిపోకుండా వుంటుందో, ఎక్కడ మనసు నిరంతరం వికసించే భావాలలోకి, కార్యాలలోకి నీచే నడపబడుతుందో, ఆ స్వేచ్ఛా స్వర్గానికి, తండ్రీ, నా దేశాన్ని మేల్కొలుపు" అంటాడు. ఠాగూర్.

విద్యారంగంలో విలువలు ఆ విద్యా తాత్వికతపై, లక్ష్యాలపై ఆధారపడి వుంటాయి. విద్యను గురించి, విలువలు ప్రమాణాల గురించి తెలుసుకోవాలన్నా, చర్చించాలన్నా విద్య గురించి తెలుసుకోవాలి. విద్య అంటే ఏమిటి దేనిని విద్య అంటారనే విషయాలు ప్లేటో, అరిస్టాటిల్ నుండి, మన గాంధీ, రవీంద్రుడు జిడ్డు కృష్ణమూర్తి వరకు నిర్వచించి వివరించాడు. ఎలా వుండాలో కూడా సూచించారు. కానీ మన దేశ ప్రగతికి, సమగ్ర అభివృద్ధికి, ఉన్నత విజ్ఞాన సాంస్కృతిక సంపన్నతకు అవసరమైన విద్యను అందించడంలో విఫలమయ్యాము. ఈ విఫలతల వెనకాల గల వివిధ బృందాల ప్రయోజనాలు ఇమిడి వున్నాయనేది ఒక చర్చకు సంబంధించిన విషయం.

ప్రాథమికంగా రెండు ప్రశ్నలు మనం వేసుకుంటే విద్య మౌలిక తాత్వికత మనకర్థమౌతుంది. ప్రముఖ విద్యాతాత్వికుడు లునాచార్స్కీ ఇలా ప్రశ్నిస్తాడు. "బిడ్డను ఎవరు తీర్చాలి, కుటుంబమా లేక సమాజమా. బిడ్డని ఎవరికోసం తీర్చిదిద్దాలి. కుటుంబంకోసమా లేక సమాజం కోసమా. ఈ రెండు ప్రశ్నల్లో దేనికి దానికి సుదీర్ఘమైన చరిత్రా, రకరకాల సమాధానాలూ వున్నాయి. కానీ నేడు వీటికి మనం సులభంగానే సమాధానం చెబుతాము. బిడ్డను తల్లిదండ్రులు తీర్చాలనీ వారి కోసమే తీర్చిదిద్దాలని. తల్లిదండ్రులు బిడ్డను వారికోసమే తీర్చినట్లయితే అతను వారి కుటుంబం కోసమే పెరుగుతాడు. తన కోసమే తాను ఆలోచిస్తాడు. సమాజం కోసమనే ప్రశ్నే తలెత్తదు. పిల్లల విద్యపట్ల సమాజం బాధ్యతను బట్టే భావితరం తీర్చబడుతుంది. నేడు విద్య వైయుక్తిక అవసరంగా మారింది. అందుకే స్వీయ సంపాదనే అక్ష్యమై కూర్చుంది. విద్యకు ఇచ్చిన అన్ని నిర్వచనాలనూ తోసివేసి ఏకోన్ముఖ గమ్యంగా నేడు కొనసాగుతున్నది.

ఒకసారి మరలి చూసినట్లయితే పట్టభద్రులైన వారిని మనం విద్యావంతు లంటున్నాం. ఏ విద్యా సంస్థలోనూ చదవని వారిని అవిద్యావంతుడు అంటున్నాం. ఇది సరికాదు "విద్యా వంతుడంటే ఎవరిలో మానవుడి ప్రతిరూపం ప్రాబల్యం వహిస్తుందో ఆ మనిషి" అని చెప్పవచ్చు. మానవుడిలో భగవదంశ వుందని మత విశ్వాసకులు అంటారు. ప్రపంచ విద్యావేత్తల్లో ఒకరైన ఫోయర్ బాఖ్ ప్రకారం భగవంతుడి రూపంగా సృజింపబడింది. మానవుడు కాదనీ, భగవంతుడే మానవుని ప్రతిరూపంగా సృజింప బద్దాడని అన్నారు. మనిషి తన అంతరాలను శోధించుకుని తను ఎలా వుండాలని కలలు గన్నాడో, వాటి మేరకు మహాశక్తి మంతుడైన వీరుణ్ణి, దేవుణ్ణి సృష్టించుకున్నాడు. మనిషి లోపల సరిగా అతని స్వీయ ఆదర్శం నిహితమై వుంటుంది. ప్రాచీన నాగరికతలో గ్రీకులు ఈ రకమైన మనుషుల్ని తయారు చేసుకోవడంలో తమ విద్యా వ్యవస్థను నిర్మించుకోగలిగారు. అందుకే వారు మాకు బలమైన చక్కని నిపుణుడైన తెలివైన పౌరుడు కావాలి. కానీ అతను తనలోని వైయుక్తిక వాదంలోకి మారనివాడై వ్యష్టిగా అభివృద్ధి అయినవాడై వుండాలని వారు ఆకాంక్షించారు.

విద్య అనేది పాఠశాలకు సంబంధించిన విషయం మాత్రం కాదు. కానీ ఇది కీలకాలను మాత్రమే ఇస్తుంది. జీవిత మంతా పాఠశాలేతర విద్యే. విద్యా లక్ష్యం అక్షరాస్యత లోనే లేదు, ఏదో ఒక వృత్తిని నేర్పడం లోనే లేదు. మనిషి మానవత్వం కోసం పోరాడే వాడుగా తీర్చి దిద్దడమే విద్యాలక్ష్యంగా వుండాలి. తమ తల్లిదండ్రులు భుజాలపై నుండి పెంచబడిన పిల్లలు, తమ తండ్రుల కన్నా ఉన్నతమైన సాంస్కృతిక స్థాయిలో ఉండటమే ఆ లక్ష్యం.

విద్య ద్వారా మనం పొందాలను కుంటున్న జ్ఞానం ఏమిటి? 'జ్ఞానం' అంటే సమాచారం సేకరించి అంగీకరించడం కాదనీ జీవనంపై ప్రపంచం ద్వారా మనం మనపైన ఏర్పరచుకున్న భావాలను నెమ్మదిగా మార్చే ప్రక్రియ అని ప్రొఫెస్ ఫ్రెషర్ చెప్పారు. కానీ పందొమ్మిదవ శతాబ్దపు విద్యా విధానం సాంస్కృతిక విలువలను ఆశించలేదు. దీని లక్ష్యం సామాజిక ఉపయోగితగానే పేర్కొన్నారు.

బ్రిటీష్ ఇండియా విద్యావేత్త మోకాలే స్పష్టంగానే తన విద్యా లక్ష్యాన్ని వివరించారు. "The Purpus of my education is produce a Class of Citizens who are Indians blood in Colour Britisherin Values" రక్తం వర్ణం, భారతీయులై విలువల్లో బ్రిటీషువారిగా ఉండాలనడం సుస్పష్టమే. అంటే ఆయా వ్యవస్థల ఆధిపత్య బృందాల ప్రయోజనాలే లక్ష్యంగా అందుకనుగుణమైన విలువల ఏర్పాటు కోసం విద్యా శిక్షణ కొనసాగించా రనేది వాస్తవం. అందుకే మార్క్సిస్టు తత్వవేత్త గ్రాంసీ "అత్యధిక ప్రజలు

తమంతతాముగానే పాలనా బృందాల మార్గాన్ని అంగీకరిస్తూ, వారి అవసరాల కనుగుణంగా సాంస్కృతికంగా తీర్చిదిద్దబడే సంస్థలలో విద్యారంగం ఒకటిని సెలవిచ్చారు.

విద్య యొక్క లక్ష్యం అనగానే మనకు సాధారణంగా గుర్తుకు వచ్చేది సర్వతోముఖాభివృద్ధి (Allround Development) పూర్తి పరిణత మానవుణ్ణి మలచడం అని దీనర్థం. అయితే ఈ నిర్వచనంలో వైవిధ్యముంది! సర్వతో ముఖాభివృద్ధిని అందరూ బలపరుస్తారు. కానీ కొందరి ఉద్దేశ్యాలు వేరు. పుస్తకాలు బాగా చదివి సకల విజ్ఞాన సమాచారాన్ని నిక్షిప్తం చేసుకోవడమే సర్వజ్ఞతను సాధించడం అంటారు. కానీ సమాజ అవసరాలను బట్టి వారి వారి అభిరుచులను బట్టి ఒక ఉత్పత్తి శాఖ నుంచి మరో ఉత్పత్తి శాఖకు మారగల సర్వతోముఖ సామర్థ్యం ప్రజలకు కలుగ జేయాలి. చదువుతో పాటు ఉత్పాక కృషినీ, వ్యాయామాన్ని జోడించాలి. మానసిక, శారీరక శ్రమలు రెండూ చేయగలిగి రాజకీయ చైతన్యాన్ని, సంస్కారాన్ని పొందడమే సర్వతోముఖాభివృద్ధి అని సామాజిక శాస్త్రవేత్తలు చెబుతారు. విద్యకు ఉత్పాదక శ్రమనూ జోడించాలనే ప్రతిపాదన విస్మరించడం వల్లే పనికి విద్యకు అంతరం పెరిగి విద్యావంతుల్ని ఉన్నతులుగా, శ్రమ చేసే వారిని హీనంగా పరిగణించే విలువలు వచ్చాయి. మన విద్యా వ్యవస్థ కూడా నిట్ట నిలువుగా చీలి రెండు రకాల విద్యా వ్యవస్థలు కొనసాగుతున్నాయి.

"సాధారణ పాఠశాల చదువు, పాఠశాల గదులలోనే కాక మొత్తం జీవితంలోని భౌతిక శ్రమకూ మేథో శ్రమకూ మధ్య సంబంధానికి ఒక నూతన ప్రారంభం కావాలి. సంస్కృతి యొక్క అన్ని రంగాలలోనూ ఒక సమగ్రమైన ఆశయం ప్రతిబింబించి మార్పుకు గురికావాలి. ఒక నూతన జవసత్వం, సంస్కృతి యొక్క అన్ని అంగాలలోనూ ప్రవేశించాలని గ్రాంసీ పేర్కొన్నారు. కానీ మన విద్యా విధానం మంచి వృత్తిదారుల్ని మాత్రమే తయారు చేస్తోంది. అందుకే "The Modern Education is Producing best Professionals in the world" అని జిడ్డు కృష్ణమూర్తి అన్నారు. మన ఆధునిక విద్య మంచి వృత్తికారుల్ని చేస్తూనే మంచి మనిషిని తయారు చేయడం మరిచిపోయింది. వృత్తికారుల్లో మంచి నైపుణ్యత వుంటుంది. కానీ మంచి మనిషిలో నైపుణ్యతతో పాటు విలువలూ వుంటాయి. విలువలు ఎక్కడైతే సరిగా లేకుండా పోతాయో అక్కడ జ్ఞానం అంతా చెడుగా వినియోగపడుతుంది. ఐన్‌స్టీన్ కనుగొన్న

— — — — — * * * — — — — —

**కేవలం ఆలోచనల నుండే జ్ఞానం పుట్టదు. పని ఆలోచనలు ఒక నియమాను సారంగా జరిగిన పరిణామం లోంచి కొన్ని సూత్రాలు చేశాడు మానవుడు. ఆచరణకు అంగీకారమైన ఆ సూత్రాలే విలువలుగా స్థిరపడ్డాయి. ఇలా మానవ సమాజం నియమాల్ని తయారు చేస్తూ అందరూ అంగీకరిస్తూ వచ్చిన స్థితి నుండే వాటిని విలువలుగా గుర్తిస్తున్నాము.**

— — — — — * * * — — — — —

శాస్త్రజ్ఞానం హిరోషిమా, నాగసాకిలను ధ్వంసం చేసినట్లు.

డార్విన్ ప్రకారం జీవపరమైన తేడా ఏమిటంటే మనిషి శ్రమిస్తాడు. శ్రమించని మనిషి వుండడు. అందుకనే వానరుణ్ణి నరునిగా చేసింది శ్రమ అని ఏంగిల్స్ చెబుతాడు. పనిచేస్తూ ఆలోచిస్తాము. ఆలోచిస్తూ పని చేస్తాము. రెండూ వేరు వేరు కాదు. కానీ కేవలం ఆలోచనల నుండే జ్ఞానం పుట్టదు. పని ఆలోచనలు ఒక నియమాను సారంగా జరిగిన పరిణామం లోంచి కొన్ని సూత్రాలు చేశాడు మానవుడు. ఆచరణకు అంగీకారమైన ఆ సూత్రాలే విలువలుగా స్థిరపడ్డాయి. ఇలా మానవ సమాజం నియమాల్ని తయారు చేస్తూ అందరూ అంగీకరిస్తూ వచ్చిన స్థితి నుండే వాటిని విలువలుగా గుర్తిస్తున్నాము. మనిషి ఎన్ని రకాల చర్యలు చేస్తే అన్ని రకాల విలువలూ వుంటాయి. మనిషి భిన్న రకాల కార్యకలాపాల్లో పాల్గొంటున్నపుడు ఏది మంచో అది ఒప్పుకుని ఆచరిస్తాడు. దానినే నైతిక విలువ అంటాము.

పురాతన సమాజం నుండి ఇది వస్తూనే వుంది. భారతదేశంలో మతం విలువలకు ఒక ముఖ్య కేంద్రంగా వుంది. మతం వర్ణాశ్రమ ధర్మాలను బోధించి మనషులు వారు చేస్తున్న పనులను బట్టి వారి వారి స్థానాలను స్థిరీకరించి దానికవసరమైన విలువలను ప్రతిపాదించింది. మత జ్ఞానానికి భిన్నంగా వచ్చిన ఏ విజ్ఞానాన్నయినా ఆవిష్కరణనైనా తీసుకు వచ్చిన వారిని నిర్దాక్షిణ్యంగా చంపడం చరిత్రలో మనం చూస్తాము. మత, కుల ప్రాతిపదికన ఏర్పడ్డ విలువలు మానవ సంబంధాల్ని చరిత్రలో ఎప్పుడూ అసమానత్వం లోనే వుంచాయి. అలాగే స్త్రీ పురుష అసమానత్వాలూ 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అన్న మనుధర్మోక్తి సాక్ష్యంగా కొనసాగుతూనే వుంది. ఆధునిక కాలంలోనూ రూపంలో మార్పు తప్ప సారం కొనసాగుతూనే వుంది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం సామాజిక న్యాయం ప్రాతిపదికగా రాజ్యాంగం వచ్చినా విలువల్లో మార్పు రాకపోవడాన్ని మనం గమనించాలి. విద్యను బోధనను వేరు వేరు విషయాలుగా మనం భావిస్తుంటాము. కానీ అవి రెండు ఒకటే. విద్యా వ్యవస్థ మార్పుల కోసం ఉద్యమాలు కొనసాగినప్పటికీ విద్యకు సంబంధించి విద్య యొక్క సారం గురించి, పాఠ్యాంశాలలో బోధిస్తున్న విషయం గురించి అందులోని నైతిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక స్వభావాన్ని గురించి బలమైన ఉద్యమాలు రాలేదు.

విద్యా నిర్వహణ ప్రయివేటు వ్యవహారంగా మార్పు చెందడంలోనే లక్ష్యాలు, గమ్యాలు, ఆసక్తులు, అభిరుచులు మారి పోయాయి. వీటితో పాటే విలువలు, ప్రమాణాలు మారాయి. విద్య వస్తువుగా మారడంతో కొనుగోలుదారులు, అమ్మకందారులు ఏర్పడ్డారు. కొనుగోలు అమ్మకాల్లో లాభాలు మాత్రమే వుంటాయి. ఇంక ప్రమాణాలకు తావెక్కడిది. విలువలకు చోటెక్కడిది. విలువలు బోధిస్తే రావు. మనం ఆచరించడం ద్వారానే విద్యార్థులకు విలువలు అందించగలం. అయితే విలువలను ఆచరించి బోధించే భౌతిక పరిస్థితి కూడా అవసరము. సూత్ర రూపంలోనైనా అంగీకరించే స్థితిని ఏర్పాటు చేసుకోవాలి. ప్రాథమిక విద్య లోపల వృత్తికారుని ఉత్పత్తి చేయము. విలువలు కలిగిన మనుషుల్ని తయారు చేస్తాము. ఎప్పుడైతే ప్రాథమిక విద్య నిర్వహణలో విలువలతో కూడిన మనుషుల్ని తయారు చేయగలుగుతామో ఆ మనిషికి ఎంత జ్ఞానం వచ్చినా విలువలతోనే జీవిస్తాడు. పాఠశాలలో ఉపాధ్యాయుడు ఏ విలువలను బోధించాలను కుంటాడో అది తాను ముందుగా ఆచరించాలి. అందుకు ప్రయత్న పూర్వకమైన కృషి, నిబద్ధత ఉపాధ్యాయునికి అవసరం. అలాంటి సాంస్కృతిక, సంపన్నమైన, విలువలతో కూడిన విజ్ఞాన సమాజాన్ని నిర్మించు కొనేందుకు భవిష్యత్ తరాలకు నూతన విద్యావంతులను తయారు చేసి అందించే బాధ్యత ప్రభుత్వానిదై వుండాలి. విద్యలో ప్రయివేటు రంగం ప్రవేశం ఆగిపోవాలి. ప్రభుత్వ ప్రమేయం వుంటేనా విద్యార్థులందరి లోనూ తాము వివిధ వర్గాల వారమనీ, వివిధ వృత్తుల వారమనే భేదభావం లేకుండా చేయడం సాధ్యమవుతుంది. బోధనా కార్యకలాపంలో మార్పు రావాలి. ఆచరణాత్మక పాఠశాల నిర్మాణ వ్యవస్థలో అపూర్వ అభివృద్ధి జరగాలి. అధ్యాపక వ్యవస్థలోనూ అభివృద్ధి జరగాలి. ఆ దిశగా మన ప్రయత్నం కొనసాగాలి. ◆

# ఫస్టు టెర్రరిస్టు నెక్స్టు కమ్యూనిస్టు

మహెజబీన్

టెర్రరిస్ట్ ఎవరు?
The question Continues...
...
ఆ ఏమి లేదు
ఊరికెనె అలా నిలబడ్డాను
ఏమి తోచడం లేదు
శ్వేతసౌధం బోర్ కొడుతుంది
ఎవరితో యుద్ధం చేయాలా
ఆలోచిస్తున్నాను

నా స్నేహితుడి పేరు చెప్పి
ఇప్పటి దాకా యుద్ధం చేసాను
అమాయక ప్రజలు అమాయక దేశాలు
ఏమి ప్రశ్నించరు
Poor Fellows
మరికొన్ని దశాబ్దాలు
టెర్రరిస్టు భూతం చూపించి
ఎక్కడైనా యుద్ధం చేయొచ్చు
ఆయిల్ నిక్షేపాలు కొల్లగొట్టొచ్చు

I love third world
ఏ రెండు దేశాలు
స్నేహంగా ఉండడం చూడలేను
సరిహద్దుల మధ్య నిప్పుల పూలు పూయాలి
ఇండియా పాకిస్తాన్ కొట్టుకుంటె
చూడ ముచ్చటగా ఉంటుంది
ఒకరి మీద ఒకరు నా దగ్గరి కొచ్చి
కంప్లయింట్ చేస్తారు
అప్పుడు నేను ఆయుధాలు అమ్ముతాను

అంతా సవ్యంగానే జరుగుతుంది కాని
సమస్యంతా కమ్యూనిస్టులతోనే
సామ్రాజ్యవాదం అంటారు
నా పాలసీలు విమర్శిస్తారు
సిద్ధాంతాలు మాట్లాడుతారు
ప్రశ్నించడం నేర్పుతారు
ప్రజలు వీళ్ళను నమ్ముతారు
వీళ్ళ వెంట నడుస్తారు

no,
ప్రశ్న ఉదయించడం భరించలేను
అందుకే
వీళ్ళ ఉద్యమాలను టెర్రరిస్ట్ అకౌంట్‌లో వేసాను
first terrorist next communist
ఇప్పుడు
Peace and liberty కోసం
నేను చేసే ప్రయత్నాలు కొనసాగుతాయి
నిక్షేపంగా ఎప్పటిలా
'no peace without justice'
the answer follows...

**('వామపక్ష తీవ్రవాదం' అంటూ ఉద్యమాలు అణిచివేతకు గురౌతున్న గ్లోబల్ సందర్భం ఇది. వామపక్ష ఉద్యమాల పట్ల గౌరవంతో)**

---



# సీతాఫల శ్రుతి ...

శిల్పా జగదీష్

కొండల్లో కోనల్లో
మొలకెత్తిన వనమాలిని
శీతాకాలపు సిరివెన్నెల్లో
పుష్పించి ఫలించిన
అమృత ఫలాన్ని నేను
మీ చేతి కందివచ్చిన
సీతాఫలాన్ని నేను

పేదవాడు
బ్రతుకుబండిలోన
కడుపు చేతబట్టుకొని
గంపెడాశతో
మీ చెంతకు తెచ్చినారు
అందు'కొని' ఆరగించమనే
ప్రకృతి ఫలాన్ని నేను
సీతాఫలాన్ని నేను

వేగవంతపు జీవితంతో
చూసీ చూడకుండా వెళుతుంటే
నా ఒల్లంతా కళ్ళతో
మిమ్మల్నే ఆశతో చూస్తున్న
ప్రకృతి ప్రసాదాన్ని నేను
సీతాఫలాన్ని నేను

పిజ్జాలు, బర్గర్లు, క్రీపప్‌లు కల్తీపుడ్లు తిని
ఎండిన తాటాకు నాలుకలకు తీపిని అద్ది
మీ జిహ్వా చాపల్యాన్ని కాపాడవచ్చిన
అమృత భాండాన్ని నేను
సీతాఫలాన్ని నేను

సాయం సంధ్యవేళ
రోడ్డు వార బారులు తీరిన
నా బుట్ట పొట్టలో తన్ని
ఇనుపడెక్కల బూట్ల కాళ్ళతో
నన్ను చిదిమేసిన
మీ లాఠీలతో నమస్కారం చెబుతూ
విలపిస్తున్న ప్రకృతి ప్రసాదాన్ని నేను
సీతాఫలాన్ని నేను.

ప్రకృతి ఇచ్చిన ఫలసాయాన్ని
అమ్ముకొని జీవనం సాగిద్దామని
నగరానికి వచ్చిన
పేదవాని వీపుపై లాఠీల దెబ్బలతో
కడుపుకొట్టిన కర్కసులను చూసి
శోకిస్తున్న ప్రకృతి ఫలాన్ని నేను
సీతాఫలాన్ని నేను

గిరిపుత్రుల క్షుద్బాధను తీరుస్తూ
పల్లెజనపదాల చేతుల్లోనె ఉంటూ
బడుగు జీవితాల వారి పెదవులను
తీపిచేస్తూ ఉంటాను నేను
పంచామృతాన్ని నేను
సీతాఫలాన్ని నేను.

నరరూప రాక్షసులు నడయాడే
నగరానికి ఇక రానుగాక రానని
వొట్టేసి వెళుతున్న
ప్రకృతి ఫలాన్ని నేను
సీతాఫలాన్ని నేను.

# భావ విప్లవానికి బాట వేసిన కవిరాజు 'త్రిపురనేని'



ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న

కవి రాజు కవి. ప్రముఖ నాటకకర్త. సుప్రసిద్ధ శతకకర్త, శతావధానులు, మహా పండితుడు, మంచి భావుకుడు. వ్యంగ్య రచయిత, విమర్శకుడు, పరిశోధకుడు, సంఘ సంస్కర్త, వ్యాయవాది, మానవతావాది, హేతువాది, భావ విప్లవ విధాత.

మహా పురుషుల కోవకు చెందినవారు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి. వీరు 1887వ సంవత్సరం జనవరి 15వ తేదీవ కృష్ణాజిల్లాలో జన్మించారు. రామస్వామిగారికి అంగలూరు వీధి బడిలో 1895 జూలై 15వ తేదీన అక్షరాభ్యాసం జరిగింది. కవిరాజు చిన్నప్పుడు చదువుమీద పెద్ద శ్రద్ధ చూపేవాడు కాదు. ఆటలమీద ఆసక్తిని కనపరిచారు.

1898లో అల్లూరి పున్నమాంబతో పెళ్లి అయింది. 1910 సంవత్సరం సెప్టెంబర్ 8వ తేదీన ఒక కుమారుడు జన్మించాడు. వీరే ప్రఖ్యాత కథకుడు, నవలా రచయిత, తత్వవేత్త గోపీచంద్‌గారు. తర్వాత ఐదు సంవత్సరాలకు ఒక కూతురు కలిగింది. ఆమె పేరు సరోజిని.

భార్య శ్రీమతి పున్నమాంబగారు 1920 సంవత్సరం జనవరి 16వ తేదీన కాలధర్మం చెందారు. ఆ సంవత్సరమే రామస్వామిగారు ద్వితీయ వివాహం కూడా చేసుకున్నారు. ఈమె పేరు చంద్రావతి. వీరికి ఒక కుమారుడు కలిగాడు. ఆయన పేరు గోకుల్‌చంద్.

1932 సంవత్సరంలో రెండో భార్య కూడా మరణించారు. 1933 సంవత్సరంలో కవిరాజుగారు మూడో పెళ్లి చేసుకున్నారు. ఈమె పేరు అన్నపూర్ణమ్మ. వీరికి ఒక కూతురు పుట్టింది. ఈమె పేరు చౌదరాణి. ప్రఖ్యాత కథకుడు అట్లూరి పిచ్చేశ్వరరావు ఈమెను వివాహం చేసుకున్నారు. చౌదరి మూడో భార్య కూడా 1964 సంవత్సరంలో ఏప్రిల్ 30వ తేదీన చనిపోయారు.

చౌదరిగారు తెలుగు సాహిత్యంలో భావవిప్లవాన్ని తన రచనల ద్వారా సృష్టించారు. 'సూత పురాణం', 'కురుక్షేత్ర సంగ్రామం', 'శంబుక వధ', 'ఖూనీ', 'వివాహ విధి', 'కుప్పుస్వామి శతకం,' 'ధూర్త మానవా!', 'సూతాశ్రమ గీతాలు', ' భగవద్గీత' మొదలైనవి వీరి ముద్రిత గ్రంథాలు. 'అంపకం', 'మాలదాసరి! 'నరకం', 'గోపాలరాయ శతకం', 'చెన్నకేశవ శతకం', 'పల్నాటి పౌరుషం', 'రాణా ప్రతాప్' మొదలైన గ్రంథాలు అముద్రితాలు. కవిరాజు గారు డబ్లిన్ విశ్వవిద్యాలయంలో బారిష్టరు పట్టాపొందారు. 'ఎందుకు?' అని ప్రశ్నించడం తెలుగు సాహిత్యానికే నేర్పిన భావ విప్లవకారులు చౌదరిగారు.

వీరి భాషా సేవకు గుర్తింపుగా ఆంధ్ర మహాసభ బెజవాడలో 1929 సంవత్సరం నవంబర్ 4వ తేదీన కాశీనాథుని నాగేశ్వరరావు చేతి మీదుగా 'కవిరాజు' అనే బిరుదును ఇచ్చి గౌరవించింది. గుడివాడ పౌరులు రామస్వామి చౌదరికి 1942 సంవత్సరం ఏప్రిల్ 25, 26 తేదీల్లో గజారోహణోత్సవంతో ఘనంగా సన్మానం జరిపి, వారి సంస్కరణోద్యమం పట్ల తమ ప్రగాఢ గాఢానురాగాన్ని తెలియజేసుకున్నారు.

వివిధ ప్రాంతాల నుంచి అనేక మంది ప్రముఖులూ, వేలాది స్థానిక ప్రజలూ ఆ సన్మానంలో పాల్గొని కవిరాజుకు బ్రహ్మరథం పట్టారు. బెజవాడ రామచంద్రారెడ్డిగారి అధ్యక్షతన చల్లపల్లి జమిందారు సమక్షంలో అనేక మంది కవుల అభినందనలతో ఆ సన్మానం జరిగింది. ఒక కవికి ఇలాంటి సన్మానం జరగడం తెలుగులో అరుదు.

కొంతకాలం తర్వాత చౌదరిగారికి అస్వస్థత కలిగింది. చివరకు టైఫాయిడ్‌కు దారితీసింది. వారి ఆరోగ్య పరిస్థితి అమితాందోళనను కలిగించింది. డాక్టర్ కొల్లూరి వెంకట్రాయుడుగారు చికిత్స చేశారు. అయినా జ్వరం రోజులు గడిచిన కొద్దీ ఎక్కువవుతున్నదే గాని తగ్గలేదు. కవిరాజుగారు జీవిస్తారు అని అందరూ అనుకున్నారు. కాని తెనాలిలోని వారి స్వగృహం, 'సూతాశ్రమం'లో 1943 సంవత్సరం జనవరి 16వ తేదీన రాత్రి 1.30 గంటలకు కీర్తిశేషులయ్యారు. అప్పటికి కవిరాజుగారి వయస్సు 56 సంవత్సరాలు మాత్రమే. ఈ ఆకస్మిక వార్త యావదాంధ్ర ప్రజానీకాన్ని దుఃఖసాగరంలో ముంచివేసింది.

## II. నాటకాలు :

కవిరాజు నాటక ప్రక్రియను తమ అభిప్రాయాల ప్రచారానికి సాధనం చేసుకున్నారు. వీరి నాటకాలు ప్రజాదరణను పొందాయి. 'కురుక్షేత్ర సంగ్రామం', 'శంబుక వధ', 'ఖూనీ' మొదలైనవి కవిరాజుగారి ముద్రిత నాటకాలు. 'కారెంపూడి కథనం', 'కొండవీటి పతనం', 'రాణా ప్రతాప్', 'నరకం', 'అంపకం' అనేవి అముద్రిత నాటకాలు.

### ఎ. ముద్రిత నాటకాలు :

### 1. కురుక్షేత్ర సంగ్రామము :

లోకమంతటా అప్పటి వరకు కౌరవులు దుర్మార్గులనీ, అవినీతిపరులనీ, పాండవులే సన్మార్గ వర్తనులనీ, పూజ్యులనే భావం వుంది. ఇది యథార్థం కాదని గాఢంగా విశ్వసించారు కవిరాజుగారు. అంధ విశ్వాసాలతో నిండి, నిబిడీకృతమైన సమాజంలో చైతన్యం కలిగించడానికి గానూ ఈ 'కురుక్షేత్ర సంగ్రామము' రచించబడింది. ప్రథమ ముద్రణ 1910 సంవత్సరంలో జరిగింది. దీనిలోని ఇతివృత్తం మహాభారత యుద్ధానికి సంబంధించింది. అంచేత ఇది వీర రస ప్రధానమైన నాటకం. ఇది మంచి నాటకం. కవిరాజుగారికి పేరు ప్రఖ్యాతులు తెచ్చిన నాటకం ఇది.

### 2. శంబుక వధ :

ఇది కవిరాజుగారి రెండో నాటకం. దీనిని భారతదేశ చరిత్రను పరిశీలించి రాయబడింది. మన దేశ చరిత్రను పరిశీలించి చూస్తే ఆర్య అనార్య సంఘర్షణలు ముమ్మరంగా కన్పిస్తాయి. అనాది నుంచి ఆర్యులు ద్రావిడుల్ని పెక్కు ఇక్కట్లకు గురిచేస్తూనే వచ్చారు. మధ్య ఆసియా నుంచి వచ్చిన ఆర్యులు వర్ణ వ్యవస్థను ఏర్పరచడమే కాకుండా, ఈ దేశం మీద ఆధిపత్యం కూడా సంపాదించారు. ద్రావిడులపై అనేక ఆంక్షలు విధించి, నిర్దయగా అణగదొక్కారు. రామరాజ్యంలోనే ఆర్యుల బాధ ద్రావిడులకు తప్పలేదు. అనార్యుడైన శంబుకుని, దయా దాక్షిణ్యాలు లేకుండా రాముడు సంహరించాడు. కారణం తపస్సు చేసుకొనే హక్కు ద్రావిడులకు లేదు. ఈ విషయాన్ని గమనించిన కవిరాజుగారు ఆ సాంఘిక అధర్మాల్ని అద్దం వలే ప్రతిబింబింప చేస్తూ, రసోచిత పద ప్రయోగంతో, నాలుగు అంకాల నాటకాన్ని రాశాడు. ప్రథమ ముద్రణ 1920లో జరిగింది.

ఈ నాటకంలో స్వతంత్ర సిద్ధికొరకే శంబుకుడు ప్రాణత్యాగం చేశాడనీ, ద్రావిడుల్ని దాస్యంలో వుంచడానికిగానూ రాముడు మత గురువైన వశిష్టుడు పన్నిన కుట్రను కవిరాజు ఎలుగెత్తి లోకానికి చాటారు. వందలాది రామాయణాలు రాసినవారు వున్నారు కానీ ఏ ఒక్కరూ శంబునకు జరిగిన అన్యాయాన్ని వేలెత్తి చూపించలేకపోయారు. ఈ నాటకంలో సంభాషణలు సామాన్యుని హృదయానికి హత్తుకొనేలా వున్నాయి.

పౌరాణిక రూపక కర్తలపై ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆంగ్ల భాషా ప్రభావం వుంది. కవిరాజుగారు బెర్నార్డ్ షా ప్రభావంతో రూపక రచన చేసినట్లు 'శంబుక వధ'కు రాసిన పీఠికలో వారే చెప్పుకున్నారు. కవిరాజుగారు హిందూ మతంలోని పరస్పర విరుద్ధ భావాల్ని అహేతుక అంశాల్ని ఖండిస్తూ రూపక రచన చేశారు. శభాష్ అనిపించు కున్నారు.

### 3. ఖూనీ :

విశ్వనాథ సత్యనారాయణ 'వేనరాజు' నాటకాన్ని ఆధారంగా చేసుకొని కవిరాజు 'ఖూనీ' అనే నాటకాన్ని రాశారు. వేనుని ఆర్య రుషులు లేదా విశ్వనాథ సత్యనారాయణ ఖూనీ చేశారని చౌదరిగారు అభిప్రాయపడ్డారు. నాటకంలో వేనరాజుకు తీరని అపచారం చేయబడిందని గ్రహించిన కవిరాజు వేనుని గురించిన వాస్తవాలు లోకానికి తెలియజేయాలనే ఆకాంక్షతో ఖూనీ నాటకాన్ని 1935 సంవత్సరంలో రాశారు. ఇందులో నాలుగు రంగాలు వున్నాయి.

వేనరాజు నాయకుడు. అతని సైన్యాధిపతి దుష్టవర్మ ఉపనాయకుడు. దుష్టవర్మ మునుల చేతుల్లో కీలుబొమ్మగా మారి, గాఢనిద్రలో వున్న వేనుని గుండెల్లో బాకుతో పొడిచి చంపుతాడు. తుట్ట తుదకు దుష్టవర్మ తన అపరాధాన్ని తెలుసుకొని పిచ్చివాడై పోతాడు. తాను కూడా మధువు చేతికత్తితో పొడవబడి మరణిస్తాడు. అంతటితో ఈ నాటకం అంతమవుతుంది. కాబట్టి ఇది విషాదాంత నాటకం.

ఆంధ్ర నాటక రంగానికి చేసిన అమూల్యమైన సేవ వల్ల రామస్వామి చౌదరి ఆంధ్ర నాటక కర్తల్లో అగ్రశ్రేణికి చెందిన వారుగా పరిగణించబడుతున్నారు.

### బి. అముద్రిత నాటకాలు :

పలనాటి యుద్ధం ఇతివృత్తంగా తీసుకొని రాసిన నాటకం 'కారెంపూడి కథనం' ఈ నాటకం ముఖ్యమైన పట్టణాల్లోనే కాక అంగలూరు, చేటపల్లి మొదలైన గ్రామాల్లో సైతమూ ప్రదర్శించబడింది.

స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా జరుగుతున్న రోజుల్లో కవిగారు కొండవీటి పతనం, రాణాప్రతాప్ అనే రెండు నాటకాల్ని రాశారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగానూ, స్వాతంత్ర్య ఉద్యమానికి అనుకూలంగానూ రాసిన నాటకాలు ఇవి. బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర దేశ పర్యటనను పురస్కరించుకొని అనేక చోట్ల ఇవి ప్రదర్శించబడ్డాయి.

అముద్రిత నాటకాలైన నరకం, అంపకం కూడా అదృశ్యమయ్యాయి. చౌదరిగారి ఇతర గ్రంథాలవలే ఈ నాటకాలు కూడా తెలుగుదేశంలో పెద్ద గాలి దుమారాల్ని లేపాయి. ఈ నాటకాలు దొరికి వుంటే ఇంకా బాగుండేది.

## III. శతకాలు

### 1. కుప్పుస్వామి శతకం :

జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిని దృష్టిలో వుంచుకొని రాసిన శతకం ఇది. రామస్వామి, కుప్పుస్వామి మంచి స్నేహితులు.

ఈ శతకంలోని మొట్టమొదటి పద్యమే మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది.

'గొంటరుల దుంటరుల గుమిగూల్చి సృష్టి
జేసి చీటికి మాటికి గాని వారు
తన్నుకొని చచ్చుచుండగ దనియు చుండు
గొప్పవానికి జేజేలు కుప్పుస్వామి'

అప్పట్లో అమలులో వున్న సాంఘిక దురాచారాలనూ, మూఢనమ్మకాలనూ, మతం పేరుతోనూ, దైవం పేరుతోనూ జరుగుతున్న అత్యాచారాలనూ, నిర్భయంగా దుయ్యబట్టారు చౌదరి ఈ శతకంలో.

మానవునికి ఎన్ని సుగుణాలుంటే మాత్రం ఏమి లాభం? నీతి ఒక్కటి లేకపోతే మిగిలినవన్నీ బూడిదలో పోసిన పన్నీరు గదా? అంచేత మానవుల్ని నీతి, నియమాలతో బతక వలసిందిగా ఉద్బోధించారు కవిరాజు.

'ఎన్ని రసములున్న నేమి రుచించును
ఉప్పులేని కూర చప్పనగును
కోటి గుణములున్న గొఱగావు నీతియొ
క్కండు లేకయున్న గుప్పుస్వామి'

'నీతిలేనివాని నిరసించు జగమెల్ల
నీతిశాలి కెపుడు నెగడు లేదు
నీతి శాలినెపుడు నీతియే కాపాడు
గుజనుబారి నుండి కుప్పుస్వామి'

ఈ శతకాన్ని ఆరంభం నుంచీ అంతం వరకూ కమ్మని శైలిలో నడిపించారు కవిరాజుగారు. ఇందులోని పద్యాలన్నీ పసిడి తునకలే.

తెలుగు భాషలో అనేక నీతులు బోధించే శతకాలు వున్నాయి. కాని భావ విప్లవమును ప్రబోధించే శతకం ఒకటి లేదు. ఈ లోటు కుప్పుస్వామి శతకం తీర్చింది. ఈ శతకంలో తెలుగు నుడికారం ఉట్టిపడుతుంది. దానితో వీరు ప్రజాకవిగా పేరుపొందారు. సాంఘిక సేవలో, సాహిత్య సేవలో, ప్రజా సేవలో, ప్రమాణాల్లో, వారాల్లో భావ విప్లవములో ఆరితేరిన మొనగాడు త్రిపురనేనివారు.

**2. ధూర్తమానవా! :**

కవిరాజు ప్రారంభించి, అసంపూర్తిగా ఆపివేసిన మరో శతకం 'ధూర్తమానవా'. ఈ మకుటంతోనే ఇందులోని పద్యాలు సమవృత్తాలుగా రాయబడ్డాయి. దీని ప్రథమ ముద్రణ 1943 సంవత్సరం సెప్టెంబర్‌లో జరిగింది.

సర్వసాధారణంగా అన్ని శతకాల్లోనూ మానవులకు జరుగుతున్న అన్యాయాలనూ, అధర్మాలనూ, తమ ఇష్టదైవానికి నివేదించు కోవడం ఇతివృత్తంగా వుండటం కద్దు. అయితే ఈ శతకంలోని చిత్రమేమిటంటే మానవుడే మకుటధారియైన ప్రపంచంలో భగవంతుడే కవిరాజుగారికి కలలో కన్పించి, తన పేరిట భూసుర వర్గం సమాజంలోని ఇతర వర్గాలకు చేస్తున్న అన్యాయాల్ని, అక్రమాల్ని గూర్చి విన్నవించుకుంటాడు.

ఈ శతకం చదివితే ఇతర జాతుల్ని బానిసత్వంలో శాశ్వతంగా వుంచడానికి భగవంతుణ్ణి, స్వర్గ నరకాలనూ భూసురులు తమ సౌఖ్య సౌభాగ్యాల కోసం సృష్టించాడనేది స్పష్టమవుతుంది.

'ధూర్త మానవ శతకం' మిక్కిలి వ్యంగ్యపూరితమైంది. దీనిలో భగవంతుని పేర జరిగే అత్యాచారాల్ని, దుష్కృత్యాల్ని ఖండించబడ్డాయి. మానవులందరూ సమానులే అని నిరూపించబడింది ఈ శతకంలో.

ఎత్తుకోలులోనే భగవంతుని చేత పిడుగుల వర్షం కురిపించారు కవిరాజుగారు. భగవంతుడు ఏమంటున్నాడో మీరే చూడండి.

'ఏ బదునాల్గు లోకముల సృష్టియొనర్చుచు బెంచి పిమ్మటన్
దూబవలెన్ హరింతునని దొంగనుడుల్ వచియించు చుంటివే?
యేబది మాటలేమిటికి? ఇట్టి ప్రచారము మానకున్నచో
గూబలు సాగగ దీసెదను గూయకు మిట్టి విధూర్త మానవా!'

ఈ శతకాలు ప్రముఖుల మన్ననల్ని, ప్రశంసల్ని అందుకున్నాయి.

శతక వాఙ్మయం సాధించ వలసిందేమిటో, ఎలా సాధించాలో చౌదరిగారి 'కుప్పుసామి శతకం', 'ధూర్తమానవా' శతకాలు చాటుతున్నాయి.

**3. గోపాలరాయ :**

'గోపాలరాయ' అనే మకుటంతో మరో శతకం కూడా రాశారు. ఇందులో శ్రీ కృష్ణుని గూర్చి వ్యంగ్యంగా చెప్పిన 26 పద్యాలు వున్నాయి.

## గేయాలు :

### సూత్రాశ్రయ గీతాలు :

కొందరు సంస్కర్తలు మార్పును ఏవో కొన్ని శాఖలకే పరిమితం చేస్తూ వుంటారు. త్రిపురనేని దానికి పూర్తిగా విరుద్ధం. గణబద్ధమైన పద్యరచనతో పాటు సూత్రబద్ధమైన గేయ రచనను కూడా వారు రాశారు. ఆ పద్యాలకూ, గేయాలకూ ఒక ప్రధానమైన భేదం వుంది. పద్యం పండితులకే పరిమితం కాగా, గేయం పామర జనానికి కూడా అందుబాటులో వుంటుంది. సామాన్య ప్రజానీకంలో ఏదైనా ఒక నూతన భావాన్ని బహుళ ప్రచారం చేయడానికి గేయం చక్కని సాధనం. ముఖ్యంగా స్త్రీలనూ, బాల బాలికలనూ, గ్రామీణులను, సంఘంలోని సామాన్య ప్రజానీకాన్ని గేయాలు ఆకర్షించినంతగా, పద్యాలు ఆకర్షించవు. ఈ విషయాన్ని గుర్తించిన రామస్వామి చౌదరిగారు 'సూత్రాశయ గీతాలు' రాశారు. సాహిత్య క్షేత్రంలో వారు చేసిన ఈ కృషి దేశాభివృద్ధికి జాతీయోద్యమానికి ఎంతగానో ఉపకరించింది. వీరు భారత జాతికి అండగా నిల్చి జాతీయోద్యమంలో పాల్గొని, భారతమాత దాస్య శృంఖలాల్ని విచ్ఛేదం చేయాలని సంకల్పించారు. నీరసమూ, నిస్తేజమూ అయిన జాతిలో వీరరసంతో ఉత్సాహాన్నీ, ఉత్తేజాన్ని కలిగించడానికి 'వీరగంధము' అనే జాతీయ గీతం రాశారు. ఇది చాలా మంచి గేయం.

'వీరగంధము దెచ్చినారము
వీరుడెవరో తెల్పుడీ!
పూసి పోదుము మెడనులైతుము
పూలదండలు భక్తితో

---

'ఉప్పు సత్యాగ్రహపు జైలు జీవితంలో నేనూ, ఆచార్య రంగా ఈ గేయాన్ని సంస్మరిస్తూ ఉత్తేజితులమయ్యే వారము' అని అన్నారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు.

ఈ గీతం స్వాతంత్ర్య పోరాటపు రోజుల్లో ఆంధ్రదేశంలోని ముఖ్య పట్టణాల్లోనే కాక, మారుమూల గ్రామాల్లో సైతమూ ప్రతిధ్వనించింది.

చౌదరిగారు ఎంతటి దేశభక్తులో, అంతటి స్వభాషాభిమానులు. వారికి తెలుగు ప్రజలన్నా, తెలుగు భాషన్నా, తెలుగు దేశమన్నా అభిమానం ఎక్కువ. అంచేతనే నిద్రాణమైన తెలుగు ప్రజానీకానికి వైతాళిక గేయాలు ఆలపించారు.

'గౌతమీ నది, కృష్ణవేణియు
తుంగభద్రయు, సర్వదా
జీవనదులై యొండి పోవక
యెల్ల కాలము పారుచున్
... ... ...
... ... ...
తెలుగు బిడ్డా / మరచి పోకుర
తెలుగు దేశము పురిటి గడ్డర
కొక్కొరొకో పాట బాడర
తెలుగు వారల మేలు కొల్పర'

ఆంధ్ర సాహిత్య నందనోద్యానంలో పూచిన సురభిళ ప్రసూనాలు ఈ 'సూతాశ్రమ గీతాలు'

## V. సూత పురాణము :

భారతదేశంలోనే దురాచారాల్ని రూపు మాపి, నీతిని నెలకొల్పడానికి రామస్వామిగారు 'సూతపురాణం' రాసినట్లుగా ఈ కింది పద్యం వల్ల తేటతెల్లమవుతుంది.

'ధర్మము ధర్మమంచు చెఱదారులు త్రొక్కుచు నానలేక దు
ష్కర్మములాచరించు కలికాలపు బెద్దలగాంచి తప్పులై
మర్మము విప్పి చెప్పి మను మార్గమునన్ నడిపింప లోకమున్
నిర్మలుడైన సూతముని నీతులు పల్కెడు నా ముఖంబునన్'

చిరకాల జీవి, పరమ కరుణా స్వభావుడు, గంగానదీ తీరంలో తపోనిష్ఠా గరిష్ఠుడు అయిన సూత మహర్షిని రామస్వామిగారు సందర్శించి పుణ్యభూమిగా, గణనకెక్కిన ఈ భారతదేశంలో భగవంతుని పేరు మీదుగానూ, స్వర్గ – నరకాల పేరు మీదుగానూ, పూర్వ గ్రంథాల పేరు మీదగానూ, జరుగుతున్న అపచారాలనూ, అన్యాయాలనూ, అసత్యాలనూ, సూతుని ముందు ఏకరువు పెట్టారు.

రామస్వామిగారికీ, సూతమహర్షికీ, సుదీర్ఘమైన వాదోపవాదాలు జరిగాయి. ఎట్టకేలకు భారతదేశంలో జరుగుతున్న వంచనను, మోసాన్నీ అవగాహన చేసుకొన్న సూతముని రామస్వామిగారిని లోక కళ్యాణార్థం ఓ కావ్యం రాయమనగా వారి ఆజ్ఞానుసారంగా పాత పురాణం కాక సూత పురాణాన్ని చాలా చక్కగా రాశారు. కమనీయమైన గ్రంథం ఇది.

సత్యాన్వేషణ దృష్టితో తాను యధార్థమని విశ్వసించిన సిద్ధాంతాన్ని నిర్భయంగా లోకానికి 'సూత పురాణం' ద్వారా వెల్లడించారు.

'సూత పురాణం' నాలుగు అశ్వాసాల రసవత్కావ్యం. ప్రథమాశ్వాసంలో కౌశికునికి జ్ఞానోదయం కలిగించిన ధర్మనాథుడనే కసాయి నాని కథ, భద్రాద్రి గోపన్నను రామదాసుగా మార్చిన కబీరు దాసు వృత్తాంతం చోటు చేసుకుంది. ద్వితీయాశ్వానంలో దేవతల్ని గూర్చి దేవలోకాన్ని గూర్చి చర్చించడం జరిగింది. తృతీయాశ్వాసంలో ప్రహ్లాద చరిత్ర, యధార్థ రామాయణం వుంది. చతుర్థాశ్వాసంలో శ్రీ కృష్ణ చరితము, కురుపాండవుల కథ చక్కగా వివరించబడ్డాయి.

## VI. భగవద్గీత :

1941 సంవత్సరంలో పలనాటి వీరచరిత్రను ఇతివృత్తంగా గైకొని రామస్వామిగారు 'భగవద్గీత'ను రాశారు. కురుక్షేత్ర యుద్ధభూమిలో శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేశాడనే ప్రతీతి వున్నది కదా! అదేవిధంగా కారెంపూడి కదనరంగంలో బ్రహ్మనాయుడు బాలచంద్రునికి గీతోపదేశం చేశాడని భావించిన చౌదరిగారు చక్కని వ్యంగ్య వైభవంతో ఈ అధిక్షేప గ్రంథాన్ని రాశారు. మహాభారత యుద్ధానికి వలే పల్నాటి యుద్ధానికి కూడా సోదరుల రాజ్యకాంక్షే మూలకారణం. మహాభారత, పల్నాటి యుద్ధాలకు గల పోలికలు చాలా స్పష్టంగా తెలుస్తాయి. తెలుగు సాహిత్య చరిత్రలో కనీవినీ ఎరుగని ధోరణిలో వ్యంగ్య రచన చేశారు కవిరాజుగారు.

## VII. వివాహ విధి :

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు చిన్ననాటి నుంచి తాను విశ్వసించిన అభిప్రాయాల్ని నిర్భయంగానూ, నిరాఘాటంగానూ వెల్లడించేవారు. మానవ జీవితంలో వివాహం మహోత్కృష్టమైంది. అంచేత పెళ్ళి నూరేళ్ళ పంట అని అంటారు. గనుక వివాహ నిర్వహణ విధానంలో వారికి గల కొన్ని అమూల్యమైన అభిప్రాయాల్ని లోకానికి తెలియజేయాలనే ఉద్దేశంలో 'వివాహ విధి' అనే చిన్న పుస్తకాన్ని 1930 సంవత్సరంలో ప్రచురించారు.

ఈ చిన్న పుస్తకం తెలుగు కుటుంబ జీవితంలో ప్రవేశపెట్టిన మార్పు అంతా – ఇంతా కాదు. కరుడుగట్టిపోయిన సంఘంలో చైతన్యం కలిగించింది. బ్రాహ్మణ, పౌరోహిత్యం లేకుండా వందలాది వివాహాలు జరిగాయి. చౌదరిగారి వివాహ పద్ధతి అమల్లోకి వచ్చింది. కవిరాజుగారు ప్రవేశపెట్టిన మార్పులన్నీ ఒక ఎత్తు. ఇదొక్కటే ఒక ఎత్తు.

## VIII. త్రిపురనేని తియ్యనైన పత్రికలు :

రామాయణ, భారత, భాగవతాలపై, కవిరాజుకు నిర్దుష్టమైన అభిప్రాయాలున్నాయి. వీరు పౌరాణిక సాహిత్యాన్ని, హేతువాద దృక్పథంతో పరిశీలించారు. ఆర్య మత గ్రంథాలకు ద్రావిడ భాష్యాన్ని రాశారు. పురాణ ఇతి వృత్తాల్ని తీసుకొని తన దృక్పథానికి అనుగుణంగా నాటకాల్ని రాశారు. వాటికి వివరణాత్మక ఉపోద్ఘాతాల్ని కూడా పొందుపర్చారు. ఈ పీఠికలు లేకపోతే వారి తాత్త్విక దృష్టికి అవరోధం. అపచారం, జరిగి వుండేది. కేవలం రచన కోసం రాశారు కానీ ఆయా పాత్రల్లో వారి అభిప్రాయాలు లేవని విమర్శకులంటే, వారి అనుయాయులు ఇరకాటంలో పడేవారే. వారు తమ విప్లవాత్మకమైన భావాల్ని ఉపోద్ఘాతాల్లో వివరంగా వివరించారు. వీరి విమర్శ వెనుక సాంఘిక సమానత్వం, సత్యాన్వేషణ, నీతి, ధర్మం, అనేవి ఉత్తమ ఆదర్శాలుగా కన్పిస్తాయి.

పాశ్చాత్య విజ్ఞానం ద్వారా వచ్చిన హేతువాద దృక్పథంతో, చారిత్రక దృష్టితో పురాణాల్ని పరిశీలించి, అంధ విశ్వాసాల్ని ప్రశ్నించారు. న్యాయశాస్త్రంలో నిష్ణాతులైన కవిరాజు తమ వాదాల్ని తర్కబద్ధంగా, అతి సమర్థవంతంగా సాగించారు.

వీరి పౌరాణిక రూపకాలైన కురుక్షేత్ర సంగ్రామం, శంబుక వధ, ఖూనీ నాటకాలకు పొందుపర్చిన పీఠికల్లో హిందూ ధర్మ శాస్త్రాల అధర్మ శాస్త్రాలనీ, స్వర్గ నరకాలు స్వార్థ పరుల కల్పనలనీ, పురాణాలన్నీ పిట్టకథలుగా, కట్టుకథలు పేర్కొన్నారు. మన పురాణాలన్నీ నిశితంగా పరిశీలిస్తే చౌదరిగారి వాదమే నిజం అనిపిస్తుంది.

## IX. కవిరాజు శబ్ద సృష్టి :

చౌదరిగారు శబ్ద వైచిత్రిని కవితలో చూపించారు. మహత్తర కవితా సృష్టిని చేయడమే కాక తెలుగు నుడికారపు పదును

చూపటమే గాక, తెలుగుదనపు తీరు తెమ్మల సౌరు సంపదల్ని దీవించుటయే కాక, నూతన శబ్దాల్ని ప్రౌఢిమను మనకు చూపించారు. వారి నూతన శబ్దం సృష్టి వారి గ్రంథాల్లో కన్పిస్తుంది.

**X. కవిరాజు చకోక్తులు :**

సంభాషణల చమత్కారానికి కవిరాజు పెట్టింది పేరు. వీరి సంభాషణల్లో ఎంతో చమత్కారం ఎంతో హాస్యం జాలువారుతాయి.

ఒకనాడు తోటలో అరటిమొక్క పాదు చేస్తూ వుండగా విశ్వనాథ సత్యనారాయణగారు సూతాశ్రమానికి వచ్చి 'కవిరాజుగారూ అరటిగెల ఈశాన్యపు మూల వేయరాదంటారు. కోయించి వేయండి' అన్నారట. వారి మాట ముగియక ముందే 'అవును సత్యనారాయణగారు ఇంకొక వారానికి పక్వానికొస్తుంది. అలాగే కోసివేస్తా' నన్నారట.

అంగలకుదురులో ఒక ఉపన్యాసక చక్రవర్తి కవిరాజుతో ఢీకొన్నప్పుడు, 'మీరు మ్లేచ్ఛులు గదా' అని కవిరాజుగారు వారిని అంటే వారు హుంకరించి 'నేను స్వచ్ఛమైన బ్రాహ్మణ్ణి సుమా' అన్నారట. 'మీరు మనుస్మృతి గత శ్లోకాన్ని విసరి, అర్థాన్ని వివరిస్తూ 'వింధ్యదాటి దక్షిణానికి వచ్చినవాడు మ్లేచ్ఛుడ'న్న వాక్యాన్ని చెప్పగా, సభికులు గొల్లుమన్నారట. ఉపన్యాసక చక్రవర్తికి సక్కెళ్లు పడినవట

రాజకీయ చర్చల్లో ఒకనాడు ఒక గాంధేయుడు 'నూలు వడికితే స్వరాజ్యం వస్తుంది' అంటే 'నూలు వడికిన రోజుల్లోనే ముందుగా మన స్వరాజ్యం పోయింది. తిరిగి నూలు వడికితే ఎట్లా వస్తుంది' అని కవిరాజు అన్నారట.

ఈదర గోవయ్యగారు శ్రీచౌదరిగారిని ఇలా ప్రశ్నించారు:

'రామస్వామి గారు! దేవుడు విషయం – మీరు వున్నాడనా లేక లేడనా! ఏమంటారు? వారు ఇలా సమాధానపరిచిరి. దొంగతనం చేస్తే కోర్టుకు వెళ్లాలి అనే సంగతి తెలుసు గదా! మానవుడు సరియైన ప్రవర్తన అలవరుచుకుంటే దేవుడితో ఏమి పని అని అన్నారు. ఇలా చౌదరిగారు ఎన్నో చలోక్తులు వేసేవారు.

చౌదరిగారి కవిత్వం అపూర్వ విషయ భూయిష్టమై, చమత్కార పూరితమై, నుడికార పోషకమై, శయ్యాప్రసన్నుతాహృద్యమై, ధారాళతా విశిష్టమై, బహుపండిత ప్రశంసా పాత్రమై విరాజిల్లుతూ వుంది. ఇలాంటి రసవత్తరమైన కవితను భూసురవర్గం పాతాళలోకానికి అణగ ద్రొక్కాలని ప్రయ త్నం చేయరు. అయితే ఆ ప్రయత్నం ఫలించలేదు. ఇందులో విజయం కవి గారిదే.

కవిరాజు గారి భావాలు ప్రచారం ఉధృతరూపం దాల్చుతూ వుంది. ఈనాడు వారి గ్రంథాలు చదివేవారి సంఖ్య ఎక్కువైపోయారు. వారి కవితా మాధుర్యానికి తన్మయులైన రసపిపాసకులు ఎందరో ఆంధ్రదేశం నలుచెరగులా వున్నారు. రామస్వామిగారి చిత్రపటం అనేక ఇండల్లో అలంకరించబడి వుంది. కవిరాజుగారికి అనేకమంది ఏకలవ్య శిష్యులు వున్నారు.

రామస్వామిగారు చేసిన సాహిత్య, సాంఘిక సేవల్ని గుర్తించిన మన రాష్ట్ర ప్రభుత్వం వారి కాంస్య విగ్రహాన్ని ట్యాంక్‌బండ్ మీద 1986 నవంబర్ 1వ తేదీన నెలకొల్పింది. ఈ కాంస్య రూపం భావితరాలకు చైతన్య స్ఫూర్తి, కలిగిస్తూ, సందర్శకుల హృదయాల్లో జాతి, మత, కుల, వర్గ విభేదాల్ని సమసిపోయేటట్లు చేసి, మానవులంతా ఒకటే అనే సమతాభావాన్ని కల్గిస్తుందనడంలో సందేహం లేదు.

సామాజిక రుగ్మతలకు, అసమానతలకు కారణాలైన వేదాల్ని, పౌరాణిక గాథల్ని హేతువాద దృష్టితో, సాంఘిక న్యాయసాధన కోసం కలంపట్టి భావ విప్లవానికి బాట వేసిన మహానుభావుడు కవిరాజు గారు.

సమాజంలో మత పరమైన, మతవరంగా వచ్చిన అసమానతలు సమసిపోయే వరకు చౌదరిగారి రచనలు భావ విప్లవాన్ని వెదజల్లుతూనే వుంటాయి. ✦

## హైకూలు

**తాతోలు దుర్గాచారి**

"గోదావరి హోయలు
నా కవనానికి
లయలు"

"అధికార దాహానికి
ఎర్రదనం
ఏరులై పారింది."

"ఒప్పందానికి
అణువంతైనా
కోరస్ లేదు".

"అంధకారంలో
పుట్టుకొస్తుంది
అభ్యుదయం"

"గిట్టుబాటు
రైతుకా..
రాజుకా..?"

"భద్రగిరి
నా కవన
లోగిలి"

నోటుకు ఓటు
నిజాయితీకి
చేటు

## శ్రామిక కళ



**జి. నరసింహమూర్తి**

మా పంటలు అమ్ముకునే
రోజులు పోయాయి
మా శ్రామిక కళ సాక్ష్యంగా
చెమట్లు మలిచి సృష్టించుకున్న
ఆకుల్నీ కాయల్నీ
సగర్వంగా సంతల్లో
మా తోటి వారికి సమర్పించే
మా కృషికి విలువ కట్టుకునే
రోజులు రిలయన్స్
మార్కెట్ అద్దాల వెనుక
నిర్జీవంగా పడి ఉన్నాయి.
మా ఆయాసాన్నీ, ఆరాటాన్నీ
కలబోసి కన్న తిండి గింజల్లోంచి
ఓడిన రైతు రక్తం స్రవిస్తోంది.
మండే కడుపుకి కాసిని
గంజినీళ్లు పోయాలన్నా
అమ్ముకోవడానికేమున్నాయి
మా దగ్గర
పొత్తిళ్లల్లో మాబిడ్డలాంటి
కిడ్నీలు తప్ప.

# ముచ్చటైన మూడు కథలు



డా॥ వి.ఆర్. రాసాని

ఆ మధ్య కాలంలో వచ్చిన మూడు కథలు మూడు అంశాలను తెలుపుతున్నాయి. ఒక కథ నేటి యాంత్రిక జీవనంలో మనుషులు కూడా... తమ ప్రేమాభిమానాలను కోల్పోయి యంత్రాలుగా మారిపోతున్న అంశాన్ని తెలుపుతుంది.

మరొకటి కక్షలూ కార్పణ్యాలతో కునారిల్లుతున్న ప్రాంతంలో ఒకప్పుడు సమాజాధిపత్యాన్ని చెలాయించిన ఫ్యూడల్ భావ ప్రతినిధులైన వ్యక్తులు, ఆ భావజాలం పతనమైన తర్వాత ఎలాంటి మానసిక స్థితిలో వుంటారో తెలిపే కథ.

మూడోది అంగవైకల్యం కలిగిన వ్యక్తులు కాదు నిజమైన వికలాంగులు. మానసికంగా కల్మషాన్ని పెంచుకున్నవారే నిజమైన అంగవికలురని తెలిపే కథ.

మొదటి కథ వాల్ పేపర్.

రెండో కథ పులిజూదం.

మూడో కథ - బృంద.

ఈ మూడు కథలు 2005లో వచ్చిన కథలు.

ఆ ఏడు అందర్నీ ఆకర్షించిన కథలు.

## వాల్‌పేపర్

ప్రపంచీకరణ ప్రసవించిన సాంకేతిక శిశువు వికృతరూపం ఈ కథలో మనకు దర్శనమిస్తుంది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఆర్థిక వనరుల్ని, ఉద్యోగావకాశాల్ని, జీవనస్థాయిని పెంచిన మాట వాస్తవమే అయినప్పటికీ దీని మూలంగా మానవ సంబంధాలలో వచ్చిన దూరం, అనారోగ్య కరమైన మార్పులు కఠిన వాస్తవాలు. ఉద్యోగావకాశాల్ని వెదుక్కుంటూ అమెరికా వెళ్ళిన స్త్రీ పురుషుల మనస్తత్వాలలోను, జీవన విధానం లోను తెచ్చిన మార్పులు మనుషుల్ని 'డాలర్' మనుషులుగా, యంత్రాలుగా ఎలా మారుస్తున్నాయో కళాత్మకంగా చిత్రించిన కథ 'వాల్ పేపర్'. రచయిత వివిన మూర్తి.

భూమ్మీదకు రావడానికి జన్మ అనే 'వీసా' కోసం ఎదురు చూస్తున్న ఒక ఆత్మ తను జన్మ తీసుకునే ముందు, ఆ తర్వాత జరిగిన పరిణామాలను, పరిస్థితుల్ని ఉత్తమ పురుషలో చెప్పుకుపోతుంది.

భారతదేశం నుంచీ డాలర్ల సంపాదన కోసం విదేశాలకు వెళ్ళిన ఒక యువకుడు, ఒక యువతి ఒకే ఆఫీసులో పనిచేస్తున్నా మాట్లాడుకొనే తీరిక వుండదు. ఎప్పుడూ కంప్యూటర్ ముందరే కూర్చుని పని చేసుకుంటుంటారు. వాళ్ళు మాట్లాడు కోవాలన్నా, సమాచారం అందించుకోవాలన్నా అన్నీ ఓ కేబిన్‌లోని పీసీ తెరమీదే... అలా మెసేజెస్‌తోనే వాళ్ళు సంభాషించుకుంటూ పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. అయితే ఈ పెళ్ళి ఎవరి కెరీర్‌కి అడ్డు రాకూడదను కుంటారు. ఇద్దరూ బాగా సంపాదిస్తున్నవాళ్ళే. వాళ్ళ తల్లిదండ్రులు కూడా వాళ్ళ నిర్ణయానికి సంతోషిస్తారు. పది లక్షల ఖర్చుతో ఇద్దరికీ హైదరాబాద్‌లో పెళ్ళి జరిగిపోతుంది. వాళ్ళ హనీమూన్‌ను కంపెనీనే ఏర్పాటు చేస్తుంది. వాళ్ళ కలయిక కోసమే చూస్తున్న ఆత్మ ఆమె గర్భంలో ప్రవేశిస్తుంది. ఈ లోకంలోకి రావడానికి 'వీసా' దొరికినట్లేనని తల్లి గర్భంలో సంతోషపడిపోతుంది. అయితే ఆ సంతోషాన్ని తండ్రి ఎంతో కాలం నిలుపలేదు. అప్పుడే గర్భం, బిడ్డ... మన కెరీర్‌కి అడ్డు వద్దంటాడు. ఇష్టంలేకపోయినా తల్లి సరేనంటుంది. ఫలితంగా ఆ శిశువు 'వీసా' కాన్సిలై, చెత్తకుప్పలో పడుతుంది.

మళ్ళీ అవకాశం కోసం ఎదురు చూస్తుంటుంది. అయితే ఈసారి ఉద్యోగపరంగా ఇద్దరూ ఒక మెట్టు పైకెదిగిన ఫలితంగా తండ్రి ఆస్ట్రేలియాలో, తల్లి జర్మనీలో వుండిపోవాల్సి వస్తుంది. అయితే శిశువు గర్భంలో వుండగా తీసిన స్కానింగ్ ఫొటోలను తన పీసీలో గోడకు తగిలించుకుని చూస్తుం టుంది తల్లి. ఇలా అయిదారేళ్ళు గడిచి పోతుంది. ఈ మధ్యలో 9/11 సంఘటన, షేర్స్ పతనం... వాళ్ళ సమాగమానికి ఆటంకాలుగా నిలుస్తాయి. నాన్నమ్మ బిడ్డను కనలేకపోతున్నందుకు కోడల్ని నిందిస్తూ, సాధిస్తుంటుంది. కానీ అమ్మా, నాన్నలకు మాత్రం పని... పని... ఒకటే పని. అయినా "డబ్బు ముఖ్యమే కానీ అంతా డబ్బే కాదు" అనుకుంటారు కానీ పనినే ఛాలెంజ్‌గా తీసుకుంటారు. పని ఇచ్చే ఛాలెంజ్‌ని తీసుకుంటున్నప్పుడు కలిగే ఎగ్జయిట్‌మెంట్ వాళ్ళని డ్రైవ్ చేస్తుంటుంది. అయినా ఇద్దరు మానవుల సహజ వాంఛలో చాలామందికి జన్మ లభించినట్లు, యిద్దరి విద్యావంతుల తీరిక ఒప్పందాలలో వాళ్ళు కలవడం, ఫలితంగా ఆ శిశువుకి మళ్ళీ 'వీసా' లభించడం జరుగుతుంది.

శిశువు గర్భంలో పెరుగుతుంటే... ఒక కాస్ట్‌లీ కార్పొరేట్ హాస్పిటల్లో వైద్య సలహాలు, సహాయాలు ఆ తల్లికి లభిస్తుంటాయి. అయినా శిశువు మామూలు తేదీ కంటే ముందే పుట్టి తల్లి మరణిస్తుంది. తండ్రికి, నాన్నమ్మకూ ఈ శిశువే తల్లిని చంపాదని కోపం. బలహీనంగా పుట్టిన ఆ బిడ్డని అందరూ నిరాదరిస్తారు. కానీ తాతయ్యే స్వయంగా పెంచి పెద్దచేస్తాడు. నాన్నమ్మ కొడుక్కి మళ్ళీ పెళ్ళి చేయాలని చూస్తుంటుంది. కానీ తండ్రి తన గదిలో పీసీలో తల్లి ఫొటోలున్న 'వాల్ పేపర్స్' పెట్టుకొని వాటిని చూసుకుంటూ ఆనందిస్తుంటాడు. పిల్లవాడికి తాత

పరిచర్యలతో అయిదేళ్ళు రాగానే 'ప్లే హోమ్'లో చేర్చుతారు. అతన్నెవరూ పట్టించుకోరు. తండ్రి ఇరవై నాలుగ్గంటలూ కంప్యూటర్‌తోనే... బిడ్డ తండ్రితో మాట్లాడాలని, ఫస్ట్ ర్యాంక్ వచ్చిన తన ప్రోగ్రెస్ రికార్డు తీసుకుని తండ్రి దగ్గరకు వెళితే, తండ్రి రాక్షసుడైపోతాడు. ఫలితంగా బిడ్డ జ్వర పడతాడు... తాతకూ అనారోగ్యమే... పిల్లవాడు మగతలోకి వెళ్ళిపోతాడు... ఆ మగతలో 'తాతా నేను చచ్చిపోతాను. చచ్చిపోయి వాల్‌పేపరైతే నాన్న నన్నూ అమ్మలాగే ప్రేమిస్తాడు. ఆ పేపరుని వడిలోకి తీసుకుంటాడు' అంటూ వాల్‌పేపర్ కావాలన్న కోరికతో ఇకా మగతలోకి వెళ్ళిపోతాడు బిడ్డ...

ఈ కథ చదువుతుంటే ఎవరికైనా గుండె ఆర్ద్రం కాకమానదు. ఆధునిక శాస్త్ర సాంకేతిక పదజాలంతో సమర్థవంతంగా రాసిన ఈ కథలో ఆత్మలు, మారుజన్మలు వంటి భారతీయ తాత్విక విషయాలు చెప్పకనే కథలో జొరబడ్డాయి.

ఈ కథలో పాత తరానికీ, ఈ తరానికీ మధ్య, యంత్రాల ముందు కూర్చుని యంత్రాలుగా మారిపోతూ అనుబంధాలను, ఆత్మీయతల్ని కోల్పోతూ మనసుల్ని సైతం 'హార్డ్‌వేర్స్'గా మార్చేసుకుంటున్న పరిస్థితులకీ మధ్య గొప్ప సంఘర్షణ పాఠకుణ్ణి ఊపిరి పీల్చుకోనియ్యదు. పైగా పాఠకుడిపైన ఒక బలీయమైన ముద్రను కూడా వేస్తుంది. ఈ కథ తెలుగు కథా సాహిత్యానికి ఒక ఆశాకిరణమే.

## పులిజూదం

ఈ కథను రాసింది జి.ఎన్. రామ్మోహన్.

ఇది రాయలసీమ ప్రాదేశికతలో నడిచిన కథ ఈ కథను చర్చించే ముందు ఈ ప్రాంతంలో కక్షలకు, గ్రామాధిపత్యాలకు వారసులైన పాలెగాళ్ళ వ్యవస్థను గురించి కూడా కాస్తా చర్చించు కోవాల్సిన అవసరం వుంది. ఈ పాలెగాళ్ళు భూస్వాములు. విజయనగర రాజుల కాలంలో చిన్న చిన్న సైనిక నాయకులుండేవారు. ఆయా ప్రాంతాలలో వసూలయ్యే ఆదాయాన్ని దాఖలు పరుస్తూ పాలెగాళ్ళను రాజే నియమించేవాడు. ఆయా ప్రదేశాలలో అధికారం ఆదాయ వ్యయాలన్నీ ఈ పాలెగాళ్ళ చేతుల్లోనే వుండేవి. ఆ పాలెగాళ్ళ వ్యవస్థ అలాగే కొనసాగుతూ 'తూర్పు ఇండియా కంపెనీ' అధీనంలోకి వచ్చింది. ఈ పరిపాలనలో కంపెనీ వారు తమ బొక్కసం నింపుకోవడం కోసం భూమి మీద విపరీతమైన పన్నులు వేసి, జమీందారీ వ్యవస్థను ప్రవేశ పెట్టారు. పాలెగాళ్ళే జమిందార్లుగా మారారు. ఈ జమిందార్లకు కంపెనీ 'గుత్త పద్ధతి'లో భూముల్ని, గ్రామాలని బదలాయించింది. ఆ తర్వాత బ్రిటిష్ ప్రభుత్వ హయాంలో థామస్ మన్రో రాయలసీమలో రైత్వారీ పద్ధతి ప్రవేశపెట్టడంతో జమిందార్లు కాస్తా భూస్వాములుగా మారిపోయారు. మన్రో 1820లో మద్రాసు ప్రెసిడెన్సీకి గవర్నర్‌గా రావడంతో ఈ పద్ధతి శాశ్వతంగా అమల్లో కొచ్చింది. ఈ పద్ధతిలో కంపెనీవారు అనుసరించిన పద్ధతుల మూలంగా రైతులు బాగా దెబ్బతిన్నారు కానీ భూస్వాములు మాత్రం బాగుపడ్డారు. అయితే రాయలసీమలో వ్యవసాయం రాను రాను దెబ్బతింది. వర్షాలు పడక కరువులు తిష్టవేయసాగాయి. ప్రభుత్వాలు పట్టించుకోకపోవడంతో ఇది ఎడారిగా మారిపోయే పరిస్థితి ఏర్పడి... భూములున్న భూస్వాములతో బాటుగా రైతుల బతుకులు చితికిపోయాయి. కొందరు రైతులు వ్యవసాయాన్ని వదిలేసి ప్రత్యామ్నాయంగా వ్యాపారాలు, పై చదువుల పైన దృష్టి కేంద్రీకరించి, జీవన స్థాయిని మెరుగుపరచుకోసాగారు. అయినా భూములు పోయినా, బ్రతుకుదెరువు పోయినా ఒకప్పటి పాలెగాళ్ళు, భూస్వాములు అయిన వాళ్ళ డాబు దర్పం మాత్రం పోలేదు. వ్యవసాయం జూదంగా మారిపోయిన నేపథ్యంలో వాళ్ళ డాబు, తెచ్చిపెట్టుకున్న దర్పంలోని డొల్లతనం, దాని వెనకనున్న విషాదం 'పులిజూదం' కథ చక్కగా చిత్రించింది.

ఈ కథలో పాలెగాళ్ళ వేర్లతో భూస్వామిగా ఎదిగిన వ్యవస్థకు ప్రతీక ఎంకారెడ్డి. వ్యాపారంపై ఆధారపడి జీవించే పాత్ర పోల్రాజు. తన కొడుకుని పై చదువులు చదివించి, విదేశాలకు పంపించి ఆర్థికంగా బలపడ్డ పాత్ర బలిజోళ్ళ సుబ్బారాయుడు. వున్నదాంతో సంతృప్తిగా జీవిస్తున్న పాత్ర సాలోళ్ళ పరంధాముడు. ఇందులో ప్రధాన పాత్రలైన ఎంకారెడ్డి, సుబ్బరాయుడు, పరంధాముడు కథ నడిపిస్తారు.

ఎంకారెడ్డి "ఏం జేసినా అది నీలుక్కుని సావడంల్యా 'ఈనెమ్మ' .... గంజి సరిగా పెట్టలేదు" అని సాకల్ని తిట్టుకుంటూ సుబ్బరాయుడు, పరంధాముడు పులిజూదం ఆడుతున్న వేపచెట్టుకాడికి రావడంతో కథ ప్రారంభమవుతుంది.

పరంధాముడు 'తాజ్‌మహల్' బీడీ, సుబ్బరాయుడు 'విల్స్' సిగరెట్టు తాగుతూ పోటీపడి పులిజూదం ఆడుతుంటారు. వాళ్ళు మంచి ఊపులో వున్న సమయంలో వచ్చిన ఎంకారెడ్డిని చూసి ఒక 'పలకరింపు' నవ్వు మాత్రం విసిరేసి ఏమాత్రం లక్ష్య పెట్టకుండా ఆటలో మునిగిపోతారు. ఆ పక్కనే ఆకాశానికో చెయ్యి, భూమికో చెయ్యి అన్నట్టుగా టీ చల్లార్చుతూ వ్యాపారం చేసుకుంటున్న పోల్రాజయినా తనను గౌరవిస్తాడని ఆశిస్తాడు రెడ్డి. అతనూ కొంతసేపు గమనించనట్టే నటించి చివరికి అందరితో బాటు రెడ్డికీ ఒక టీ, చార్మినార్ సిగరెట్ పేకెట్ తెచ్చిస్తాడు. పేకలో అయిదు సిగరెట్లే వుండటంతో షాక్ తిన్న రెడ్డి అడగబోయే లోపల అతని అప్పుల పద్దు గుర్తు చేస్తాడు పోల్రాజు. దాంతో తన రెడ్డితనానికి, పెద్దరికానికి పెద్ద దెబ్బతగిలినట్లు ఫీలైపోయి పైకి మాత్రం భయంతో కూడిన గాంభీర్యం వహిస్తాడు. ఆర్టీసి డ్రైవర్ కొండయ్య పంచాయతీ పేపరు ఆనవాయితీ ప్రకారం రెడ్డి చేతిలో పెడితే పరువు నిలబడిందనుకుంటాడు. పేపరు చదివి ప్రపంచ విషయాలన్నీ తానొక్కడే మాట్లాడాలన్న అహం అతనిది. కానీ సుబ్బరాయుడు మిలట్రీలో వుండి డబ్బు సంపాదించి, కొడుకుని అమెరికా పంపించి అటు లోకజ్ఞానాన్నే గాక, డబ్బూ బాగానే సంపాదించాడు. అదొక కంటగింపు రెడ్డికి. అయినా పైకి చెప్పుకోలేదు. ఆ ముగ్గురి సంభాషణల్లో క్రికెట్ గురించి, రాజకీయాల గురించి చర్చ సాగుతుంది. రెడ్డి అన్నీ తనకు తెలిసినట్లే మాట్లాడతాడు. చివరికి రెడ్డీ, సుబ్బరాయుడూ పులిజూదానికి పూనుకోగా తన ప్రిస్టేజీ కనుగుణంగా రెడ్డి పులుల్నే ఎన్నుకుని ఆట ప్రారంభిస్తాడు. పులుల్ని మేకలతోనే సంపుతూ వస్తుంటాడు రాయుడు.

తన తాత గుర్రంపైన, తన నాయన బుల్లెట్ పైన వెళుతూ ఊరిని తమ చెప్పుచేతల్లో పెట్టుకున్న జమిందారీ వంశీకుల్లో పుట్టిన తనతో సుబ్బరాయుడు, వీళ్ళూ సమానమా అనుకుంటాడు రెడ్డి.

"రెడ్డీ పి.వి. నరసిమ్మారావు మేధావా? వాజ్పేయీ మేధావా?" అంటూ అడుగుతాడు రాయుడు...

పద్నాలుగు భాషలు తెలిసిన పి.వి.నే మేధావంటాడు రెడ్డి. అయితే మిలిట్రీలో తిరిగిన తనకు అంతకంటే ఎక్కువ భాషలు తెలుసంటాడు రాయుడు. దాంతో ఇంకా న్యూనతాభావంలోకి పడిపోయిన రెడ్డి పైకి గుంభనం గానే వుంటాడు. అయినా

అందరి చూపుల్లోను అతని పట్ల కనిపించిన జాలిని చూసి భరించలేకపోతాడు రెడ్డి.

"అయిపోయింది. సర్వం అయిపోయింది. తాతల తండ్రుల నాటి పరువును తాను నిలపలేకపోయినాడు. జమిందారీ వంశాన తాను చెడబుట్టినాడు." అనుకుని రెడ్డి కంట్లో నీళ్ళు పెట్టుకొని అక్కడ నుంచీ వెళ్ళిపోతాడు. ఇక ఆ మరునాటి నుంచీ అటువైపుకే వెళ్ళడు.

స్థూలంగా ఇదీ కథ.

అనుకున్న పాయింటుని కథలో సమర్ధవంతంగా నిర్వహించగలిగాడు రాంమోహన్. కథలో ఎక్కడా బిగువు సడలని కథా నిర్మాణం, వ్యంగ్యాత్మకమైన శైలీ విన్యాసం పాఠకుణ్ణి ఉక్కిరి బిక్కిరి చేస్తుంది.

అయితే భాషాపరంగా ఒకటి రెండు మాటలు కూడా చెప్పుకోక తప్పదు. కథంతా మాండలికంలో నడపాలన్న రచయిత అభినందనీయమే గానీ ఆ మాండలికంలో శిష్ట వ్యవహారం కలిసిపోయిన పద్ధతి కనిపిస్తుంది.

కొన్ని వాడిన ఉపమానాలు అసందర్భం గానూ, కథను దెబ్బతీసే విధంగానూ వున్నాయి. "రెడ్డి – విదురుడి కేసి కృష్ణ పరమాత్ముడు చూసినట్టుగా చూసినాడు ఉసేనుకేసి" అన్నప్పుడు "కురుక్షేత్రంలో కర్ణుడి మాదిరి వుంది రెడ్డి పరిస్థితి" అన్నప్పుడూ రచయిత నిబద్ధత పైన నమ్మకం పోయే అవకాశం వుంది.

అయితే "రెడ్డికి యీరుబానతో యీపు గీసుకున్నంత సుఖంగా అనిపిచ్చింది". "నమ్ముకున్నవన్నీ నట్టేట ముంచి ప్రత్యర్ధి ముందు తనను నిరాయుధుడిని చేస్తున్నట్టని పించింది" వంటివి మనసుకు ఆహ్లాదంగానూ అనిపిస్తాయి.

అయినా కథాపరంగా, నిర్మాణ పరంగా, విషయాన్ని సంఘర్షణాత్మకంగా నడిపించిన తీరు 'పులిజూదాన్ని' మంచి కథల సరసన చేర్చింది.

## బృంద

అపారమైన ఆంగ్ల సాహిత్య పఠనానుభవంతో తెలుగు సాహిత్యంలో చైతన్య స్రవంతి పద్ధతిని యింకా కొనసాగిస్తూ కథలు రాస్తున్న రచయిత కాశీభట్ల వేణుగోపాల్ రాసిన కథ 'బృంద'.

ఉత్తమ పురుషలో కవితాత్మకంగా నడిచిన పెద్ద కథ ఇది. 'వైరల్ ఎన్‌సెఫలైటిస్' సోకి శరీరం పెరిగినా మెదడు మాత్రం అయిదారేండ్ల ప్రాయంలోనే ఎదగకుండా వుండిపోయిన పదమూడేళ్ళ మానసిక వికలాంగురాలైన పాప 'బృంద' కథను ఒక ఆత్మీయ ముద్రలో, కరుణ రసాత్మకంగా చెప్పిన కథ ఇది. కథ యావత్తూ బృంద తల్లి దృష్టి కోణం నుంచి నడుస్తుంది.

ఆమె తల్లిదండ్రుల్ని కాదని వేరే మతస్థుడైన 'ఫయ్యాం'ని పెండ్లాడటంతో ఆ దంపతులు బంధువులకు దూరమవుతారు. వేణువును మోగించడంలో నిష్ణాతుడైన అతను కళావతి రాగంలో ఆరితేరినవాడు. వాళ్ళకి అందమైన యిద్దరు ఆడపిల్లలు బృంద, తబ్బూ.... బృంద పెద్దది. రెండేళ్ళ ప్రాయంలో బ్రెయిన్ ఫీవర్ 'వైరల్ ఎన్‌సెఫలైటిస్' సోకి మెదడు ఎదగకుండా ఆగిపోయింది. ఓ రోజు ఇంటి తోటలో కుర్చీపైన కూర్చుని ఫయ్యాం 'కళావతి' రాగంలో 'రతిసుఖసారే' వాయిస్తూ కుర్చీలోనుంచి వెనక్కి పడి అలాగే చనిపోతాడు. ఆమెకు అతని ఆఫీసులోనే ఉద్యోగమైతే ఇచ్చారుగానీ, మేనేజర్, అధికారి ప్రభాకర్ ఆమెపైన కన్నేసి వుంచుతారు. బృంద, తబ్బూ ప్రభాకర్ బంధువు కమల కరస్పాండెంట్‌గా కార్పొరేట్ స్కూల్లో చదువుతుంటారు. బృందను మానసిక వికలాంగుల స్కూల్లో చేర్పించడానికి ఇష్టపడదు తను. అయితే బృంద చేసే అల్లరి పనికి ఇంటికి పంపేస్తారు. వేరే స్కూల్లో చేర్పించడం ఇష్టంలేక ఇంటి దగ్గరే బృందకు చదువు చెబుతుంటుంది. ఒకరోజు ఆఫీసుకు పోతుంటే పక్కింటి రిటైర్డ్ హెడ్‌మాస్టర్ నేను చూసుకుంటాన్లే వెళ్ళమ్మా అంటూ భరోసా యిస్తాడు గానీ, ఆమె తిరిగొచ్చేటప్పటికి ఏమీ తెలీని బృందను వడిలో కూర్చోబెట్టుకొని చేతులతో బృంద శరీరాన్ని పాముతూ అసహ్యంగా బిహేవ్ చేస్తుంటే తట్టుకోలేకపోతుంది. ఇంకోరోజు బురద నీటిలో ఆడుకుంటుంది. ఇదంతా చెప్పుకుని తన కొలీగ్ అయిన రజనీకి చెప్పి వాపోతుంది. రజనీ ఆమెతో నువ్వంటే మన ఆఫీసరు ప్రభాకర్‌కి ఇష్టం. నీ పొందు కోసం ఆరాట పడుతున్నాడు. వాడికొక చిరునవ్వు పారేసి కాస్త లౌక్యంగా ప్రవర్తించి మళ్ళీ అదే స్కూల్లో చేర్పించమని అడుగు. కమల వాడికి బంధువు అని చెబుతుంది. ఆమె అలాగే చేస్తుంది. అంతమాత్రానికే చొంగ కార్చుకునే ప్రభాకర్ సరేనంటాడు. బృందను మళ్ళీ అదే స్కూల్లో చేర్చుకుని 'కమల' తన స్థానంలో షహనాజ్‌ను నియమించి అబ్రాడ్ వెళ్ళిపోతుంది. షహనాజ్ గొప్ప మానవతా వాది. ఆమె గురుత్వంలో బృంద బుద్ధిగానే వుంటుంది. ఇంతలో ఎదురింటిలో విశ్వనాథ్ అనే 'కవి' దిగుతాడు. అతను వయొలిన్ వాయిస్తుంటే పాప రోజూ అక్కడికి వెళుతుంటుంది. ముసలి హెడ్‌మాస్టర్ నిర్వాకంతో భయాన్ని పెంచుకున్న ఆమె ఒకరోజు పాప విశ్వనాథ్ దగ్గర వున్నప్పుడు వెళ్ళి చూస్తే బృందకు విశ్వనాథ్ వాయులీనం నేర్పు తుంటాడు. అతను ఒక కాలులేని కుంటి వాడు. సంగీతం పట్ల బృందకున్న ఏకాగ్రతను, అభిరుచిని విశ్వనాథ్ ఆమెకు వివరిస్తాడు. మరో రోజు తన భర్తకు, తనకు ఇష్టమైన 'కళావతి' రాగంలో 'రతిసుఖసారే' వాయిస్తున్న విశ్వనాథ్‌ను చూసి కదిలిపోతుంది. క్రమంగా బృందలో మార్పు వస్తుంటుంది. ఓ రోజు టీవీలో పిల్లల ప్రోగ్రాంలో విశ్వనాథ్ పుణ్యమాని బృంద కూడా పాల్గొంటుంది. ఆమె హాయిగా గాలి పీల్చుకుంటుంది. స్థూలంగా ఇదీ కథ.

ఏదో సినిమా కోసం ఈ కథను రాసినట్టుగా రచయిత చెప్పుకోవడం, అలాగే బి. నరసింగరావు దీన్ని సినిమాగా తీస్తుండటం కూడా ఒక విశేషం. ఈ సబ్జెక్ట్‌పైన గతంలో కొన్ని సినిమాలు, కథలు వచ్చినా కథాపరంగా వాటికంటే ఈ కథలో మంచి నిర్మాణం, గుండెను తాకే సన్నివేశాలు బాగానే వున్నాయి.

అయితే శైలిపరంగా రచయిత గమనించుకోవాల్సిన ఒక చిన్న అంశం కూడా ఒకటుంది. కవిత్వం కథలో ఒదగని అంశం. కొన్ని చోట్ల కవితాత్మక పదాలు, వాక్యాలు కథా గమనానికి గులకరాళ్ళలా అడ్డు తగులుతాయి. మచ్చుకు 'పరిచిత గత భేదం' 'గొంతుకలో విచ్చుకున్న ఆకుపచ్చని చెట్ల రహస్య గానం', 'ఆలోచనలు శత సహస్రాలుగా చిట్లిపోయి' 'ఏమీ తెలియని తన లోకంలోకి, ఏమీకానితనంలోకి ప్రయాణించడం... ఈ రాతి బల్ల మన కోసం ఈ ప్రకృతి ఎన్నికోట్ల సంవత్సరాలు కష్టపడి చేసిందో కదా' 'ఒక మాయామయ పొరలాంటి మంచుతత్వంలోకి లయమైపోయి' కన్నీరు మిగిల్చిన రాగం' వంటి వాక్యాలు సాగించే ప్రయోజనం ఏమిటో రచయితకే తెలియాలి. అయితే 'మైనం... మీనియేచర్ పాలరాతి కొండలా వుంది. రేపటిని ఎదుర్కోవడానికి సిద్ధపడుతూ..." వంటి మంచి వాక్యాలు మనసును ఆహ్లాదపరుస్తాయి.

ఏదిఏమైనా 2005లో వచ్చిన కథల్లో గొప్ప అనుభూతిని మిగిల్చే కథగా ఇది మొదటి శ్రేణిలో చేరుతుందనడంలో సందేహం లేదు.

ఈ విధంగా ఈ మూడు కథలు నేటి సమాజంలోని మూడు బలమైన అంశాలకు ప్రతీకలుగా అనిపిస్తాయి.

ఇలాంటి కథలు యింకా ఎక్కువగా రావాల్సిన అవసరం ఎంతయినా వుంది.

★

# నిరాశపర్చిన "ది ఆల్కెమి ఆఫ్ డిజైర్"



## అంపశయ్య నవీన్

ఆ మధ్య తరుణ్ జె. తేజ్‌పాల్ తెహల్కా డాట్‌కామ్ అనే తన వెబ్ మ్యాగజైన్ ద్వారా భారతదేశ రాజకీయ వ్యవస్థను ఓ కుదుపు కుదిపిన విషయం అందరికీ తెలిసిందే. మన దేశపు రక్షణ వ్యవస్థలో కాంట్రాక్టుల విషయంలో చాలా పెద్ద ఎత్తున జరుగుతున్న అవినీతిని తేజ్‌పాల్ ఈ వెబ్‌సైట్ ద్వారా స్టింగ్ ఆపరేషన్ పేరుతో బయటపెట్టాడు. రక్షణ రంగంలో వాడే ఒకరకమైన టార్చ్‌లైట్లను సప్లై చేయడానికి మాకు కాంట్రాక్టులు ఇప్పించండి అని వెళ్ళిన తెహల్కా డాట్‌కామ్ జర్నలిస్టుల దగ్గర్నుండి బంగారు లక్ష్మణ్ రెండు లక్షల నగదును లంచంగా తీసుకొని తన డ్రాయర్లో దాచేసుకుంటున్న దృశ్యాన్ని తెహల్కా డాట్‌కామ్ వారు తమ రహస్య కెమేరాల్లో చిత్రించి భారతదేశ ప్రజలందరికీ చూపించారు. అలాగే ఒక ఆర్మీ జనరల్‌గారు "నాకు జానీవాకర్ బ్లూ లేబుల్'' విస్కీ బాటిల్ తెచ్చిస్తే మీకు కాంట్రాక్టులు ఇప్పిస్తానని అనడాన్ని కూడా తెహల్కా డాట్‌కామ్ వాళ్ళు తమ కెమేరాల్లో రికార్డు చేశారు. అలాగే జార్జి ఫెర్నాండెజ్, జయా జైట్లీల బండారాన్ని కూడా తెహల్కా డాట్‌కామ్‌వారు బయటపెట్టారు. ఇంత జరిగినా అప్పటి ఎన్.డి.ఎ. ప్రభుత్వం వారు తెహల్కా డాట్‌కామ్‌ను మూయించారే తప్ప తీవ్రమైన అవినీతికి పాల్పడిన నాయకుల మీద మాత్రం ఎలాంటి చర్య తీసుకోలేదు.

ఆనాడు ఇంత సంచలనాన్ని సృష్టించిన తరుణ్ జె. తేజ్‌పాల్‌ను, అతని దగ్గర పనిచేసిన జర్నలిస్టులను ఎన్.డి.ఎ. ప్రభుత్వం ఎన్నో ఇబ్బందులకు గురిచేసింది. అన్నింటికీ తట్టుకొని నిలబడగల్గిన తేజ్‌పాల్ తెహల్కా పేరుతో ఒక వారపత్రిక స్థాపించి దానిని విజయవంతంగా నడుపుతున్నారు.

ఇలా ఒక సంచలనాత్మక జర్నలిస్టుగా ప్రఖ్యాతుడైన తరుణ్ తేజ్‌పాల్ 2005వ సంవత్సరంలో 'ఆల్కెమీ ఆఫ్ డిజైర్' అనే పేరుతో ఒక నవలను రచించి మళ్ళీ గొప్ప సంచలనాన్ని సృష్టించాడు. ఈ నవలను 'హార్పర్ కోలిన్స్' సంస్థ ప్రచురించింది.

ఇంగ్లీషులో నవలలు రచించే భారతీయ నవలాకారులకివి చాలా మంచి రోజులు. ఎందుకంటే ఇంగ్లీషులో రచించ బడ్తున్న ఈ నవలలను ప్రచురించడానికి 'పెంగ్విన్', 'హార్పర్ కాలిన్స్', 'రూప'లాంటి పేరు మోసిన ప్రచురణ సంస్థలు చాలా ఉత్సాహంగా ముందుకొస్తున్నారు. ఈ నవలాకారులకు చాలా పెద్ద మొత్తం, మనం ఆశ్చర్యంతో గుండెల మీద చెయ్యేసుకునేంత పెద్ద మొత్తంలో ధనాన్ని పారితోషికంగా చెల్లిస్తున్నారు.

భారతీయ నవలాకారులు ఇంగ్లీషులో రచిస్తున్న నవలలకు విదేశీ మార్కెట్లలో చాలా మంచి గిరాకీ వుంటున్నది. లక్షల కొద్ది కాపీలు అమ్ముడుపోతున్నాయి. ఈ ధోరణి ఎనభైలలో సల్మాన్ రష్దీ రచించిన 'మిడ్ నైట్ చిల్డ్రన్' అనే నవలతో ప్రారంభమైందని చెప్పవచ్చు. అప్పుడు ప్రారంభమైన ఈ ట్రెండ్ ఇప్పటికీ అలానే కొనసాగుతున్నదని ఈనాటి కొందరు నవలాకారులకు అందుతున్న పారితోషికాన్ని చూస్తే అర్థమవుతుంది. ఒక రచయిత నేనో నవల రాస్తున్నానని ప్రకటించగానే అతని తరఫున పనిచేసే అతని ఏజెంట్స్ 'పెంగ్విన్', 'హార్పర్ కాలిన్స్', 'రూప'లాంటి పెద్ద ప్రచురణ సంస్థలకు విషయం తెలియజేస్తారు. ఇతివృత్తమేమిటో సంక్షిప్త రూపంలో ప్రచురణకర్తలకు అంద జేస్తారు. ఆ నవలను చదవకుండానే ఆయా రచయితలకు లక్షలకు లక్షలు ఎడ్వాన్స్‌లు ఇచ్చేసి ఆ నవలను తామే ప్రచురించేటట్లుగా ఒప్పందాలు చేసుకుంటున్నారు.

అమితవ ఘోష్ అనే నవలాకారుడు రచించబోతున్న 'సీ ఆఫ్ పప్పీస్ ట్రిలోజీ' అనే రచనకు 44 లక్షల ఎడ్వాన్స్ ముట్టిందట, అలాగే 'అరవింద అడిగ' రచించబోతున్న 'ది వైట్ టైగర్' అనే నవలకు 14 లక్షలు, నందన్ నీల్‌కని రచించబోతున్న 'ఇమేజింగ్ ఇండియాకు' 14 లక్షలు, పలాష్ మెహెరోత్రా రచన 'ది బట్టర్ ఫ్లై జనరేషన్'కు 8 లక్షలు, తరుణ్ తేజ్‌పాల్ రచించబోతున్న రెండో నవల "ది స్టోరీ ఆఫ్ మై అసాసిన్స్"కు 22 లక్షల ఎడ్వాన్స్‌లు ముట్టాయట.

తరుణ్ తేజ్‌పాల్ రచించిన మొదటి నవల 'ఆల్కెమీ ఆఫ్ డిజైర్'కు 8 లక్షలు మాత్రమే ముట్టాయట. నిజానికి ఈ నవల వెలువడినప్పుడు గొప్ప సంచలనాన్నే సృష్టించి నప్పటికీ ఈ నవల కాపీలు ఊహించి నంత పెద్ద సంఖ్యలో అమ్ముడుపోలేదు. అయినప్పటికీ ఆయన రచిస్తున్న రెండో నవలకు 'ది స్టోరీ ఆఫ్ మై అసాసిన్స్'కు 22 లక్షల ఎడ్వాన్స్

అందటం ప్రచురణ రంగానికి సంబంధించిన చాలామంది ప్రముఖులను ఆశ్చర్య పరచింది. తేజ్‌పాల్ రచిస్తున్న ఈ రెండో నవలలో ఆనాడు తెహల్కా డాట్‌కామ్ జరిపిన స్టింగ్ ఆపరేషన్‌కు సంబంధించిన అంశాన్నే ఇతివృత్తంగా తీసుకొని అప్పటి ఎన్.డి.ఎ. ప్రభుత్వం తనను ఎన్నో రకాలుగా ఉంటాడని, ఆ రకంగా ఈ నవలన చాలా గొప్ప సంచలనాన్ని సృష్టిస్తుందని ప్రచురణ కర్తలు ఊహించడం వల్లనే ఇంత పెద్ద మొత్తం ఈ నవలకు చెల్లించి ఉంటారు.

ఇంగ్లీషులో రచించబడ్తున్న ఈ నవలలకివ్వాళ ఎంత డిమాండ్ ఏర్పడిందంటే ఈ వలల్ని మార్కెట్లో వేలం వేసి ఎవరు ఎక్కువ చెల్లిస్తే వాళ్ళకు అమ్మేస్తున్నారు. ఫ్రాంక్‌ఫర్ట్‌లాంటి మహానగరాల్లో జరిగే బుక్ ఫెస్టివల్స్‌లో ప్రపంచంలోని ప్రముఖ ప్రచురణకర్తలందరూ కలుసుకుంటారు. అక్కడే ఈ నవలల్ని వేలం పాటల ద్వారా ప్రచురణకర్తలు కొనుక్కుంటారు.

తరుణ్ తేజ్‌పాల్ రచించిన మొదటి నవల 'ది ఆల్కెమి ఆఫ్ డిజైర్'ను చదవాలని నేనెంతో ఉత్సాహపడ్డాను. ఈ నవల వెలువడిన కొత్తలో ఈ నవలను గూర్చిన సమీక్షల్ని నేను చదివాను. ఈ నవలలో ఇదివరకే రచయిత కూడా చెప్పడానికి సాహసించని ఎన్నో విషయాల్ని తరుణ్ తేజ్‌పాల్ చెప్పాడని సమీక్షకులన్నారు. దాంతో ఎంతో ఆశతో ఈ నవలను నేను ఇటీవలనే సంపాదించి చాలా ఆసక్తిగా చదివాను.

'లవ్ ఈజ్ నాట్ ది గ్రేటెస్ట్ గ్లూ బిట్వీన్ టు పీపుల్'. సెక్స్ ఈజ్" అన్న వాక్యంతో ప్రారంభమయ్యే ఈ నవల ప్రారంభంలో చాలా బావుందనే అనిపించింది. ఇద్దరు వ్యక్తుల్ని కలిపేది ప్రేమ కాదు. సెక్స్ అనడంతో చదివే వాళ్ళకెవరికైనా ఈ నవలను పూర్తిగా చదివేసెయ్యాలని ఆసక్తి కలుగుతుంది. కానీ ఆ ఆసక్తి ఎంతో సేపు నిలవదు. ఎందుకంటే రచయిత ఈ నవలనొక వ్యాసం గానో, జీవిత చరిత్ర లాగానో రాసుకుంటూ వెళ్ళిపోయాడే తప్ప నవలగా రాయలేక పోయాడు. ప్రధానంగా జర్నలిస్టయిన తేజ్‌పాల్‌కు నవలా శిల్పం పట్టుబడలేదని పించింది.

ఎవరి జీవితానికైనా శరీరమే ప్రధానమైంది. మేధస్సు కంటే శరీరం... శరీరం కోరుకునే కోరికలు... ఇవే ఏ వ్యక్తికైనా ఆనందాన్నిస్తాయి. మానవ జీవితాన్ని నడిపించే యంత్రం శరీరమే... శరీరానికొక దారిని చూపించడమే మేధస్సు చెయ్యాల్సిన పని. శరీరాన్ని తృప్తి పరచలేని వాళ్ళే ఆదర్శాలనూ, నీతులను వల్లించే వాళ్ళుగా మారిపోతారు. స్త్రీ పురుషుల శారీరక కలయికే గొప్ప ఆనందాన్ని కల్గిస్తుంది.

శరీరమే దేవాలయం - శరీరమే మన సుఖాలకైనా, దుఃఖాలకైనా మూలం. శారీరక కోరిక అనేది చాలా చిత్రమైంది. ఎందుకు కల్గుతుందో తెలీదు. ఎందుకు కల్గదో తెలీదు. ప్రేమ కల్గడానికి కూడా శరీరమే కారణమవుతుంది.

(I Know then that - those who have truely loved konw that - the key to the universe lies in the body of the lover)

ఇలా శరీరాన్ని... శరీరం ద్వారా జనించే శృంగారాన్ని ఆదర్శీకరించడమే ఈ నవలలో జరిగింది - ఈ సిద్ధాంతం కొత్తదేమీ కాదు. ఇంగ్లీషులో డి.హెచ్. లారెన్స్ తెలుగులో చలం యేనాడో తమ నవలల ద్వారా ఈ విషయాన్ని చెప్పారు.

'ది ఆల్కెమీ డిజైర్' నవలను రచయిత 'నేనూ' అంటూ ఉత్తమ పురుషంలో చెప్పాడు. నవలంతా ఈ నేనే కనిపిస్తాడు తప్ప వేరే పాత్రలేవీ కనిపించవు. 'ఫిజ్' అనే తన ప్రేయసితో ఈ 'నేను' జరిపిన ప్రేమ కలాపాల చిత్రణే ఈ నవలలో కనిపిస్తుంది. ఎంతో గాఢంగా ప్రేమించుకున్న వీళ్ళిద్దరూ కొంతకాలం తర్వాత విడిపోతారు. ఎందుకంటే అతని శరీరానికి ఆమె మీదున్న కోరిక అంతరించిపోతుంది. ఆమె ఎంత ప్రయత్నించినా అతని శరీరం ఆమె శరీరంతో కలిసిపోవడానికి సిద్ధపడదు. అతడు ఓ నవల రాయడం మొదలెట్టాడు. అతడా నవలను రాస్తున్న ఏడు రోజుల్లో రాత్రుళ్ళు ఆమెతో అతనికి గొప్ప సుఖం లభిస్తుంది. దాన్నతడు తను నవల రాస్తున్నందుకు లభిస్తున్న ప్రతిఫలంగా భావిస్తాడు. కొన్ని అధ్యాయాల వరకు సాగిన ఆ నవల ఆగిపోతుంది. అతడా నవల పూర్తి చేయలేకపోతాడు. రాయడం ఆగిపోవడంతో అతనికి ఆమె మీద కోరిక కూడా అంతరించిపోతుంది. ఇలా ఒక రచయితలోని సృజనాత్మకతకు, శృంగారానికి లంకె పెట్టడం ఈ నవలలోని కొత్తదనం.

ఈ నవలలో పాత్ర మధ్య జరిగే సంభాషణలు అతి తక్కువగా వున్నాయి. ఆ ఉన్న సంభాషణల్ని కూడా రచయిత ఇన్‌వర్టెడ్ కామాస్‌లో (" ") పెట్టకపోవడంతో ఏవి సంభాషణలో, ఏవి సంభాషణలు కావో పాఠకుడు తెలుసుకోలేకపోతాడు. ఇంచుమించు సంభాషణలనేవి లేకపోవడం వల్ల యే పాత్ర కూడా పాఠకుడ్ని ఆకట్టుకోలేదు.

మొత్తమ్మీద "ది ఆల్కెమీ ఆఫ్ డిజైర్" నన్ను చాలా నిరాశపరిచింది. తరుణ్ తేజోపాల్ ఈ నవలను కేవలం డబ్బుకోసమే రాశాడనిపించింది. నవలలు రాయడం మానేసి తేజోపాల్ జర్నలిజానికే అంకితమైతే దేశానికి మరింత సేవ చేసిన వాడవుతాడు.

ఇంగ్లీషులో 'పెంగ్విన్' హారర్ కొలీన్స్ లాంటి ప్రఖ్యాత అంతర్జాతీయ ప్రచురణ సంస్థలు ప్రచురించే నవలలకు మీడియాలో విపరీతమైన ప్రచారం జరుగుతుంది. ఒక భారీ సినిమా విడుదలకు ముందు ఎంత ప్రచారం జరుగుతుందో ఈ నవలల క్కూడా అంత ప్రచారం జరుగుతున్నది. దాంతో పాఠకులు ఈ నవలల్లో ఏదో ఉందనుకొని కొనేస్తారు. అలా ఈ నవలల్ని కొనడం ఎగువ మధ్యతరగతి వారికొక ప్రతిష్ఠాత్మకమైన చర్యగా (స్టేటస్ సింబల్) మారిపోయింది. ఈ కారణం వల్లనే ఐదారువందల పేజీల పర్యంతం సాగే ఈ నవలల్ని ఐదారు వందల రూపాయలు వెచ్చించి కొంటున్నవాళ్ళు ఈ నవలల్ని తమ డ్రాయింగ్ రూమ్స్‌లోని షెల్ఫ్‌లో పెట్టుకొని ఆనందిస్తున్నారే తప్ప చదివి ఆనందిస్తున్నారా? అనేది సందేహమే.



# బాల సాహిత్యం ఆధునీకరణ



**బాల సాహిత్యంలో ఎక్కువ భాగం మౌలిక విలువలపై బాలలకు అవగాహన కలిగించేందుకు రాజుల కథలను, పురాణ కథలను లేదా జంతువుల పాత్రగల పంచతంత్రం కథలను పునర్ముద్రిస్తు న్నారే తప్ప మారిన, మారుతున్న పరిస్థితుల నేపథ్యంలో 'మౌలిక విలువల' పై అవగాహన కలిగించే ప్రయత్నం చేయడం లేదు.**

## అరిబండి ప్రసాద్ రావు

సాహిత్య సృష్టి నిత్యం జరిగే ప్రక్రియ. తద్వారా మారిన, మారుతున్న పరిస్థితులను సాహిత్యం నిత్యం ప్రతిబింబిస్తుంది. నేడు తెలుగు బాల సాహిత్యం ప్రత్యేక పరిస్థితులను ఎదుర్కొంటుంది. అతి వేగంగా మారిన, మారుతున్న సామాజిక, ఆర్థిక పరిస్థితులు తెలుగు బాలసాహిత్యంలో ప్రతిబింబించటంలేదు. ముఖ్యంగా వస్తువు ఎంపికలో ఈ లోపాలు కొట్టొచ్చినట్లుగా అగుపడుతున్నాయి. అందువల్ల ఈ వ్యాసం ప్రధానంగా దీనిపైనే కేంద్రీకరిస్తుంది.

బాల సాహిత్యం ద్వారా మారిన, మారుతున్న పరిస్థితుల్ని బాలలకు ఎప్పటికప్పుడు అందించాలి. తద్వారా వారు భవిష్యత్తును సమర్ధవంతంగా ఎదుర్కొనేందుకు తయారు చేయాలి. దీన్ని దృష్టిలో పెట్టుకుని మన సమాజ మౌలిక విలువలపై 'అవగాహన' కల్పించాల్సిన అవసరం ఉంది. కానీ, బాల సాహిత్యంలో ఎక్కువ భాగం మౌలిక విలువలపై బాలలకు అవగాహన కలిగించేందుకు రాజుల కథలను, పురాణ కథలను లేదా జంతువుల పాత్రగల పంచతంత్రం కథలను పునర్ముద్రిస్తు న్నారే తప్ప మారిన, మారుతున్న పరిస్థితుల నేపథ్యంలో 'మౌలిక విలువల' పై అవగాహన కలిగించే ప్రయత్నం చేయడం లేదు.

ఉదాహరణకి మనం ఎంతో గౌరవించి, ప్రాధాన్యతను ఇచ్చే 'అబద్ధం ఆడరాదు' అనే మౌలిక విలువనే తీసుకుందాం. ఈ మౌలిక విలువ ఎప్పుడూ అవసరమే. కానీ, ఈ విలువను 'ఇప్పటి వాస్తవ పరిస్థితుల'పై ఆధారపడి బాలలకు అవగాహన కలిగించడం చాలా అవసరం. ఇప్పుడు మనల్ని డామినేట్ చేసి పాలిస్తున్న ఐడియాలజీ 'ప్రపంచీకరణ'. దీనిలో ఇమిడి ఉన్న కేంద్ర కీలక ప్రక్రియ 'వాస్తవాలను మరుగుపెట్టి మభ్యపెట్టడమే'. ఈ నేపథ్యంలో మన మౌలిక విలువైన 'అబద్ధం ఆడరాదు' ను బాలలకు చెప్పాలంటే మొదటి 'నిజమేమిటో' చెప్పి ఆ తర్వాత మభ్యపెట్టే వాతావరణంలో ఆ నిజాన్ని ఎలా గుర్తించాలో అని చెప్పగలిగే బాలసాహిత్య సృష్టిని చేపట్టాలి. ఇది బాలసాహిత్యాన్ని ఆధునీకరించడానికి చాలా అవసరం. ఈ దిశలో ఎన్ని బాల రచన లను చూస్తున్నాం? దాదాపు లేవనే చెప్పాలి.

ఇంకో ఉదాహరణ తీసుకుందాం. రాజుల కాలం చెల్లింది. 'ప్రజాస్వామ్య' విలువలు మీద ఆధారపడే వ్యవస్థ కొనసాగు తుంది. కానీ, ఈ ప్రజాస్వామ్య విలువలను, దాని ప్రాధాన్యతను చెప్పే బాలసాహిత్యం కనుచూపు మేరలో అంతగా కనపడదు. ఇంకా రాజుల కాలంనాటి కథలు, అప్పటి మానవ సంబంధాలే ఇప్పటి బాలసాహిత్యంలో ప్రతిబింబిస్తున్నాయి తప్ప ప్రజాస్వామ్య విలువలు ప్రతిబింబించటం లేదు. అందువల్ల, ప్రజాస్వామ్య విలువలతో కూడిన బాల సాహిత్యం సృష్టించి, ఆధునీకరించాల్సిన అవసరం ఉంది.

ఇప్పటికీ నాయకుడు/నాయకురాలు చుట్టూ తిరిగే బాలసాహిత్యం గణనీయంగా వస్తుంది తప్ప ప్రజల సామూహిక ఆలోచనను, అవసరాల్ని, పరస్పర సహకార తత్వాన్ని ప్రతిబింబించే బాల సాహిత్యం దాదాపు రూపొందించబడటం లేదంటే అతిశయోక్తి కాదు. ఏ నాయకుడో వచ్చి ప్రజల సమస్యలను తానంత తానే పరిష్కరిస్తాడని చెప్పే సాహిత్యమే బాలలకు అందుబాటులో ఉంది. కానీ, సామూహిక ఆలోచన, కార్యాచరణను చూపించే బాల సాహిత్యం దాదాపు లేదంటే అతిశయోక్తి కాదేమో. ఇలాంటి ఉదాహరణలను ఎన్నింటి నైనా ఇవ్వవచ్చు.

ఇదే సమయములో మన సంస్కృతిని గురించి బాలలకు చెప్పే పేరుతో 'పురాణ గాథలు' ఇప్పటి బాల సాహిత్యంలో పుంఖానుపుంఖాలుగా వస్తున్నాయి. ఈ కథల నేపథ్యం చెప్పడం లేదు. ఫలితంగా ఈ సాహిత్యం ప్రధానంగా బాలల్లో మూఢ విశ్వాసాలను పెంచే రూపంలో కొనసాగుతుంది. ఈ సాహిత్యంలో శాస్త్రీయ దృక్పథం ఏ మాత్రం ప్రతిబింబించడం లేదు. ఉదాహరణకు ఈ కథల్లో సూర్యుడు, చంద్రుడులను దేవతలుగానే చూపిస్తున్నారు. వీని విషయంలో బాల సాహిత్యంలో శాస్త్రీయ దృక్పథం కలిగించడం లేదు. సైన్స్ ఆధారిత సాహిత్యంలో సూర్యచంద్రులపై, గ్రహణాలపై కొంత శాస్త్రీయ అవగాహన కలిగిస్తున్నప్పటికీ నేటి బాల సాహిత్యం మొత్తం మీద శాస్త్రం వేరు. మన సంస్కృతి వేరు అనే భావన కలిగిస్తూ పెరిగే బాలల్లో మూఢ విశ్వాసాలే వేళ్ళూనుకుంటున్నాయి తప్ప శాస్త్రీయ అవగాహనను జీవితంలో భాగంగా మార్చటం లేదు. ఈ విషయంలో బాలసాహిత్యాన్ని ఆధునీకరించాల్సిన అవసరం ఉంది.

ఈ ధోరణులు ఒకవైపు కొనసాగు తుండగా 'మానవ విలువల' కు బదులుగా మార్కెట్ విలువలు, వినిమయదారుల సంస్కృతిని ప్రతిబింబించే బాల సాహిత్యం ఆధునిక బాలసాహిత్యం పేరుతో పుంఖాను పుంఖాలుగా నేడు బాలలకు అందుబాటులోకి తేబడుతున్నది. ఈ విషయంలో టి.వి.లు గణనీయమైన పాత్రను వహిస్తున్నాయి. బాల సాహిత్య ఆధునీకీకరణలో మార్కెట్, వినిమయ సంస్కృతుల కంటే మానవ విలువలే గొప్పవని చాటిచెప్పే బాలసాహిత్యాన్ని రూపొందించాలి. కానీ, ఇప్పటి బాలసాహిత్యం ఈ కర్తవ్యాన్ని ఏ మేర నిర్వర్తించగలుగుతుంది?

పొదుపుగా గడపడం, నిరాడంబర జీవితం మన మౌలిక విలువల్లో ఒక ప్రధాన భాగం. వీనికి బదులుగా నేడు మనం బాలసాహిత్యం రూపంలో చూస్తున్నది 'విశృంఖల వినియమ సంస్కృతి విలువలే' అదీ 'రుణం' ఆధారంగా (క్రెడిట్ కార్డు సంస్కృతి) కొనసాగించే

వినిమయ సంస్కృతిని మాత్రమే బాలలకు చూపెడుతున్నారు.

బాలల టి.వి. ఇతర కార్యక్రమాలలో, ఇతర మాధ్యమాల ద్వారా 'జంక్ ఫుడ్స్' తినడాన్ని గొప్పగా చూపిస్తున్నారు. ఈ ధోరణిని వ్యతిరేకిస్తూ ఆరోగ్యకరమైన ఆహారపు అలవాట్లను ప్రోత్సహించే బాల సాహిత్య రూపకల్పన చేయాల్సిన అవసరం ఉంది.

'అన్నం' (తిండి) మన సంస్కృతిలో 'పరబ్రహ్మ స్వరూపంగా భావిస్తాం, గౌరవిస్తాం. ఎట్టి పరిస్థితుల్లో తినే పదార్థాలను వృధా చేయం . ఇలా వృధా చేయడం మన సంస్కృతి కాదు. కానీ, బాలల కార్యక్రమాలలో 'వినోదం' పేరుతో టి.వి.లో చూపిస్తున్నది తినే లేదా తాగే పదార్థాలతో ఆడుకుంటూ వృధా చేయడం. ఇతర మాధ్యమాలలో కూడా ఈ సంస్కృతి ఎంతో కొంత ప్రతిబింబిస్తుంది. ఈ కొత్తగా వస్తున్న 'ఆధునిక' బాల సాహిత్యంలో మానవుడు ఎక్కడ? మానవత్వ విలువలెక్కడ? ఎక్కడా ఇవి కనపడవు. ఈ తీవ్ర లోపాన్ని నూతన బాల సాహిత్యంలో అధిగమించాలి.

ఇక సమాజం యెడల పూర్తిగా అవగాహన కలిగించే ఆధునిక బాల సాహిత్యాన్ని చూడలేకపోతున్నాం.ఈ నేపథ్యంలో మారిన, మారుతున్న బాల సాహిత్య రూపకల్పనలో సామాజిక విలువలు, ప్రయోజనాలు దాదాపు కనపడడం లేదంటే అతిశయోక్తి కాదేమో. ఇలా ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చు. ఈ విపరీత ధోరుణులు కొనసాగుతుండగా రెండోవైపు 'ఆధునిక బాల సాహిత్యం పేరుతో డైనోసిరస్ లాంటి నేడు కంటికి కనిపించని జంతువులను గురించి, అతిశయోక్తులతో కూడిన బ్యాట్‌మెన్, సూపర్ మేన్ క్యారక్టర్స్‌ను, ఆకాశయానం, ముఖ్యంగా రాకెట్ యానం, గ్రహాంతర ప్రయాణం లాంటి అంశాలను చెవులు చిల్లుపడేలా చెపుతున్నాం. కానీ, నిత్యం భూమ్మీద కనపడే జంతువులు, చెట్లు చేమలు, వాస్తవ ప్రపంచం ఆధారంగా బాల సాహిత్యాన్ని అదే మేర సృష్టించబడటం లేదు. పరిశుభ్రత, ప్రకృతి పర్యావరణ శాస్త్రంలో గత ఏభై, అరవై ఏళ్ళుగా వచ్చిన మార్పులను, అనుభవాలను బాల సాహిత్యంలో ఇమిడ్చి, వాస్తవ ప్రపంచాన్ని బాలలకు అందించ లేకపోతున్నాం. ఈ ధోరణి బాల సాహిత్య ఆధునికతకు ఎలా దోహదపడుతుంది?

జనరల్ నాలెడ్జ్ రూపంలో వచ్చే ఆధునిక బాల సాహిత్యం బాలలందరికీ కాకుండా

— — — — — * * * — — — — —

**వ్యక్తిత్వ వికాసం పెంపొందించే పేరుతో వచ్చే బాలసాహిత్యం సమాజాన్ని నియంత్రించే వర్గానికి చెందిన కొంత మందిని వ్యక్తిగతంగా అభివృద్ధి పరిచేందుకు దోహద పడుతుంది. అంతేగాని, బాలలను సమాజంలో భాగస్వామ్యం కలిగిన వ్యక్తులుగా అభివృద్ధి పరిచే రీతిలో వ్యక్తిత్వ వికాస సాహిత్యం బాలలకు అందుబాటులో లేదు.**

— — — — — * * * — — — — —

నిత్య జీవితానికి సంబంధం లేనివి, కొన్ని ప్రత్యేక వర్గాలకు మాత్రమే ప్రయోజనం కల్గించే రూపంలో నేడు ముందుకు వస్తుంది. ఆటలు 'వస్తువుగా' వచ్చే బాల సాహిత్యంలో క్రికెట్ లాంటి ఒకటి రెండు ఆటలకే ప్రాధాన్యత లభిస్తుంది తప్ప, ఆటలకు సంబంధించిన బాలసాహిత్యం మొత్తం మీద బాలల్లో ఆటలపై ఆకర్షణను పెంచే విధంగా, వారు ప్రతిరోజూ ఆడుకునే విధంగా రావటం లేదు. వాణిజ్య, వ్యాపార వర్గాలకు అవసరమైన ఆటల ప్రాధాన్యతను తెలిపే బాల సాహిత్యమే రూపొందించబడుతుంది.

వ్యక్తిత్వ వికాసం పెంపొందించే పేరుతో వచ్చే బాలసాహిత్యం సమాజాన్ని నియంత్రించే వర్గానికి చెందిన కొంత మందిని వ్యక్తిగతంగా అభివృద్ధి పరిచేందుకు దోహద పడుతుంది. అంతేగాని, బాలలను సమాజంలో భాగస్వామ్యం కలిగిన వ్యక్తులుగా అభివృద్ధి పరిచే రీతిలో వ్యక్తిత్వ వికాస సాహిత్యం బాలలకు అందుబాటులో లేదు.

## సామెతల సాహిత్యం

సామెతలు పెద్దల అనుభవసారాన్ని కలిగి ఉంటాయి. వీని నుండి బాలలు ఎంతో నేర్చుకోవాల్సిన అవసరం ఉంది. ఎంత క్లిష్టమైన అంశానైన్నా తగిన సామెతను ప్రయోగించి తేలికగా అవగాహన కలిగించ వచ్చు. దీనికై ఆయా సామెతల పూర్వాపరాలపై బాలలకు పూర్తి అవగాహన కలిగించాలి. దీనిపై ఇంతవరకు ప్రచారంలో ఉన్న కథలు సామాజిక పరిస్థితులు బాగా మారడంతో ఆయా సామెతలపై పూర్తి అవగాహన కలిగించే రూపంలో లేవు. అందువల్ల ఈ సాహిత్యాన్ని తాజా పరచవలసిన అవసరం ఉన్నది.

## వస్తువు ఎంపిక

ఇది చాలా ముఖ్యం. ఈ ఎంపిక మన అభిరుచిని బట్టి గాక బాలల అవసరాల్ని(న్ని) తీర్చేవిధంగా ఉండాలి. ఆ తరువాత, ఎంపిక చేసిన వస్తువుపై అన్ని కోణాల నుండి లోతుగా అధ్యయనం చేయాలి. బాలలకు అందించాల్సిన వివిధ పార్శ్వాలను గుర్తించి వివిధ పార్శ్వాలకు ఇవ్వాల్సిన ప్రాధాన్యతను ముందుగానే నిర్ధారించుకోవాలి. సంఖ్యావివరాలు, ఇతర సమాచార వివరాల కన్నా అవగాహన కలిగించే రూపంలో సాహిత్య రూపకల్పన ఉండాలి.

గతంలో కన్నా ఇప్పటి బాలల్లో వర్గ విభజన తీవ్రస్థాయిలో ఉంది. ఎంపిక చేసుకున్న వస్తువు సాధ్యమైనంత విస్తృత వర్గాల బాలలకు అందుబాటులో ఉండేలా జాగ్రత్త వహించాలి. ముఖ్యంగా, అభివృద్ధిలో భాగస్వామ్యం లేనివారిని చైతన్య పరిచే రూపంలో వస్తువు ఎంపిక ఉండాలి.

## రూపం

ఎంపిక చేసుకున్న వస్తువు, సందర్భాన్ని బట్టి రూపాన్ని ఎంచుకోవాలి. ఒకే వస్తువును సందర్భాన్ని బట్టి రెండుమూడు రూపాల్లో చెప్పవచ్చు.

కథలంటే చెవి కోసుకుంటారు బాలలు. అదే విధంగా ముద్దు ముద్దు మాటలతో బాలలు పాటలు పాడితే వచ్చే ఆనందం విజ్ఞానం ఏ భాషా పూర్తిగా వర్ణించలేదు. అందువల్ల కథలకు, చిన్న చిన్న పాటలకు , జోక్‌లకు బాల సాహిత్య రూపంలో ప్రాధాన్యతనివ్వాలి. నానీలు, మినీ కవితలకు బాల సాహిత్యంలో ప్రత్యేక ప్రాధాన్యతనివ్వాలి. కొన్ని ప్రత్యేక సందర్భాలలో నాటికలు కూడా బాలలను బాగా ఆకర్షిస్తాయి. తోలుబొమ్మలు, కార్టూన్‌లు, బాలసాహిత్య వ్యాప్తిలో ప్రత్యేక ప్రాధాన్యత కలిగి ఉన్నాయి. ఏ సాహిత్యమైనా బాలలకు నేరుగా నేర్చుకునేందుకు సూటిగా, సాధ్యమైనంత క్లుప్తంగా ఉండాలి. మాటల పొదుపు చాలా అవసరం. దీర్ఘ కథలు, కవితలు, నవలలను చదవడంలో లేదా పాడడానికి బాలలు ఉత్సాహం చూపరు.

## శిల్పం

బాల సాహిత్య శిల్పంలో లయ చాలా ముఖ్యమైనది. శబ్ద సౌందర్యానికి ప్రాధాన్యత ఇవ్వాలి. అదే సమయంలో శబ్ద సౌందర్యం కోసం కఠినమైన పదాలను వాడకుండా రోజూ వాడే పదాలతోటే భావాన్ని వ్యక్తీకరించాలి. లయ కోసం ఏ అర్థమూ లేని 'డుం డుం' వంటి శబ్దాలను అవసరాన్ని బట్టి మొదట, మధ్య మధ్య లేదా చివరలో చేర్చవచ్చు. ●

# సామాజిక చైతన్యాన్ని పంచిన నాటక సాహిత్య సదస్సులు

అమ్మిన శ్రీనివాసరాజు




'చర్ల' లో నిర్వహించిన 'నాటకం - సమాజం' సదస్సులో ప్రసంగిస్తున్న ప్రముఖ రంగస్థల కళాకారుడు కె.యస్.టి. శాయి

ఖమ్మం జిల్లా చర్లలో నందీశ్వరుడు స్మారక నాటక సంస్థవారు సప్తమ నాటకోత్సవ సంబరాలు నిర్వహించారు. ఈ సందర్భంగా రాహుల్ విజ్ఞాన్ స్కూల్‌లో డాక్టర్ డి.ఎన్. కుమార్ చొరవతో ఏప్రిల్ 11, 12 తేదిలలో "నాటకం, సమాజం" శ్రీశ్రీ మహా ప్రస్థానం అనే అంశాలపై సాహిత్య సదస్సులు నిర్వహించారు.

నవలా రచయిత్రి శ్రీమతి రావులపల్లి సునీత అధ్యక్షతన జరిగిన "నాటకం, సమాజం' సదస్సులో ప్రముఖ రంగస్థల రచయిత, దర్శకులు కె.యస్.టి. శాయి, విద్యావేత్త యస్.వి. నారాయణలు ప్రసంగిస్తూ ఆధునిక సమాజంలో సమున్నత కళగా నాటకరంగం ఎదగాల్సిన అవసరం ఇంకా వుందన్నారు. మనిషిని మనిషిగా చూపించే ఈ నాటక రంగం సామాజిక ఇతివృత్తాలతో సందేశాలను పంచుతున్నా, అవన్నీ ఒక మూసలో పడి కేవలం పరిషత్ పోటీల్లో పాల్గొని బహుమతులు అందుకోవడమే లక్ష్యంగా ముందుకు సాగుతున్నాయిని నేటి నాటకాల్లో కేవలం సంభాషణల పటిమతోనే నాటకాలను రక్తి కట్టించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. తప్ప భావయుక్తమైన అభినయాలకు కృషి జరగడం లేదని కళాకారులంతా అందుకోసం కృషి చేయాలన్నారు.

కేవలం పరిషత్ నిర్వహణల ప్రోత్సహమే నాటక రంగ మనుగడకు సరిపోదని రాష్ట్ర ప్రభుత్వం కూడా నంది నాటకోత్సవాలతో సరిపెట్టుకోకుండా మండల స్థాయిల్లో గల కళాకారులకు తగిన శిక్షణ ప్రోత్సహాలు కల్పించి ఆడిటోరియంలు కూడా నిర్మించాల్సిన కనీస తక్షణ కర్తవ్యాన్ని గుర్తు చేస్తారు.



సందేశమిస్తున్న ఎం.పి. డా॥ ఎం. బాబూరావు. వేదికపై నారాయణ తెలకపల్లి రవి, డా॥ ప్రతిభ, చేకూరి కాశయ్య, దేవేంద్ర, సునీత

నాటక రంగ వెనుకబాటుకు గల కారణాలను అభివృద్ధి చేయాల్సిన కృషి గురించి ఈ సదస్సులో వక్తలు పలు కోణాలనుండి అభిప్రాయాలు వెలువరించారు.

ఏప్రిల్ 12 న జరిగిన శ్రీశ్రీ మహాప్రస్థానం సాహిత్య సదస్సుకు స్త్రీ వైద్య నిపుణులు, చిత్రకారిణి అయిన డా॥ ప్రతిభ అధ్యక్షత వహించారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి ప్రధాన వక్తగా పాల్గొని శ్రీశ్రీ మహా ప్రస్థానం ఆధారంగా శ్రీశ్రీ సాహిత్య జీవితాన్ని సవివరంగా దర్శింపచేసారు.

సామాజిక చైతన్యానికి శ్రీశ్రీ సాహిత్యం సంజీవిని వంటిదని అభిప్రాయపడ్డారు.

నవ సమాజ స్థాపనకు ప్రతి పౌరుడూ మానవతా విలువలు చూపుతూ కష్టజీవుల కడగండ్లు చూసే దిక్సూచి "మహా ప్రస్థానం" విధిగా చదివి స్ఫూర్తి పొందాలని ప్రతి ప్రాణికి స్వేచ్ఛ అవసరం అని అది పొందడానికి ఈ సాహిత్యం ఎంతగానో సహకరించగలదనే సత్యం నేటి యువత అర్థం చేసుకోవాలన్నారు.

శ్రీశ్రీ సాహిత్య జీవితాన్ని వ్యక్తిగత జీవితంలో అన్వయించుకొని కలత చెందాల్సిన అవసరం లేదని ఆయన సాహిత్య సందేశాన్ని ఆదర్శంగా తీసుకోవాలి అని శ్రీశ్రీ అభిమానులకు భరోసా అందించారు.

భద్రాచలం పార్లమెంటు సభ్యులు డా॥ మిడియం బాబూరావు సందేశమిస్తూ సాహిత్య చర్చ, కళాభిరుచికి వేదిక కల్పించిన నిర్వాహకులను అభినందించారు. సీనియర్ కవి మాల్యశ్రీ సమన్వయకర్తగా వ్యవహరించిన ఈ సదస్సులో గేయ రచయిత దేవేంద్ర. మాజీ జడ్పి చైర్మన్ చేకూరి కాశయ్య, మాజీ యం.యల్. ఏ. కుంజా బుజ్జి, డా॥ డి.యన్. కుమార్, నారాయణ, సి.వి.కె.రావు, రౌతురవి, జి. గోపాలకృష్ణ, అమ్మిన, సి.వి.ఆర్.జి. స్వామి, ఐ.వి.టి.వి. చలం, యన్.సిహెచ్. చక్రవర్తి తదితర సాహితీవేత్తలు పాల్గొన్నారు. ●

# అలరించిన ఉగాది కవి సమ్మేళనం

రవితేజమ్ దినపత్రిక ఆధ్వర్యంలో హైదరాబాద్ అలకాపురి కాలనీ సాయి ఫంక్షన్‌హాల్‌లో ఏప్రిల్ నెల 6వ తేదీన ఉగాది సందర్భంగా కవి సమ్మేళనం జరిగింది. తొలుత నేతి వెంకటరమణశర్మ సభకు స్వాగతం పలుకగా చిన్నారి సంగీత ప్రార్థనా గీతం ఆలపించారు. ఈ కార్యక్రమానికి రవితేజమ్ ప్రధాన సంపాదకులు భూపతి రవీంద్రనాద్ ముఖ్య అతిథిగా పాల్గొనగా, తన అధ్యక్షోపన్యాసంలో అనేక ఛలోక్తులు విసురుతూ సభను రక్తి కట్టించారు. ఆయన తన కవితలో "వెన్నెల వెలుగులను ఎన్ని వేల గొడ్డళ్లతో నరకాలనుకుంటున్నావు. రజాకారుల దురాగతాలను మరచిన చిన్నన్నా అంటూ తెలుగు తల్లికి జై అని ఆలపించారు.

ప్రకృతి, రుతువులు, షడ్రుచుల ఉగాది పచ్చడి సేవించడం వల్ల అంషడ్వర్గిములపై ప్రభావమును ఉగాది ప్రాసస్త్యమును వచన కవిత ఉగాదిలో తెలియజేశారు గురజాడ అప్పారావు.

కవయిత్రి డి. పంకజా మల్లిక్ 'ముస్తాబు' అనే తన కవితలో 'ఎందుకే ఆంధ్రనూ ముస్తాబు అవుతున్నావు కోత వసంతం వస్తున్నందుకా/ ఏడాది పొడవునా జరిగిన ఘనకార్యాలకా అని గతంలో జరిగిన కష్ట - నష్టాలను వివరించారు. సత్యభాస్కర్ తన కవిత 'రాంగ్ అడ్రస్'లో 'సర్వధారి ఉగాది మా పట్టణానికి ఎందుకొచ్చావమ్మా?/ మేమేనాడో యంత్రాలమయ్యామ్. ఇక్కడి మానవత్వం అంగడి సరుకైయంది.' అని ఉగాదిని ప్రశ్నించాడు. తంగిరాల చక్రవర్తి తన కవితలో 'షడ్రుచుల్ని జీవితంలో నింపే నీవు విశ్వ శ్రామిక హితైషివి కావాలమ్మా!!!" అని రాబోయే కాలంపట్ల తన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. ఆశ్లేష జి. సుబ్బారావు 'పంచె' అనే కవితలో 'హోమంలో అగ్ని ఆజ్యం పోయలేవు నిండుగా, బ్రాహ్మణుల ద్వారా వేదమంత్రాలు వినలేవు ధీటుగా. మండపంలో భజంత్రీలు మ్రోగలేవు జోరుగా అని విచ్ఛిన్నమౌతున్న భార్యా భర్తల అనుబంధాన్ని గురించి వివరించారు. పి.వి. సుబ్బారావు ' ఈ అనంత పాశ్చాత్య సంస్కృతి ప్రవాహంలో/ కొట్టు కొచ్చిన అవశేషపు విషనాగులను/ ఒదిమి పట్టి ఇముడ్చుకున్న నాగరికతకు/ ఈ ఉషస్సులూ, ఉగాదులు ఎక్కడ కనిపిస్తాయి' అని పాశ్చాత్య నాగరికతలో పండగలు ఎలా కొట్టుకుపోతున్నాయో వివరించారు. పూసల రజనీ గంగాధర్ తన పద్యకవితను చదివి సభను అలకరించారు. భృగుబండ చంద్రిక, నాంపల్లి సుజాత, ఆచార్య నరేంద్ర, వసంతరావు ఉగాది ప్రాశస్త్యాన్ని వివరించే కవితలను చదివి సభను అలరించారు.

తదనంతరం రవితేజమ్ ప్రధాన సంపాదకులు భూపతి రవీంద్రనాథ్ మాట్లాడుతూ తమ తెలుగు భాషను ప్రాచీన భాషగా గుర్తింపు తేవాలంటే కవులు, రచయితలు, పత్రికలు పోరాటం చేయవలసిన అవసరం ఉన్నదని అన్నారు. పొత్తూరి సుబ్బారావు వందన సమర్పణతో సమావేశం ముగిసింది.

# ఉగాది సాహితీ పురస్కారాలు

విశ్వసాహితి సాహిత్య సాంస్కృతిక సేవాసంస్థ 2007 సంవత్సరములో ప్రచురింపబడిన వివిధ గ్రంథాలలో ఉత్తమ రచనలను ఎంపిక చేసి ప్రచురింపబడిన వివిధ గ్రంథములలో ఉత్తమ రచనలను ఎంపిక చేసి సర్వధారి ఉగాది ఉత్తమ సాహిత్య పురస్కారాలను అందజేసింది. ఏప్రిల్ 9న త్యాగరాయగాన సభలో జరిగిన ఈ కార్యక్రమానికి జ్ఞానపీఠ అవార్డు గ్రహీత పద్మభూషణ్ సి. నారాయణరెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొని పురస్కారాలు అందజేశారు. విశ్వసాహితి వ్యవస్థాపక అధ్యక్షులు కళాప్రపూర్ణ కా. పోతుకూచి సాంబశివరావు అధ్యక్షత వహించగా డా. కృష్ణారావ్ కేశవ్ గానసభ అధ్యక్షులు కళా వేంకట దీక్షితులు ఆత్మీయ అతిథులుగా పాల్గొన్నారు. 82 గ్రంథాలు పరిశీలనలోకి వచ్చాయి. శ్రీ పెద్దూరి వెంకటదాసు రచించిన లేడీ కండక్టర్ కథల విభాగంలోనూ, గురజాడ అప్పారావు రచించిన పరాన్న జీవులు నాటిక విభాగంలోనూ, పొత్తూరి సుబ్బారావు రచించిన పిచ్చుకగూడు వచన కవితల విభాగంలోనూ, డా కోటేవెంకటాచార్యులు రచించిన గయోపాఖ్యానం విమర్శవిభాగంలోను శ్రీమతి చెన్నుపాటి లక్ష్మీవర్మ రచించిన వారి నవలా విభాగంలోనూ, డా॥ జి. సీత రచించిన భక్తి గేయాలు ఆధ్యాత్మిక రచన విభాగంలోనూ ఉత్తమ రచనలుగా ఎంపికయ్యాయని అని డా॥ పోతుకూచి సాంబశివరావు తెలియ జేశారు. అనంతరం ముఖ్య అతిధి ఆయా రచయితలను ప్రశంశా పత్రము, జ్ఞాపికలతో పాటు దుశ్శాలువాలతో సన్మానించి సత్కరించారు.

# కార్మిక లోకం కథల పోటీ

కార్మికులను చైతన్యపరుస్తూ క్రమం తప్పకుండా గత పది సంవత్సరాలుగా వెలువడుతున్న 'కార్మిక లోకం' మాస పత్రిక కథల పోటీని ప్రకటించింది. దేశవ్యాప్తంగా రుద్దబడుతున్న ఆర్థిక విధానాల వల్ల అతలాకుతలం అవుతున్న అసంఘటిత శ్రామిక ప్రజల పరిస్థితులను అద్దంపట్టే కథలను పోటీకి ఆహ్వానిస్తున్నది. ఈ కథల పోటీకి మే 14 చివరి తేది. కథలకు మొదటి బహుమతి రూ. 5000/- రెండవ బహుమతి రూ. 3000/- మూడవ బహుమతిగా రూ. 2000/- ప్రకటించారు. వచ్చిన కథలలో ఎంపికచేసిన వాటితో కథా సంకలనం కూడా ప్రచురించబడుతుంది. గత సంవత్సరం పోటీలో వచ్చిన కథలతో 'తిరగబడ్డ పొరకలు' కథా సంపుటి కార్మికలోకం వెలువరించిన సంగతి విధితమే. అసంఘటిత కార్మికుల వెతలను రికార్డు చేసిన మంచి పుస్తకంగా ఈ కథల సంపుటికి విమర్శకుల ప్రశంసలు లభించాయి. ఈ కథల పోటీలో పెద్దయెత్తున కథకులు పాల్గొని విజయవంతం చేయాల్సిందిగా నిర్వాహకులు కోరుతున్నారు. కథలను పంపించవలసిన చిరునామా: కథల పోటీ, ఎడిటర్, కార్మికలోకం మాసపత్రిక, ఇం.నెం. 1-7-139/44, ఎన్‌విబి స్మారక కేంద్రం, ఎస్.ఆర్.కె. నగర్, రిసాలగడ్డ, జమిస్తాన్‌పూర్, ముషీరాబాద్, హైదరాబాద్-500 020, ఫోన్: 040-27612474

## సోమేపల్లి వెంకట సుబ్బయ్యకు సోమిరెడ్డి జమున స్మారక రాష్ట్ర స్థాయి అవార్డు

సోమిరెడ్డి జమున స్మారక అవార్డు 2007 కోసం సోమేపల్లి వెంకటసుబ్బయ్య "నానీల" సంపుటి 'పచ్చని వెన్నెల' ఎంపికయినట్లు, నెల్లూరు రచయితల సంఘం గౌరవాధ్యక్షులు డా॥ పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి ఒక ప్రకటనలో తెలియజేసారు.

ఈ అవార్డు న్యాయ నిర్ణేతలుగా ఉస్మానియా యూనివర్శిటీ టీచర్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్ ప్రొఫెసర్ మసన చెన్నప్పగారు, కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖ ప్రొఫెసర్ రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డిగారు, కవి, విమర్శకులు, సమీక్షలు డా॥ రఘు (ఖమ్మం) గార్లు వ్యవహరించారు.

అవార్డు పొందిన కవి సోమేపల్లి వెంకటసుబ్బయ్య గుంటూరు జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్, మూడు నానీల సంపుటలను ఆవిష్కరించిన నానీల కవి. వీరి "పచ్చని వెన్నెల" సమాజాన్ని అద్దంలో స్పష్టంగా చూపిన కవితా సంకలనం. రచయిత్రి సోమిరెడ్డి జమున స్మారక తొలి అవార్డు సోమేపల్లి వెంకటసుబ్బయ్యకు లభించడం ముదావహం అని అవార్డు ప్రతిష్ఠాపకులు డా॥ జయప్రద పేర్కొన్నారు.

సోమిరెడ్డి జమున స్మారక అవార్డు ప్రధానోత్సవ సభ మే 11వ తేదీన ఆదివారం నెల్లూరు రచయితల సంఘం (నె.ర.సం) ఆధ్వర్యంలో ఇండియన్ మెడికల్ అసోసియేషన్ ఎ.సి.హాలులో జరుగుతుంది, కవికి మూడు వేల రూపాయల నగదు బహుమతితో సత్కరిస్తారని, అదే రోజున రెండో సభలో డాక్టర్ పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి కవితా సంపుటి "ప్రవహించేకాలం" ఆవిష్కరింపబడుతుందని, మూడో సభలో ఊరుబిండి సుబ్రహ్మణ్య శాస్త్రికి పద్యకవి సత్కారం, నానీల కవి సమ్మేళనం, పత్ర సమర్పణ కార్యక్రమం వుంటుందని డా॥ జయప్రద ఒక ప్రకటనలో తెలియజేసారు.

<u>నానీల కవులు సంప్రదించవలసిన చిరునామా</u>

**పాతూరి అన్నపూర్ణ, ప్రముఖ కవయిత్రి,**

**నెరసం మహిళా విభాగం, సెల్ : 9490230939**

## 'సాయిబు' కు పురస్కారం

షేక్ కరీముల్లా రాసిన 'సాయిబు' దీర్ఘకవితకు కళాలయ సాంస్కృతిక సంస్థ, పాలకొల్లు (ప.గో.జిల్లా) 2008వ సంవత్సరానికి "జాతీయ కళాలయ విశిష్ట పురస్కారం ప్రకటించింది. 'తెలుగు భాషా వైభవం' పేరుతో జరిగే సాహిత్య సదస్సులో కవికి ఈ పురస్కారం అందజేయనున్నట్లు సంస్థ వ్యవస్థాపకులు పాలపర్తి శ్రీధర్ తెలియజేశారు.

## మే 11న నల్గొండలో 'జన కవనం'

నల్గొండ పట్టణంలో సిఐటియు రాష్ట్ర మహాసభల సందర్భంగా మే11వ తేదీన సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో 'జన కవనం' జరుగుతుంది. శ్రమ జీవుల పోరాటాలకు నిరంతరం సంఘీభావంగా నిలిచే సాహితీ స్రవంతి గతంలో నిర్వహించిన జన కవనం, సాహిత్య శాల వంటివి ప్రగతిశీల కవులు రచయితల విశాల సమీకరణకు ఎంతగానో దోహదం చేసిన సంగతి మీకు తెలుసు. అదే రీతిలో ఇప్పుడు వీర తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట కేంద్రమైన నల్గొండలో జరిగే ఈ జన కవనంలో పాల్గొన వలసిందిగా లౌకిక ప్రజాస్వామిక సాహితీ మిత్రులందరినీ ఆహ్వానిస్తున్నాం. జిల్లా పరిషత్ హాలులో మే11 ఉ.10 గం. నుంచి రాత్రి వరకూ జన కవనం కొనసాగుతుంది. ప్రసిద్ధ నవలా రచయిత అంపశయ్యా నవీన్ ప్రారంభిస్తారు. ఈ సందర్భంగా పుస్తకావిష్కరణ, ఎగ్జిబిషన్ ప్రారంభ కార్యక్రమాలను బోయజంగయ్య, నరహరి, నోముల సత్యనారాయణ తదితరులు ప్రారంభిస్తారు. అక్కడే రచయితలకు భోజన సదుపాయం వుంటుంది. వచ్చిన కవితలను పుస్తకంగా తెచ్చే ప్రయత్నం జరుగుతుంది. ఈ కార్యక్రమంలో పాల్గొన దలచిన సాహితీ మిత్రులు తమ వివరాలను కింది ఫోన్ నెంబర్లకు తెలియజేయవచ్చు.

కె.లక్ష్మయ్య- 94900 99057, వొర ప్రసాద్-94900 99059, భూపతి వెంకటేశ్వర్లు- 94900 98343.నల్గొండలో తొలిసారిగా జరుగుతున్న ఈ జన కవనం జయప్రదం చేయవలసిందిగా కోరుతున్నాం.

**- తెలకపల్లి రవి**

**రాష్ట్రకన్వీనర్,సాహితీ స్రవంతి.**

## బాల సాహిత్యంపై కవి సమ్మేళనం

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ప్రతీ నెలా జరుగుతున్న కవి సమ్మేళనంలో భాగంగా ఏప్రిల్ 13 ఆదివారం నాడు బాల సాహిత్యం అంశంతో కవి సమ్మేళనం నిర్వహించబడింది. ఈ సందర్భంగా 'మామయ్య' బాలల మాసపత్రిక సంపాదకులు అరిబండి ప్రసాదరావు గారు బాల సాహిత్యం తీరుతెన్నులపై సమగ్రమైన ఒక వ్యాసాన్ని సభికులకు చదివి వినిపించారు. నేడు బాలలను ఉద్దేశించి వస్తున్న సాహిత్యాన్ని ప్రస్తావిస్తూ మరింత సమగ్రంగా విస్తృరీతిలో బాల సాహిత్యం రావాల్సిన ఆవశ్యకతను పలువురు కవులు తమ కవితల ద్వారా ఆకాంక్షించారు. బాల సాహిత్యంలో కృషి చేసిన అనేక మంది రచయితల గురించి తంగిరాల చక్రవర్తి ఒక వ్యాసం చదివి విన్పించారు. బాల సాహిత్యంలో మూఢనమ్మకాల, అశాస్త్రీయ ధోరణులను ప్రస్తావిస్తూ జి. నరసింహమూర్తిగారు వ్యాసం చదివి వినిపించారు. బాలల గురించిన తపనతో రాసిన పలు కవితలు అందరినీ ఆకట్టుకున్నాయి. ఈ కార్యక్రమంలో ప్రస్థానం సంపాదకవర్గ సభ్యులు మోతుకూరి నరహరి, సాహితీ స్రవంతి నగర కన్వీనర్ సత్యభాస్కర్, తంగెళ్ళపల్లి కనకాచారి, జి. సుబ్బారావు(అశ్లేష), ఆలువాల సురేష్, శాంతారావు, విప్లవదత్ శుక్లా, కె. లక్ష్మణరావు, శిల్పాజగదీష్, శ్రీవాత్సవ, నారాయణ, రజనీ గంగాధర్, వొరప్రసాద్, మల్లేష్ తదితరులు ఈ కవి సమ్మేళనంలో పాల్గొన్నారు. మే నెలలో జరిగే కవిసమ్మేళనానికి 'అధిక ధరలు' అంశాన్ని నిర్వాహకులు ప్రకటించారు.

# మహజబిన్‌కు రాజీవ్‌గాంధీ జాతీయ అవార్డు

ప్రముఖ కవయిత్రి మహజెబిన్ ఇటీవల కేంద్ర ప్రభుత్వ రాజీవ్‌గాంధీ జాతీయ అవార్డు పొందారు. సుమారు దశాబ్దకాలంగా పాతబస్తీలో పేద కుటుంబాలలోని పిల్లలు, బాల శ్రామికుల కోసం చేస్తున్న కృషికి గుర్తింపుగా ఈ అవార్డు ప్రకటించారు. సాహిత్య రంగంలో స్త్రీవాద కవయిత్రిగా పేరు పొందిన మహజెబిన్ సామాజిక సేవా రంగంలో కూడా కృషి చేస్తున్నారు. ఈ అవార్డు 'తన బాధ్యత పెంచిందని, సాంఘిక కార్యకర్తగా బాలల కోసం మరింతగా పనిచేయాల్సిన అవసరం ఎంతో ఉందని' ఈ సందర్భంగా మహజెబిన్ అభిప్రాయపడ్డారు. మహజెబిన్ కవితా పుస్తకం 'ఆకురాలు కాలం' అందరి మన్నన పొందింది. జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో మహిళల సదస్సులలో పాల్గొని మహిళా సమస్యలపై తన గొంతు వినిపించిన మహజెబిన్ కవిత్వం,



కేంద్ర మంత్రి రేణుకా చౌదరి ద్వారా రాజీవ్‌గాంధీ జాతీయ అవార్డును స్వీకరిస్తున్న రచయిత్రి మహజెబిన్

సామాజిక రంగం - రెండింటిలో పనిచేస్తూ ప్రతిభను ప్రదర్శిస్తున్నారని పలువురు అభినందించారు.

# పాలమూరు కవులకు మానస సాహితీ అవార్డుల ప్రధానం

పాలమూరు కవులైన భీంపల్లి శ్రీకాంత్, రఘువీర్ ప్రతాప్, వై దేవదానంలకు 2007 సంవత్సరపు జాతీయ స్థాయి మానస సాహితీ అవార్డులను అందుకున్నారు. ఏప్రిల్ 6వ తేదీన విజయవాడలో జరిగిన మానస అవార్డుల పురస్కార కార్యక్రమంలో ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖ కవి నిఖిలేశ్వర్, మానస సాహిత్య, సాంస్కృతిక అకాడమీ అధ్యక్షులు బ్రహ్మానందరావులు ఈ మేరకు అందజేశారు. గతంలో భీంపల్లి శ్రీకాంత్ మానస రాష్ట్ర స్థాయి పురస్కారం, దసరా పురస్కారం, స్వాతంత్ర్య వజ్రోత్సన పురస్కారాలను మానస సాహిత్య అకాడమి నుంచి అందుకున్నారు. రఘువీర్ ప్రతాప్ మానస రాష్ట్ర స్థాయి పురస్కారం, స్వాతంత్ర్య వజ్రోత్సవ పురస్కారాలను మానస సాహిత్య అకాడమీ నుంచి అందుకున్నారు. రఘువీర్ ప్రతాప్ కవితాంజలి'ని వెలువరించగా,



మానస జాతీయ స్థాయి అవార్డులను అందుకుంటున్న వై.దేవదానం, భీంపల్లి శ్రీకాంత్, రఘువీర్ ప్రతాప్

భీంపల్లి శ్రీకాంత్ పాలమూరు కవిత, సోది, అంజలి, పాలమూరు కవితా సుమాలు, కళాంజలి అనే పుస్తకాలను వెలువరించారు.

# కవులు - రచయితల డైరక్టరీ

గత తొమ్మిదేండ్లుగా స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ముస్లిం జన సముదాయాల పాత్రను వివరిస్తూ పలు చరిత్ర గ్రంథాలను ప్రచురించి పాఠకులకు అందించిన 'అజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్' తెలుగులో సాహిత్య సృష్టిగావిస్తున్న ముస్లిం కవులు, రచయితల వివరాలతో కూడిన 'డైరక్టరీ' రూపొందించాలని సంకల్పించింది.

రాష్ట్రంలోని ముస్లిం కవులు, రచయితలు తమ వ్యక్తిగత, వృత్తి ప్రవృత్తి, సాహిత్య రంగాలలో వ్యక్తిగత కృషిని, ప్రగతిని, ఆయా రంగాలలో తమ క్రియాశీలక భాగస్వామ్యాన్ని, తమ గ్రంథాలు, రచనలు, ఆ రచనలలో ఏమైనా ఇతర భాషలలో అనువాదమై ఉంటే అ విశేషాలను, లభించిన అవార్డులు, పురస్కారాలు, అభినందనల వివరాలను పేర్కొంటూ, రెండు పాస్‌పోర్టు ఫోటోలతో సహా సమగ్ర సమాచారాన్ని 2008 మే 30లోగా క్రింది చిరునామాకు పంపించాల్సిందిగా కవులు - రచయితలను కోరుతున్నాం. ఈ 'డైరక్టరీ' రాష్ట్రంలో గల ప్రభుత్వ - ప్రభుత్వేతర గ్రంథాలయాలకు, విశ్వవిద్యాలయాలకు, సాహితీ సంస్థలకు, సమాచార వ్యవస్థలకు ఉచితంగా అందచేయలన్నది నిర్ణయం.

రాష్ట్రంలోని వివిధ పత్రికలలో కవులు - రచయితల గురించి, వారి సాహిత్యం గురించి ప్రచురితమైన పరిచయ వ్యాసాలు, సమీక్షా వ్యాసాలు, గ్రంథాలు, ఆ గ్రంథాల మీద వచ్చిన సమీక్షల కాపీలను కూడా పంపితే కవుల - రచయితల పరిచయాలతో కూడిన ఈ 'డైరక్టరీ'ని సమగ్రంగా రూపొందించడానికి వీలుంటుంది. కనుక కవుల - రచయితల సహకారం ఆకాంక్షిస్తున్నాం.

**చిరునామా**
**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**
**శివప్రసాద్ వీధి, కొత్తపేట, వినుకొండ -522 647**
**గుంటూరు జిల్లా సెల్ నెం : 9440241727**

## మనస్సును జ్వలింపచేసేదే అసలైన కవిత్వం



నాగిశెట్టి రచించిన 'మనిషి కోసం' నానీల సంపుటిని ఆవిష్కరిస్తున్న ఆచార్య తేళ్ళ సత్యవతి. చిత్రంలో ప్రముఖ కవి, సభాధ్యక్షులు సోమేపల్లి వెంకట సుబ్బయ్య, ముఖ్య అతిథి శ్రీమతి గద్దె రామతులశమ్మ, సమీక్షకులు ఎస్.ఆర్. భల్లం, కవులు డా॥ పి.వి. సుబ్బారావు, కోసూరి రవి కుమార్, దాసరి చంద్రశేఖర్ ఉన్నారు

నానీలు ఇటీవల సాహితీ ప్రపంచంలో ప్రకంపనాలు సృష్టించాయని ప్రముఖ కవి ఎస్.ఆర్. భల్లం పేర్కొన్నారు. ఆదివారం గుంటూరుజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో నాగిశెట్టి తాతయ్య నాయుడు రచించిన మనిషి కోసం నానీల సంపుటిని ఆవిష్కరించిన సభలో ఆయన మాట్లాడారు. పలువురు కొత్త కవులు సాహితీ రంగం వైపు దృష్టి సారించి తనదైన శైలిలో కవిత్వాన్ని వెలువరించేందుకు నానీలు దోహదం చేశాయన్నారు. నానీల సంపుటిని ప్రొఫెసర్ తేళ్ళ సత్యవతి ఆవిష్కరించారు. కార్యక్రమంలో జిల్లా రచయిత సంఘం అధ్యక్షులు సోమేపల్లి వెంకట సుబ్బయ్య, టి.వి. సుబ్బారావు, ప్రధాన కార్యదర్శి క్రోసూరు రవికుమార్, డాక్టర్ పి.వి. సుబ్బారావు తదితరులు పాల్గొన్నారు.

## కృష్ణా జిల్లా చారిత్రక వైభవంసదస్సు

భారతీయ పురాతత్త్వ సర్వేక్షణ హైదరాబాద్ విభాగం, కృష్ణాజిల్లా రచయితల సంఘం సంయుక్త నిర్వహణలో మచిలీపట్నం బందరు కోటలోని డచ్ కోట ప్రాంగణంలో మార్చి 21,22 తేదీలలో జాతీయ పరిశోధనా సదస్సులు నిర్వహించబడ్డాయి. పేర్ని వెంకట్రామయ్య అధ్యక్షతన ప్రారంభ సదస్సు జరిగింది. కృష్ణాజిల్లా రచయితల ప్రధాన కార్యదర్శి డా॥ జి.వి. పూర్ణచంద్, శాసన సభ్యులు శ్రీమతి క్రిష్టిలారజన్, మహ్మద్ అప్సల్ నెదల్లాండ్, జిల్లా కలెక్టర్ శ్రీమతి శైలజా రామయ్య, రాష్ట్ర నీటిపారుదల కార్యదర్శి నవీన్ మిట్టల్, పార్లమెంటు సభ్యులు బాడిగ రామకృష్ణ, మచిలీపట్నం మున్సిపల్ ఛైర్మన్ షేక్ సిలార్ దాదా తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

భారతీయ పురాతత్త్వ సర్వేక్షణ ప్రత్యేకాధికారి డా॥ జితేంద్రదాస్ కీలకోపన్యాసం చేశారు. తర్వాత జరిగిన సదస్సులలో ఆయా రంగాలలో ప్రముఖులు, పరిశోధకులు పాల్గొని పత్రాలు సమర్పించారు. పలువురు వక్తలతో ప్రాచీన సంస్కృతి, సాహిత్య అంశాలు పేర్కొని సభికులలో ఆలోచనలు రేకెత్తించారు.

## శతాధిక కవి సమ్మేళనం

రాజమండ్రిలో మార్చి 30న రాష్ట్ర స్థాయి శతాధిక ఉగాది కవి సమ్మేళనాన్ని ఆకాశవాణి ప్రయోక్త నాగసూరి వేణుగోపాల్ ప్రారంభించారు.

ఈ కవి సమ్మేళనంలో రాష్ట్రం నలుమూలల్నుండీ 120 మందికి పైగా కవులు, కవయిత్రులు పాల్గొని తమ కవితల్ని విన్పించారు. శ్రీమతి జాలాది విజయ విన్పించిన 'అమ్మ' కవిత మరోసారి వినాలని సభికులు కోరారు. దుగ్గిరాల నుండి యోహాను 'గబ్బిలం'లో జాషువా ఏకాంకిక ప్రదర్శించారు.

సాయంత్రం కె. రాజకుమారి 'భావ రాజీవం' కవితా సంపుటి ఆవిష్కరణ సభకు డాక్టర్ ఎండ్లూరి సుధాకర్ అధ్యక్షులుగా వ్యవహరించారు. ఆచార్య బేతవోలు రామబ్రహ్మం పుస్తకాన్ని ఆవిష్కరిస్తూ రాజకుమారి కవితల్ని విశ్లేషించారు. ఆమె కవితల్లో సూటిదనం, నిజాయితీ ఉందన్నారు. కవయిత్రి తొలి ప్రతి అందించి, తన జీవిత భాగస్వామి శ్రీ కె.కె. సంజీవరావుకు కవితా సంపుటి అంకితం చేశారు.

ముఖ్య అతిథి అద్దేపల్లి రామ్మోహనరావు మాట్లాడుతూ అభివ్యక్తిలో సరళత, స్వచ్ఛత, సమాజాన్ని చక్కదిద్దే ఆలోచన, జరుగుతున్న అన్యాయాల పట్ల ఆవేదన ఉన్నాయన్నారు. విశిష్ట అతిథులు సన్నిధానం నరసింహశర్మ సహజ భావావిష్కరణ సమాహారంగా పేర్కొనగా ప్రముఖ కథా రచయిత ముప్పిడి ప్రభాకరరావు కవితలన్నీ అందంగా, హృద్యంగా, అనుభూతి ప్రధానంగా ఉన్నాయన్నారు. కె. రాజకుమారి దంపతులు ప్రముఖ కవుల్ని, కార్యకర్తలను సన్మానించారు. కృతికర్త, కృతి స్వీకర్తలను ఎండ్లూరి దంపతులు, ముప్పిడి దంపతులు సన్మానించారు. శతాధిక కవులకు ప్రశంసా పత్రాలు, జ్ఞాపికలు, మనోజ్ఞ సంస్థ అందజేసింది.

మనోజ్ఞ ఉపాధ్యక్షులు ఎస్.వి.హెచ్. ఆలీ వందన సమర్పణ చేశారు. కార్యక్రమ నిర్మాత కె.కె. సంజీవరావు సాహితీ ప్రియులకి, పాత్రికేయులకి కృతజ్ఞతలు తెలిపారు.



మార్చి 20వ తేదీన రాజమండ్రి ఆనం రోటరీ హాలులో 'భావ రాజీవం' కె. రాజకుమారి కవితా సంపుటి ఆవిష్కరణ (ఎడమ నుంచి) కృతి స్వీకర్త కె.కె. సంజీవరావు, కవయిత్రి కె. రాజకుమారి, పుట్ల హేమలత, పట్టపగలు అనంత రామలక్ష్మి (తొలి ప్రతి స్వీకర్త), ప్రాణహిత కవి సన్నిధానం, డాక్టర్ అద్దేపల్లి రామ్మోహనరావు, డాక్టర్ ఎండ్లూరి, ఆచార్య శ్రీ బేతవోలు రామబ్రహ్మం (ఆవిష్కర్త), పట్టపగలు వెంకట్రావు (తొలి ప్రతి స్వీకర్త), ఎస్.వి.హెచ్. ఆలీ, కథా రచయిత ముప్పిడి ప్రభాకరరావు

# భద్రాచలంలో బాలల కవితా రచన - శిక్షణా శిబిరం

సాహితీ స్రవంతి భద్రాచలం డివిజన్ శాఖ పర్యవేక్షణలో ఖమ్మంజిల్లా చర్ల మండలంలోని సత్యనారాయణపురం శ్రీ సీతారామ ఎయిడెడ్ హైస్కూల్ ప్రాంగణంలో ఇటీవల పాఠశాలలలో 6 నుండి 10వ తరగతి వరకు చదివే వందమంది విద్యార్థులకు కవితా రచనపై శిక్షణా శిబిరం నిర్వహించబడింది.

ఈ కార్యక్రమం మొత్తం మూడు విభాగాలు (సభలు)గా కొనసాగింప బడింది. ప్రారంభ సభ ఉదయం స్థానిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు పి.వి.ఎన్.కె. మోహన్ అధ్యక్షతన, గ్రామ ఉపసర్పంచ్ భూపతిరాజు కృష్ణంరాజుగారు ముఖ్య అతిథిగా వ్యవహరించారు. మరికొందరు ప్రముఖులు వేదికపై ఆశీనులవగా ప్రారంభమైంది.

ఈ సమావేశంలో ప్రముఖ కవి, భద్రాచలం డివిజన్ సాహితీ స్రవంతి అధ్యక్షులు అయిన మాల్యశ్రీ శిబిరం ఉద్దేశాన్ని వివరించారు.

ఇదే విధంగా ఈ ప్రారంభ సభలో పలువురు వక్తలు చక్కని ప్రసంగాన్ని చేస్తూ ఆశీస్సులందించారు. స్థానిక ఎంపిటిసి ఇందల అప్పారావు శిక్షణ శిబిరాన్ని ప్రారంభించారు.

తదుపరి 45 నిమిషములకు ఒకరు చొప్పున నలుగురు వక్తలు శిక్షణ ఇవ్వటం జరిగింది. మొదటగా 'కవితా రచన ప్రయోజనాలు' అనే అంశంపై జి. గోపాలకృష్ణ, తరువాత కవితా రచన ఎలా చేయాలో వివరిస్తూ కొన్ని మెళకువలను ఎన్.సిహెచ్. చక్రవర్తి అదేవిధంగా కవితాత్మకమైన చక్కని రచనలను సోదాహరణంగా వివరిస్తూ మండవ సుబ్బారావు, అలాగే ఒక రచయితగా తమ అనుభవాలను, అనుభూతులను పిల్లలకు వివరించిన ఈగ హనుమాన్ పాల్గొని శిక్షణా కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించారు.

మధ్యాహ్న భోజనానంతరం శిక్షణ పొందిన విద్యార్థులకు కవితా రచన పోటీ నిర్వహించడం జరిగింది. ఈ పోటీలో స్థానిక పాఠశాలలోని విద్యార్థులతో పాటు ఇతర పాఠశాలల నుండి వచ్చి ఉదయం నుంచి శిక్షణ పొందిన (శ్రీ సీతారామ ఎయిడెడ్ హైస్కూల్, సత్యనారాయణపురం-45, రాహుల్ విజ్ఞాన్, చర్ల-37, జెడ్.పి. హైస్కూల్, తేగడ-11, లిటిల్ ఫ్లవర్స్, భద్రాచలం-1, మొత్తం 94 మంది) విద్యార్థులందరూ పాల్గొన్నారు.

తరువాత 'కవి సమ్మేళన' సమావేశం అల్లం రాజు శ్రీహరి కామేశ్వరరావు (రచయిత, మిమిక్రీ ఆర్టిస్టు) అధ్యక్షతన జరిగింది.



బాలల కవితా రచనా శిక్షణా శిబిరం బహుమతి ప్రధాన సభ వేదికపై నున్నవారు ఎడమ నుండి కుడివైపుకి వరుసగా శ్రీయుతులు బోసు, జీవా, ఇందల అప్పారావు (ఎంపిటిసి), చింతూరు వెంకట్రావు, పి.వి.ఎన్.కె. మోహన్ - ప్రధానోపాధ్యాయులు, వన ఆర్.ఒ. హైస్కూల్, పి.వి.ఆర్. స్వామి - చర్ల, బలిజేపల్లి రవి - ప్రిన్సిపాల్, రాహుల్ - విజ్ఞాన్, చర్ల, తాతోలు దుర్గాచారి - సభాధ్యక్షులు, ప్రధాన కార్యదర్శి, సాహితీ స్రవంతి, భద్రాచలం, ఎన్‌సిహెచ్ చక్రవర్తి - గౌరవ సలహాదారులు, మాల్యశ్రీ - అధ్యక్షులు, సాహితీ స్రవంతి, భద్రాచలం డివిజన్

దీనిలో ఎగ్గడి గోపాలరావు, కొమ్మ వీరభద్రం, భాన, రమేష్ మొదలగువారు తమ స్వీయ రచనా గీతములను ఆలపించారు. విద్యార్థులూ ఈ సమ్మేళనంలో పాల్గొని తమ చిట్టి కవితలను, ఉదయం నుంచి తాము శిక్షణ పొందిన అనుభూతులను వ్యక్తీకరించారు.

ఈ ఆదివారం మాకెంతో ఉల్లాసాన్ని, ఉపయోగాన్ని ఇచ్చిందని, కవితా రచన ఎలా చేయాలో అర్థమైందని, ఇకముందు కవితా రచన కొనసాగిస్తూ, సమావేశాలలో పాల్గొని చదువుతామని చెప్పారు. టి.వి. చూసే అవకాశం, ఆడుకొనే అవకాశం పోయిందని ఇక్కడికొచ్చే ముందు కొంత బాధపడినా తర్వాత ఇక్కడికి రావడాన్ని అదృష్టంగా భావిస్తున్నామని చెప్పారు.

ఈ కవి సమ్మేళనం తదుపరి చివరిదైన బహుమతి ప్రధాన సభ జరిగింది. సాహితీ స్రవంతి భద్రాచలం డివిజన్ ప్రధాన కార్యదర్శి తాతోలు దుర్గాచారి దీనికి అధ్యక్షులుగా వ్యవహరించారు.

అనంతరం పి.వి.ఆర్. స్వామి, బలిజేపల్లి రవి, ఇతర వక్తలు శిక్షణా కార్యక్రమ ఏర్పాటు సముచితమైనదేనని సాహితీ స్రవంతి ఓ మంచి ప్రయత్నం చేసిందని పేర్కొన్నారు.

జూనియర్స్ (6, 7 తరగతులు) విభాగంలో కులదీప్, శ్రీకర్, దివ్య హర్షిణిలు మొదటి మూడు బహుమతులను, సీనియర్స్ (8, 9, 10 తరగతులు) విభాగంలో సంతోష్, అనూష, శ్రీనివాస్‌లు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులను గెల్చుకున్నారు. శిక్షణ పొందిన విద్యార్థులందరికీ సర్టిఫికెట్లు అందజేయబడినవి. శిక్షణనిచ్చిన వక్తలకు జ్ఞాపికలను అందించారు.

పై కార్యక్రమం మొత్తానికి కన్వీనర్‌గా వ్యవహరించిన డి.వి. కృష్ణమూర్తి శిక్షణా శిబిరం విజయవంతం వెనుక సాహితీ స్రవంతి, ఆర్థిక సహకారం అందించిన సహృదయులు, శ్రమదానం చేసిన పాఠశాల పూర్వ విద్యార్థులుండటం గమనింపదగిన అంశమని అన్నారు.

# పార్వతీపురంలో సాహితీ స్రవంతి ఏర్పాటు

విజయనగరంజిల్లా పార్వతీపురంలో సాహితీ స్రవంతి ఏర్పాటు ఆహ్వాన ప్రసంగంలో వర్ధమాన కవి సిరికి స్వామి నాయుడు మాట్లాడుతూ తెలుగు నేల నలుమూలలా సాహిత్యాన్ని సుసంపన్నం జేస్తున్న సాహితీ స్రవంతి సాహితీ సుక్షేత్రమైన పార్వతీపురంలో తన శాఖను ఏర్పాటు చేయడం సంతోషకరమైన విషయమని అన్నారు. పోరాటాల పురిటిగడ్డగా పేరుగాంచిన పార్వతీపురంలో సాహిత్యానికి కొదువ లేదని యిక్కడ అన్ని సాహితీ సంస్థలకు కలుపుకుపోతూ ఒక విశాల వేదిక ఏర్పాటు చేయడం సాహితీ స్రవంతి ముఖ్య లక్ష్యమని పేర్కొన్నారు. సభాధ్యక్షులుగా సాహితీ స్రవంతి విజయనగరం జిల్లా కన్వీనర్ చీకటి దివాకర్ ప్రారంభోపన్యాసం చేస్తూ దేశం అనేక రుగ్మతలతో సంక్లిష్ట స్థితిలో ఉందనీ, సినీ మీడియా ప్రభావం వలన ప్రేమోన్మాదం పెచ్చుమీరిందనీ చెప్పారు. పుస్తక పఠనం కరువై పోతున్న రోజుల్లో అన్ని సాహిత్య సాంస్కృతిక సంస్థలు బలమైన వాణి వినిపించాల్సిన అవసరముందని వివరించారు. సాహితీ స్రవంతి ముఖ్యంగా మతోన్మాదం, ఉగ్రవాదము, ప్రపంచీకరణ దుష్ఫలితాలకు వ్యతిరేకంగా పనిచేస్తుందని చెప్పారు.

రచయిత జి.ఎస్. చలం ఒక రాత్రి - రెండు స్వప్నాలు కథా సంకలనం ఆవిష్కరిస్తూ రచయిత గంటేడ గౌరునాయుడు సాహితీ నేపథ్యాన్ని వివరించారు.

ప్రముఖ కవి అల ఒక రాత్రి రెండు స్వప్నాలు కథా సంకలనాన్ని పరిచయం చేస్తూ ప్రపంచీకరణ నేపథ్యంలోని యీ కథలలోని వ్యధలన్నీ ఉత్తరాంధ్రకే పరిమితం గాదనీ యివి మూడవ ప్రపంచ దేశాల మొత్తానికీ చెందుతాయని అన్నారు.



సాహితీ స్రవంతి ఏర్పాటు సభ, సాహితీ వీక్షణం పుస్తక ఆవిష్కరణ

ప్రముఖ విమర్శకులు - మహరాజ కళాశాల పూర్వ ఉపన్యాసకులు డా॥ యు.ఎ. నరసింహమూర్తి మాట్లాడుతూ... సాహిత్యం ప్రజల్ని చైతన్యవంతుల్ని జేసే సాధనమనీ, మానవీయ సంబంధాల్ని పెంపొందిస్తుందనీ చెప్పారు. ఈ సందర్భంగా డా॥ నాగసూరి వేణుగోపాల్ రాసిన సాహితీ వీక్షణం పుస్తకాన్ని ఆవిష్కరించారు.

ఎస్.కె. పబ్లికేషన్స్ అధినేత ఎస్.కె. బాబు మాట్లాడారు.

కథా రచయిత గంటేడ గౌరునాయుడు మాట్లాడుతూ సాహిత్యంలో తన బాధను పంచుకోవడానికి, స్వార్థంతో నలుగురిని కలుపుకుపోవడం జరుగుతోందనీ, ఆ స్వార్థం సమాజం కోసం ఉపయోగపడితే అంతకుమించి సంతోషం లేదనీ అన్నారు.

వక్తల ఉపన్యాసాల విరామ సమయంలో జానపద గీతాలను ఆలపించారు.

అనంతరం జరిగిన జనకవనంలో అనేకమంది కవులు తమ కవితలను విన్పించారు.

పిల్లా లక్ష్మున్నాయుడు వందన సమర్పణతో సభ ముగిసింది.

# ఇల్లెందులో కవి సమ్మేళనం

ఆంగ్ల భాషా వ్యామోహంతో తెలుగు సంస్కృతి మనకు తెలియకుండానే చేజారిపోతుందని, తేనెలొలుకు తెలుగు వెలుగును ప్రతి ఒక్కరూ బాధ్యతాయుతంగా కాపాడుకోవాలని ఇల్లెందు మున్సిపల్ ఛైర్మన్ మొల బాబు అన్నారు. స్థానిక గిరిజన బాలికల వసతి గృహంలో జరిగిన 'సర్వధారి' నామ సంవత్సర ఉగాది కవి సమ్మేళనంలో ముఖ్య అతిథిగా ఆయన పాల్గొని ప్రసంగించారు. షడ్రుచులలాగే జీవితం సమస్యలతో 'రణం' సమస్యలతో 'రణం' సమస్యల 'తోరణం' అంటూ చమత్కరించారు సభకు అధ్యక్షత వహించిన స్థానిక సాహితీ స్రవంతి కార్యదర్శి కె.రమేష్ మాట్లాడుతూ ప్రపంచీకరణ రాకతో తెలుగు సంప్రదాయాలు తెరమరుగవుతున్నాయని, కవులు భాషాభివృద్ధిపై దృష్టి సారించాలని పేర్కొన్నారు. సాహితీవేత్త ఎంఎన్‌వివి మూర్తి ఉగాది ప్రత్యేకతను వివరించారు. అలవాటుగా వెళ్లే పార్కుకు పొరపాటుగానైనా వెళ్లకు.. అవి మృత్యువాకిళ్లు కావచ్చు. అంటూ కవయిత్రి ఇందిర చదివిన కవిత, హైకూలు సభికుల్ని ఆకట్టుకున్నాయి. కోటిసూర్య ప్రభలతో శతకోటి దివ్య ఆశీస్సులతో తలుపు తట్టి వస్తోంది ఉగాది. అంటూ సత్యానంద్ తన కవితతో ఉగాదికి స్వాగతం పలుకగా సర్వధారి ఎలా పలుకను నీకు స్వాగతం. నిన్నటి సర్వజిత్తు రుధిర తర్పణాలనే మిగిల్చింది. అంటూ కవి కటుకోర్యుల రమేష్ చదివిన కవిత పలువురిని ఆలోచింపజేసింది. పాటల రచయిత ఎల్.వెంకన్న, సినీ కళాకారుడు




సాహితీ స్రవంతి ఇల్లెందు శాఖ కార్యదర్శి కటుకోర్యుల రమేష్‌కు ఉగాది మెమెంటోను అందజేస్తున్న ఛైర్మన్ మొలబాబు ప్రక్కన కవయిత్రి ఇందిర

సుందర్ పాడిన పాటలు పలువుర్ని ఆకట్టుకున్నాయి. మేము సైతం అంటూ విద్యార్థులు కూడా ఉగాది కవితలు చదివి అలరించారు. రోజురోజుకు అణగారిపోతున్న తెలుగు కాపాడుకోవాలంటూ సామాజిక, రాజకీయ ఆర్థిక పరిస్థితులపై కవితా శరాలు సంధిస్తూ కవులు తమ కవితా గానం వినిపించారు. ఈ సభలో ఉపాధ్యాయులు రాకం శ్యాంబాబు, సంతోష్ కుమార్ తివారి, మల్లేశ్వరరావు కవి సంత్‌సుందర్‌దాస్ సేవాసమితి కన్వీనర్ సతీష్‌ఖండేల్ వాల్ తదితరులు పాల్గొన్నారు. ఉగాది కవితల పోటీల్లో గెలుపొందిన విద్యార్థులకు కవులకు మున్సిపల్ ఛైర్మన్ మొలబాబు బహుమతులు అందజేశారు.

# స్వీకారం

భ్రమల్ని మోసుకుంటూ...
కె.జె. రమేష్
వెల : రు. 50

తూణీరమ్
వంగర శ్రీధర్
వెల : రు. 50

ఖండిత
వి. ప్రతిమ
వెల : రు. 70

కవితా వార్షిక 2007
గౌరవ సంపాదకుల : డా॥ అంపశయ్య నవీన్
వెల : రు. 100

75 ఏళ్ళ తెలుగు టాకీ తెలుగు నీడలు
పి.ఎస్. రావ్
వెల : రు. 50

తెలుగు మనసు
చేగొండి రామజోగయ్య
వెల : అమూల్యం

గుంటూరు నానీలు
కె.జె. రమేష్
వెల : రు. 35

భావ రాజీవం
కె. రాజకుమారి
వెల : రు. 70

తొలి తెలుగు పరిశోధకులు
డా॥ ఎన్. గోపి
వెల : రు. 30

చేదుఫలం
జీవన్
వెల : రు. 80

స్పాట్ సిగ్నేచర్స్
ప్రధాన సంపాదకుల : నాళేశ్వరం శంకరం
వెల : రు. 20

మనిషి కోసం (నానీలు)
నాగిశెట్టి
వెల : 35

మనోముద్ర
బోజంకి వెంకట రవి
వెల : రు. 60

మా బోనులోకి మరో సింహం
కొమ్రన్న
వెల : రు. 25

నగ్నాక్షరాలు
డా॥ జాలాది విజయ
వెల : రు. 50

(1) ప్రజాసాహితీ
ప్రధాన సంపాదకుడు
కొత్తపల్లి రవిబాబు

(2) సాహిత్య నేత్రం
సంపాదకుడు
శశిశ్రీ

(3) చినుకు
సంపాదకుడు
నందూరి రాజగోపాల్

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

19.5.1894 - 4.5.1979

# గుడిపాటి వెంకటచలం

చలం సాహిత్యానికి కేంద్ర బిందువు స్త్రీ. స్త్రీ, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్ లాంటి వ్యాస సంపుటాలు, ఓ పువ్వు పూసింది, కన్నీటి కాలవ లాంటి కథలు, మైదానం, బ్రాహ్మణీకం లాంటి నవలలు, పురూరవ, సావిత్రి లాంటి నాటకాలు అనేకం రాశాడు. ఈయన వస్తువు, శైలి కూడా ఆంధ్ర సాహిత్యాన్ని మలుపు తిప్పింది.

BCV

THANAM Postal Regd. No.H/SD/415/07-09 RNI N0.APTEL/ 2004/18396

## ఉపాధ్యాయులు, తల్లితండ్రులు చదువవలసిన పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 1. | పిల్లలు నేర్చుకోవడంలో ఎలా వెనకబడతారు? | 60.00 |
| 2. | పిల్లలు ఎలా నేర్చుకుంటారు | 60.00 |
| 3. | టీచర్ | 40.00 |
| 4. | విముక్తి-విద్య | 40.00 |
| 5. | టీచర్లకు ఉత్తరం | 40.00 |
| 6. | మాస్టారూ...! | 10.00 |
| 7. | మీ ఒడిలో | 10.00 |
| 8. | కథలే పాఠాలు | 25.00 |
| 9. | బోధన-శోధన | 30.00 |
| 10. | విభిన్న విద్యా సంస్థలు | 25.00 |
| 11. | భాష-భావం | 20.00 |
| 12. | మీరు - మీ పిల్లలు | 15.00 |
| 13. | నల్లబల్ల వెనుక | 25.00 |
| 14. | చదువు సంధ్యలు | 25.00 |
| 15. | మహోజ్వల స్మృతులు | 35.00 |
| 16. | మనిషి కథ | 40.00 |
| 17. | చార్లీచాప్లిన్ | 25.00 |
| 18. | పరిణామక్రమంలో విద్యా వ్యవస్థ 1833-2003 | 15.00 |
| 19. | వేదభూమి | 10.00 |
| 20. | సమాజం-సైన్స్- సంప్రదాయం | 15.00 |
| 21. | సైన్సు చరిత్రలో సామాజికాంశాలు | 10.00 |
| 22. | పిల్లల అలవాట్లు | 25.00 |
| 23. | భారతదేశ చరిత్ర | 25.00 |
| 24 | పిల్లల భాష - ఉపాధ్యాయుడు | 25.00 |

## పిల్లలు చదివే పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 1. | మహావిశ్వం మన భూమి | 20.00 |
| 2. | ఆదర్శబాల్యం | 25.00 |
| 3. | విలియం షేక్స్పియర్ | 15.00 |
| 4. | హైడీ | 20.00 |
| 5. | విశ్వవిఖ్యాత శాస్త్రజ్ఞులు | 15.00 |
| 6. | విదేశీ కథలు | 15.00 |
| 7. | విజ్ఞాన శిఖరాలు | 15.00 |
| 8. | చైనా నీతి కథలు | 15.00 |
| 9. | భారతీయ శాస్త్రవేత్తలు | 15.00 |
| 10. | అందాల పార్కు | 15.00 |
| 11. | పిల్లల గణితం | 15.00 |
| 12. | పిల్లలు-పిడుగులు | 20.00 |
| 13. | సరదా సరదా చదువులు | 15.00 |
| 14. | తరగతిలో తమాషాలు | 15.00 |
| 15. | వానరుడు - నరావతరణ | 25.00 |
| 16. | చదువంటే మూడోకన్ను | 25.00 |
| 17. | పాడరా ఓ తెలుగువాడా | 15.00 |
| 18. | పిల్లల సంరక్షణ | 25.00 |
| 19. | అక్షరాలతో ఆటలు | 30.00 |
| 20. | నేర్చుకోడం మాకిష్టం | 20.00 |
| 21. | కథలంటే మాకిష్టం | 40.00 |
| 22. | ఆటలంటే మాకిష్టం | 30.00 |
| 23. | పాటలంటే మాకిష్టం | 20.00 |
| 24. | పాడుకొందాం | 25.00 |
| 25. | తేటతెలుగు-1 | 30.00 |
| 26. | తేటతెలుగు-2 | 30.00 |
| 27. | కొత్తబ్యాగ్ | 10.00 |
| 28. | బొటనవేలితోబొమ్మలు | 10.00 |
| 29. | పొడుపుకథలు-చింగ్‌చదువు | 15.00 |
| 30. | డంభాలమారి డాన్ క్విక్సాట్ | 25.00 |
| 31. | గణితసూత్రదీపిక | 20.00 |
| 32. | జంతువుల వింతభాష | 10.00 |
| 33. | జంతువుల వింతరుచులు | 10.00 |
| 34. | మూడు కథలు | 10.00 |
| 35. | నత్తగుల్ల స్వార్థం-బంగారుచేపగర్వం | 15.00 |
| 36. | అద్భుతాలనియం-నీరు | 10.00 |
| 37. | నేయా | 10.00 |
| 38. | బద్ధకం వదిలింది | 15.00 |
| 39. | బుడిబుడికథలు | 40.00 |
| 40. | పిల్లల ప్రశ్న-సైన్స్ జవాబు | 15.00 |
| 41. | మేమొచ్చేశాం | 20.00 |
| 42. | నిర్జీవం-జీవపరిణామం | 30.00 |
| 43. | సరదాసరదా లెక్కలు | 30.00 |
| 44. | విశ్వం-విజ్ఞానం | 25.00 |
| 45. | ప్రకృతిలో అద్భుతాలు-విజ్ఞానవిశేషాలు | 45.00 |
| 46. | కాలిక్యులేటర్ గేమ్స్ | 20.00 |
| 47. | అలెగ్జాండర్ గ్రాహంబెల్ | 10.00 |
| 48. | మేకపిల్ల మెడగంట-చిట్టెలుక కృతజ్ఞత | 15.00 |
| 49. | మంచిగా వుందాం | 30.00 |
| 50. | ఖలేకథలు | 10.00 |
| 51. | తోకతెగిన తోడేలు | 15.00 |
| 52. | బల్బు వెలిగింది | 20.00 |
| 53. | రవీంద్రనాథ్ ఠాగూర్ | 15.00 |
| 54. | వినయంలేని వీరుడు | 25.00 |
| 55. | బండి నుంచి మోటారుకు | 20.00 |
| 56. | చెట్టు | 15.00 |
| 57. | చిటపట చినుకులు | 20.00 |
| 58. | చిట్టిరాకుమారి-చందమామ | 10.00 |
| 59. | గుడ్డు నుంచి పిల్ల | 20.00 |
| 60. | కుకూ ఘూరీల కథ | 20.00 |
| 61. | మన కథ | 20.00 |
| 62. | నడిచేటి నావకథ | 20.00 |
| 63. | రహస్యం | 10.00 |
| 64. | ఎద్దు | 20.00 |
| 65. | మనమూ రాద్దామా? | 10.00 |
| 66. | బుచ్చిబాబు-బొమ్మకారు | 15.00 |
| 67. | యమునీ దర్బారు | 10.00 |
| 68. | బంగారు జింక | 15.00 |
| 69. | మూడు ఏనుగులు | 15.00 |
| 70. | బొబక్ నేర్చిన పాఠం | 15.00 |
| 71. | పులి-తాబేలు | 10.00 |
| 72. | పింకి-పిల్లి | 10.00 |
| 73. | సైన్యాధిపతి గర్వభంగం | 15.00 |
| 74. | కుడి-ఎడమ | 10.00 |
| 75. | నాతప్పేమిటో! | 15.00 |
| 76. | నందువంట-నేస్తంతంటా | 10.00 |
| 77. | వంశీధర్ నిజాయితీ | 10.00 |
| 78. | జమిందారు వేట | 10.00 |
| 79. | అద్దంలో సింహం | 15.00 |
| 80. | సముద్ర నేస్తాలు | 15.00 |
| 81. | కప్పకల | 15.00 |
| 82. | కథలంటే మాకిష్టం-1 | 25.00 |
| 83. | కథలంటే మాకిష్టం-2 | 25.00 |
| 84. | రాబిన్‌సన్‌క్రూసో | 45.00 |
| 85. | నల్లగుర్రం | 25.00 |
| 86. | పెన్సిల్‌బాక్స్ | 15.00 |
| 87. | మంచి అమ్మ | 15.00 |
| 88. | కోతి ఫొటో | 25.00 |
| 89. | కథ కాని కథ | 15.00 |
| 90. | లోకంచుట్టిన వీరుడు | 40.00 |
| 91. | చివరి ఆకు | 10.00 |
| 92. | పెద్దల మాయం-పిల్లలరాజ్యం | 20.00 |
| 93. | నెలవంక | 25.00 |
| 94. | సాయపడే చేతులు | 20.00 |
| 95. | నీళ్ళు ఎందుకు తడిగాఉంటాయి? | 15.00 |
| 96. | బడి-బ్రతుకు | 25.00 |
| 97. | హిరోషిమా అగ్నిజ్వాలలు | 25.00 |
| 98. | సిసింద్రీలు | 20.00 |
| 99. | అద్దాలతో ఆటలు | 15.00 |

# ప్రజాశక్తి బుక్‌హౌస్

1-1-187/1/2, చిక్కడపల్లి, హైదరాబాద్-20. ఫోన్ : 27660013

గమనిక : పై పుస్తకాలు స్కూలు గ్రాంటు నుండి కాని, టీచర్ గ్రాంటు నుండి కానీ మీ స్కూలుకు కొనుగోలు చేసుకోవచ్చును. ప్రజాశక్తి బుక్‌హౌస్, హైదరాబాద్ పేరిట డి.డి./ఎం.ఓ. తీసి పంపవలెను.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M296 |
| పుస్తకం పేరు | సాహిత్య ప్రస్థానం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | madh |
| పేజీలు విడదీసినది | MADHU |
| స్కాన్ చేసినది | KDaveed |
| పరీక్ష చేసినది | PRIYANKA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |